# శ్రీ శివలీలా తరంగిణి





గురుదేవ కృపాకలనన్ । గురుతుగ రచియించినాడ కోమల భావా
కరమౌ "శ్రీ శివలీలా । తరంగిణిన్" దీని జదివి ధన్యత గానుడీ.



రచయిత:
శ్రీ వెన్నెలగంటి లక్ష్మీనరసింహారావు

ప్రచురణ:
శ్రీ శిశు గ్రంథమాల
శారద నగరు, హైదరాబాదు-500 267

# విషయ సూచిక





హరిః ఓం శ్రీ గురుభ్యో నమః

# శ్రీ గురుదేవుల చరితము

అస్మద్గురుదేవులగు పూజ్యశ్రీ శివస్వామిజీ, శివ మహాస్వామిజీ, శివ కుమార స్వామిజీ, గాయత్రీ స్వామిజీ, సోమసన్యాధ భారతీస్వామిజీ, మరైకందనంబి స్వామిజీ, చతుర్వేది స్వామిజీ, తత్వానిధానస్వామీత్యాది చతుర్వింశతి నామ విభ్రాజితులైన శ్రీశ్రీశ్రీ అవధూత శివ మహాస్వామివారి చరణ సరోజములకు భక్తి పురస్సరముగా తొలుదొల్త నమోవాకములర్పించుచూ నే వ్రాయంబూను "శ్రీ శివలీలాతరంగిణి"కి ముందు శ్రీవారి చరిత్రను విన్నది కన్నది పాఠకులకు తెలిపి, ఆ పిమ్మట రచనం బూనుదును.

శ్రీకరమయి శివకరమయి
శ్రీ కారోంకార శబ్ద సింధూర్మికయౌ
నీ కరుణాతి శయము సుగు
ణాకర ! కడుభక్తినెంతు నవధూతశివా.

స్వామీ ! శ్రీ గురుదేవా ! స్వామీ ! శ్రీ శివకుమార ! ప్రార్థింతు నినున్
స్వామీ ! నను కృపజూడుము ! స్వామీ యొనరింతు నీకు సాష్టాంగనతుల్

ఏ మహనీయమూర్తి నిఖిలేశుడు శ్రీ గురుదేవుంగాంచుచున్
క్షేమము గూర్ప శ్రీ గిరిని చెన్నుగనుండియు పిల్చినట్టులన్
నా మనవిన్ గ్రహించి కరుణన్ మముబ్రోవగనున్న శ్రీ శివ
స్వామిని సన్నుతింతుశుభ సంపదలన్ దయసేయ నిత్యమున్

నీ సేవయె మా కభయము। నీ సేవయె మాకు రక్ష నీవెహితంబున్
నీ సేవ పెన్నిధానము। నీ సేవాభాగ్యమెల్లసిద్ధియగు మాకున్

నన్ను ననుగ్రహించుటకే నా కొఱకే, కరుణా ప్రపూర్ణ సం
పన్న కళాప్రభావ పరివర్ధన శోభిత పుణ్యమూర్తివై
సన్నుత సత్యమూర్తివయి సత్వర మచ్చమపేట వచ్చితే
నిన్ను నుతింతు నా మదిని నిత్యము తత్వనిధానమా ! నతుల్.

నీదౌ దర్శనభాగ్య మబ్బెననుచున్ నిస్సార సంసార భీ
షాదభ్ర ప్రతిబంధ కోదధి తరంగోత్తాల ఝంఝాప్రమా
దాది క్లేశములన్ దొలంగుటకునిన్నర్థించితిన్ శ్రీ చతు
ర్వేది స్వామి ! గ్రహింపు నిర్మల మనఃప్రేమ ప్రసూనాంజలుల్.

"శివ కుమారస్వామి" సేవ జేసెదనీకు
స్థిర చిత్తునిగ నన్ను జేయుమయ్య
"భవ్యసోమస్కంద భారతీ స్వామిజీ"
యని పల్కుచుందు నన్నరయు మయ్య
"గాయత్రి స్వామి" నీ గాథల వర్ణింతు
క్రమ శబ్దార్థముల్ గఱపుమయ్య
ప్రియ "మరైకందనంబి స్వామి" నిను నేను
దలతు వేదోక్తుల దెలుపుమయ్య

శ్రీ చతుర్వేదిస్వామి" నిన్ జేరికొలుతు
వందనంబిదె "శ్రీశివస్వామి" నీకు
భక్తి "తత్త్వ నిదానమ" స్వామి నీకు
హృదయ కుసుమాంజలిని నిత్తు ప్రీతిగొనుము.

ఏ మహనీయు జన్మము మహీవలయంబున దివ్యపుణ్య సం
ధామమునై సమస్త దురిత ప్రకర ప్రబలాభిఘాతమై
క్షేమ కరంబునై విజయ జీవన లబ్ధ శరాభిరామమై
శ్రీ మదనంతమై కలిగె సిద్ధివహించుచు రెండు మారులున్.

మహితప్రశాంత "సోమస్కంద భారతీ
స్వామి" నా బరగిన సౌమ్యుడెవడు
శ్రీశైల కందర స్థిర నివాసమొనర్చి
తప మొనర్చినయట్టి ధన్యుడెవఁడు
నిస్వార్థుఁడై నిత్యనిత్యోపాసకుఁడునై
హిత ముపదేశించు చతురుడెవడు
ఆ జన్మమునినాథులగు బాలబాలికా
చయమును పోషించు జనకుడెవడు

ప్రస్తుతింపంగదగునట్టి పరమ యతివ
రేణ్యు విజ్ఞాన సంపద్వ రేణ్యునతుల
విమల భావప్రకాశ సత్పవృత్త చరిత
వైభవోన్నతుడగు శివ స్వామినెపుడు.

నేశివడన్ నిజంబుగ గనిష్టుడనేర్వననాది నుండి ప్రా
చీనులు పల్కుబల్కెద వచింప రచింప పరీక్షమింపగా
నైనను నేనెవండ తెలియంగను సర్వమయుండొకండు సం
ధానమొనర్చునట్టి పరదైవమ పీ వెయటంచుబల్కెదన్.

గురుదేవుని నిశ్చయముగ
స్మరియించుట వలన కార్య సాఫల్యమగున్
స్థిరముగ శ్రీశైలమ్మున
దరలెదు గురుదేవ నిన్ను దలతును భక్తిన్:—

బ్రతుకుబాటలో పయనించు మానవులకు దైవచింతనయే దారిబత్తెము. ఐహికవ్యాపారములో అలసిన హృదయాలకు ఆముష్మిక చింతనయే విశ్రాంతి కేంద్రము. జీవన సమస్యయే జీవితములో ప్రముఖస్థానము వహించిన వర్తమానసాంఘిక వ్యవస్థలో దైవధ్యానము ప్రతివ్యక్తికి మిక్కిలి ధైర్యము ప్రసాదించగల దివ్యామృతము. అందులకు మనబోటి సామాన్య మానవులందరకు త్రిమూర్తిస్వరూపులైన గురుదేవుల కరుణా కటాక్షము పరంపరగ వచ్చుచునే ఉన్నది. ఇది మన ఆర్ష సంప్రదాయములో ఒక చక్కని పద్ధతి

కూడ. మనకంటె మిక్కిలి జ్ఞానము తమ తపశ్శక్తిచే సముపార్జించుకొని దానిలో కొంతభాగము మన శ్రేయస్సుకు ధారపోయు మహనీయులకు మన పుణ్యభూమి కాణాచి. అట్టి మహానుభావులలో అగ్రగణ్యులు అవధూతశివమహాస్వామిజీ, వారి జీవితములో ప్రతిఘట్టము మనకు ప్రబోధాత్మకమే. వారు పర్యటించిన ప్రతిప్రాంతము మనకు యాత్రాస్థలమే, వారు పలికిన ప్రతి పలుకు భవరోగమునకు దివ్యౌషధమే. అట్టి దివ్యతేజోమూర్తి జీవితము ప్రసాదించిన కాంతికిరణాల వెలుగుబాటలో మనమును ప్రయాణించి మానవ జీవిత లక్ష్యము చేరుకొందము గాక!

అవధూత శివమహాస్వామిజీ పూర్వాశ్రమములో శిఖాకొళం (శ్రీకాకుళం) జిల్లాలో జన్మించినారు. నియోగిలింగధారి బ్రాహ్మణులు. ఐదు సంవత్సరముల వయస్సు నుండి భగవంతుని లీలలకు వారిజీవితము ప్రత్యక్ష సాక్ష్యమైనది. గృహదహనమువల్ల స్వామివారి తల్లిదండ్రులు, మేనమామలు అగ్నికి ఆహుతులైరి. సంపన్న సంప్రదాయ కుటుంబమునకు చెందిన వీరు నిరాడంబరముగ అమలు చేసికొన్న జీవితవిధానము ప్రతిమానవునికి ఆదర్శప్రాయము.

విధిప్రేరణచే స్వామీజీ శృంగేరిపీఠముచేరి చిన్నతనముననే సన్యసించినారు. తరువాత ప్రశాంత వాతావరణసంయుతము, పవిత్రభావసమన్వితమునైన హిమగిరి ప్రాంతమునకు వెళ్ళి స్వామీజీ తపోనిష్ఠాగరిష్ఠులైరి. అక్కడనుండి సిద్ధగురు కృపచే శ్రీశైల సిద్ధకూటముచేరి గురుదంపతుల కృపకు పాత్రులై తపస్సిద్ధినొంది గురుదేవుల యాజ్ఞానువర్తులై "అవధూత శివమహాస్వామి" అను నామముతో వ్యవహరింపసాగిరి. శ్రీస్వామీజీ తఱచుగ సిద్ధ సంప్రదాయముననుసరించు గృహస్థుల యోగక్షేమములను ఆప్యాయతతో పరిశీలించువారు.

నిరంతరము భారతదేశములో పర్యటన చేయుచు ముముక్షువులకు హితబోధచేయు స్వామీజీని "శివకుమారస్వామి" "సోమస్కందభారతీస్వామి" "గాయత్రీస్వామి" మరైకందనంబిస్వామి" "చతుర్వేదిస్వామి" "తత్త్వనిధానము" శివమహాస్వామి ఇత్యాది చతుర్వింశతి నామధేయములతో వ్యవహరింపబడిరి. శ్రీ స్వామీజీ మనదేశములో పెక్కుచోట్ల ఆశ్రమములు కూడ స్థాపించినారు. అవి నేటికిని చక్కగ నిర్వహించబడుచున్నవి. కేరళ రాష్ట్రము లోని శివగిరిలో వీరి ఆశ్రమము శ్రీనారాయణ గురునాథ్ నిర్వహించుచున్నారు. మైసూరు రాష్ట్రములో ఆకుంభాశ్రమము స్థాపించినది శ్రీస్వామీజీయే. దేహ

రాడూన్ దగ్గర "యజ్ఞనారాయణ'' పోవు మార్గములోగల సిద్ధకుంభలో శివ్యనాథప్రసాద్ - దీర్ఘగిరినాథ్ పర్యవేక్షణలో నడుచుచున్న ఆశ్రమము స్వాములవారిదే. ఆంధ్రదేశములోని శ్రీకాకుళం జిల్లా చీపురుపల్లి తాలూకా ''ఎందువ" గ్రామములో శివభారత్‌పీఠం స్వామీజీ స్థాపించినదే. అవధూత కేశవతీర్థనాథ్ పర్యవేక్షణలో ఉన్న శ్రీకైలాసాశ్రమం స్వామీజీకి సంబంధించినదే అమరావతిలో శివవిహార్ సాక్షాత్తు శ్రీస్వామీజీ ఆదేశానుసారము అవిర్భవించినదే., శ్రీస్వాములవారు. స్థాపించిన ఆశ్రమములలో గురుపాదుకలు గలిగి మిక్కిలి భక్తిశ్రద్ధలతో నిరంతరము పూజాకార్యక్రమములతో నిండియుండు "శివవిహార్" విశిష్టమైనది. ఈ ఆశ్రమస్థాపన గూర్చి తప్పక తెలిసికొనవలసి యున్నది.

## "శి వ వి హా ర్"

స్వామీజీ 1957లో అమరావతి వేంచేసిరి. అప్పుడు అక్కడ పోలీసు సబ్‌ఇనస్పెక్టరుగా పనిచేయుచున్న చీమకుర్తి లక్ష్మీకాంతారావుగారి యింట స్వామీజీ కొంతకాలము బసచేసిరి. ఆ యింటి వాతావరణము స్వామివారికి సంతృప్తి కలిగించినది. అప్పుడు స్వామీజీ అభీష్టానుసారం కాంతారావు దంపతులు తమ గృహమును వారి ఆశ్రమమునకై సమర్పించిరి. తరువాత కాంతారావుగారు ఎక్కడ ఉద్యోగధర్మము నిర్వర్తించుచుండెడివారో స్వాముల వారును పిలునుబట్టి అక్కడకు వెళ్ళెడివారు. అక్కడి ప్రజలకు పారమార్థిక విషయములు వివరించుచుండెడివారు. అట్టి పరిస్థితులలోనే స్వామీజీ కొంతకాలం అచ్చమ్మపేటలో కూడ ఉండుట జరిగినది. అట్టి సందర్భములో వారి సేవా భాగ్యము మాకు కలిగినది.

1957లో సంకల్పించిన స్వామీజీ ఆశ్రమం అమరావతిలో 1967 నాటికి ఒకరూపము సంతరించుకొన్నది. అప్పుడే శ్రీ గురుదేవుల ఆదేశానుసారం ఆశ్రమమునకు "శివవిహార్" అను నామకరణము చేయబడి అందు స్వామీజీచే గురుపాదుకలుంచబడినవి. మరియు "శివవిహార్"లో జ్యోతిర్లింగముతో కూడిన పంచలింగములు. దక్షిణావృత శంఖము కూడ స్వామివారు కాంతారావుగారి అధీనములో ఉంచిరి. ఈ దైవిక పరికరములు శ్రీ స్వామివారు ''శివవిహార్'' నందు మాత్రమే ఉంచిరి. ఇప్పటికిని వానిని దర్శించుటకు భక్తులు ప్రజలు శివవిహార్‌కు వచ్చుచునే ఉందురు. (యున్నారు)

పంచారామములతో ప్రఖ్యాతిగన్న అమరావతిలో కృష్ణవేణీ నదీతీరమున క్రౌంచిగిరిపై ఏర్పడిన "శివవిహార్" అమరావతి ప్రత్యేకతకు, అక్కడి పవిత్ర వాతావరణమునకు శాశ్వతమైన కళారేఖను ప్రసాదించుచున్నది.

ఈ విధముగ అధ్యాత్మిక జీవనమునకు అనేకులను అవకాశమిచ్చిన అవధూత శివమహాస్వామీజీ అజన్మ బ్రహ్మచారులు. అనాథులను పోషించిన పుణ్యమూర్తి. శ్రీశైల కందరస్థిరనివాసమేర్పరచుకొన్న సిద్ధమూర్తి.

## మరికొన్ని విశేషాంశములు

శ్రీ స్వామీజీ 1888 వ సంవత్సరములో అనగా సర్వజిత్తు నామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ పాడ్యమి కృత్తికా నక్షత్రమందు జన్మించిరి.

శ్రీ గురుదేవుని ఆదేశానుసారము స్వామీజీ లిఖించిన "శ్రీ పద్మకోశ పీఠాధీశ్వరి శ్రీ భద్రమ్మవారి చరిత్ర "శివవిహార్"లోనే యున్నది. కాంతారావు దంపతులు కీర్తిశేషులగుటచే సదరు "శివవిహార్" వారి అల్లుడుగారగు శ్రీ జె. సత్యనారాయణమూర్తి, M.A; LL.B., అడ్వకేటు - 13/442, ఫతక్ వీధి, మట్వాడ, వరంగల్‌కు తరలించబడినది.

నరసారావుపేట కాలేజీ హిందీ లెక్చరరు శ్రీ పోలూరు రామకృష్ణయ్య గారు హిందీలోను-తెలుగులోను స్వామీజీని గూర్చి కవితలల్లిరి.

శ్రీ చింతలపాటి నరసింహ దీక్షిత శర్మగారు కూడ స్వామీజీని గురించి కవితాంజలులు సమర్పించిరి.

## శ్రీ గురుదేవుల సందేశము

(1) సర్వదేవతా స్వరూపునిగా గురువును విశ్వసించి సేవింపుము. తప్పక గురువుయొక్క ఆశీస్సు పొందగలవు.

(2) ప్రతి వ్యక్తి గాయత్రీ అనుష్ఠానమునకు ప్రాముఖ్య మీయవలెను.

(3) చిరంజీవులారా! చిన్నతనము నుండియే భగవంతుని యెడ భక్తి విశ్వాసములు అలవరచుకొనుడు.

(4) ప్రతిజీవియు తన గమ్యస్థానము శ్రీ చక్రేశ్వరీ చక్రేశ్వరులేయని నమ్మి జీవయాత్ర సాగించవలెను.

(5) శ్రీశైల సిద్ధకూటమునందు గల "గురుదంపతులు" ఆశీస్సును పొందుటకై చిత్తశుద్ధితో ప్రయత్నించుట ప్రతివ్యక్తికి కర్తవ్యము.

(6) "శరీర మర్థం ప్రాణంచ సద్గురుభ్యోని వేదయేత్"

(7) అహంకార - మమకారములు రెండును ప్రమాదమైనవే.

(8) ప్రతిస్త్రీకి ఆదర్శం "అనసూయ"

(9) పాతివ్రత్యము గల స్త్రీ త్రిశక్తులకంటె శక్తిమంతురాలు.

ఓం తత్సత్

# పండితాభిప్రాయములు

## అక్షరానందాభిషేకము

శ్రీ పోలూరి రామకృష్ణయ్యగారు M. A.
ప్రకాశనగరు
నర్సారావుపేట

'శ్రీ శివలీలాతరంగిణి' యను చిన్న పొత్తమును శ్రీ వెన్నెలగంటి లక్ష్మీనరసింహారావుగారు రచించిరి శ్రీ గురుదేవులను దెలుపుతూ వారి మహిమల నెఱిగించిన శ్రీ శ్రీ శ్రీ 'శివమహాస్వామి' వారి కరుణాకటాక్ష వీక్షణము వీరికి లభించినది తదుత్తమ సేవాప్రయోజన మీభక్తి భావబంధురు లైన శ్రీ వెన్నెలగంటి లక్ష్మీనసింహారావుగారిని తరించుటకు మార్గము జూపినది. ఆ గురుదేవ తత్త్వవికాసమే యిట్టి రచనామార్గము నందు ఈ రచయితను ప్రవర్తింపజేసినది. తాను తరించుటకు శ్రీ శివమహాస్వామివారి సేవను చేసియున్నారు. ఇది వీరి జన్మమును ధన్యమొనర్చుటలో సర్వవిధముల చేయూత నొసంగెననుటలో సందేహింపనక్కరలేదు.

వీరు ఉపాధ్యాయ వృత్తిలో నున్నప్పుడు రచనాశక్తి యొకింతయు ప్రకాశింపక శ్రీ స్వామివారి దర్శన భాగ్యమున నిగూఢమైన యీ విద్యాబీజము ఫలించి ఫలదీకరణము నొందుచున్నది. ఇప్పటికి పదిరచనలు సాగినవి. ఇది పదకొండవ రచన.

దీనికి ముందు 'శ్రీ రామకృష్ణ లీలాతరంగిణి' యను రచన సాగించిరి. వ్రాయటయే తడవు అయ్యవి గ్రంథరూపమున భక్తజన కరకమలములందు నలంకరింపబడుచున్నవి.

> చేతులారంగ శివుని పూజింపడేని
> నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని
> దయయు సత్యంబు లోనుగా దలపడేని
> కలుగనేటికి తల్లుల కడుపుచేటు' —

అని శ్రీ పోతనామాత్యులగారు భాగవతరచనా ప్రారంభమున తెపిలియుండిరి.

ఆ విధముననే హరికీర్తి ప్రసక్త్యనంతరము శ్రీ శివలీలాతరంగిణియను పేరుతో శివంకరమైన శివపూజా దురంధరుడై రచన సాగించి శివకేశవుల కభేదమును సంతరించి తరించినారు. ఈ సన్నివేశముచే తన జన్మమునకు కారకులైనట్టి తల్లిదండ్రులను తరింపజేసినారు.

ఈ కాలమున భగవద్భక్తి సన్నగిల్లినదనుటలో సందియములేదు.

"ఉగ్రరోగ సంకలితులు, మందభాగ్యులు, సుకర్మము లెవ్వియు జేయ జాలరీ కలియుగమందు మానవులు గావున, నెయ్యది సర్వసౌఖ్యమై యలవడు, నేమిటంబోడము ఆత్మకు శాంతి మునీంద్ర! సెప్పవే' అని సూతుని శౌనకాది మునీంద్రులడిగినట్లు భాగవత ప్రథమ స్కంధములోనున్నది. ఈ పద్యమున కనుగుణ్యమైన శ్లోకము ఎప్పుడో వ్రాయబడినది. కలికాలమున జరుగనున్న, జరుగుచున్న, పరిస్థితులను యోగదృష్టియను కెమెరా ద్వారా వేదవ్యాస మహర్షి ఫోటోను తీసినారు.

ఇటువంటి రచనలు అనగా వచన రూపమున వ్రాయుట ఒకవిశేషము - శ్రీ నరసింహారావుగారు శ్రీ శివస్వామివారి అనుగ్రహమున భక్తి పూరితము లైన విశేషములను నలుగురికి అందుబాటులో ఉండునట్లు వ్రాయుచున్నారు. ఇది సారస్వతయజ్ఞము - యజ్ఞపాలనము విద్యనుకూలముగ నిర్వర్తించిన సార్థక జన్మలభించును - అది వీరియందు నివ్వటిల్లుచున్నది. ఆవాస్తవికత భక్త్యాలోకనమై గ్రంథ ముద్రణమునకు తోడుపాటొనగుచున్నది.

సిద్ధపురుషులనబడు వీరి గురుదేవులు శ్రీ లక్ష్మనరసింహారావుగారిని కరుణించుచూ మా గురుదేవులై మమ్మును కటాక్షింపుదురని విశ్వసించుచూ శ్రీ శివమహాస్వామివారికి నమోవాకములర్పించుచున్నాను.



# "శివస్మరణము"

"కులపతి" కొంపల్లి అంజనేయశాస్త్రి
M.A., M.Ed.
విద్యాప్రవీణ - భాషాప్రవీణ
ఇం నెం. 8-1-50, శ్రీకృష్ణకాలనీ
స్టేషన్‌రోడ్డు, వరంగల్లు-2.

శివలీలలు పెక్కువిధములు. అట్టి శివలీలను గూర్చి శ్రీ వెన్నెలకంటి
లక్ష్మీనరసింహారావుగారు సర్వమంగళానుగ్రహమును పొంది వివరించ
సంకల్పించిరి. శైవము ప్రాచీనము. ఇందు పూర్వోత్తరశైవుల విధానములను
సంగ్రహముగ రచయిత గ్రహించిరి. శివనామమహత్త్వము గొప్పది. శివతత్త్వ
రహస్యమే గురుతత్త్వము. గురుజ్ఞాన తత్త్వమే బ్రహ్మము బ్రహ్మమే జ్ఞానము.
జ్ఞానమే అద్వైతభావన. అట్టి భావనను హృదయ పీఠికలో నిల్పి నిత్యానంద
సంధానము చేయు శక్తిమంతుడు గురువు. అట్టి గురుప్రచరితులైన
శ్రీ వెన్నెలకంటివారు శివతత్త్వమును తెలుప సమకట్టిరి.

శైవమత విజృంభణముతో జైనమును తనలో గలుపుకొనినది. సిద్ధులు
శివమునులైనారు. సిద్ధము పొందుటకై "ఓంనమః శివాయః సిద్ధంనమః"
అను శివమంత్రముతో అక్షరాభ్యాసము ఆంధ్రమున ప్రారంభించుచున్నారను
చారిత్రిక విషయమును కవిగారు తెలుప సమకట్టిరి. "రవికాననిచో కవిగాంచునే
గదా!" అనుమాట శ్రీ వెన్నెలగంటి కవిగారి విషయములో సార్థకము.

నేటి ప్రపంచములో ప్రజలెటు వెళ్ళుచున్నారో గమనించినవారికి
ఆధ్యాత్మిక తత్త్వమును - ఆత్మ స్వరూపమును శ్రీ వెన్నెలకంటివారు
వివరించిరి.

"శివ" అనగా శివుడు. "శివా" అనగా పార్వతి పార్వతీ పరమేశ్వరుల
సమైక్య రూపమే "శివ" అనుపదము "శివతయచ" అను యజుర్వేద
నిర్వచనము ప్రకారము "శివ" నామస్మరణచే తరింపశక్యమగును.

పరమేశ్వరుని సర్వనామములోను అతితేలికగ స్మరించతగినది. "శివ"
నామము "శివ" నామస్మరణచేతను; "శివపూజ" చేతను ఈ మానవ జన్మ
చివరిజన్మయగును.

శ్రీ వెన్నెలకంటి లక్షీనరసింహారావుగారు "శివలీలాతరంగిణి" అను
కుసుమమును "ఒక పుష్పంబు భవత్పదద్వయముపై నాసంగ సద్భక్తి
రంజనుడై పెట్టిన పుణ్యమూర్తికి పునర్జన్మంబులేదను" సూక్తిని దృష్టిలో
నుంచుకొని శివునికి సద్భక్తితో నమర్పించి ధన్యులైరి.

# శిఖరదర్శనము

**Dr. D. MURALIKRISHNA**
M. A. Ph. D; P. G. S. D (Sanskrit)
Lecturer. Dept. of Telugu,
R. V. V. N. College, Dharanikota,
Amaravathi.

మాన్యమహోదయులు శ్రీ వెన్నెలగంటి లక్ష్మీనరసింహారావుగారు రచించిన 'శ్రీ శివలీలాతరంగిణి' మానవలోకమునకు భగవతత్త్వమునకు భక్తి భావ సూత్రముచే బ్రహ్మ ముడివేసిన ఉదారగ్రంథము. 'నాన్యృషిఃకురుతేకావ్యమ్, ఋషిశ్చకిలదర్శనాత్'— అన్న ఆర్యోక్తికి తగినట్లుగా, దార్శనికదృక్పథ సమభిలాషులగు వీరిగ్రంథము సామాన్యమానవాళికి వెన్నెల చలువలు వెలువలుగా ప్రసాదించగలదనుట సత్యసమ్మతమైన విషయము.

ఆ వాచావేదాంతమునకన్న అనుష్ఠానవేదాంతము గొప్పది. అట్టి సత్కర్మానుష్ఠానసంపన్నులు, భక్తాగ్రేసరులునైన వీరి రచనము వేదాంతరహస్య దర్శనమునకు మణిదీపిక.

బ్రహ్మవైవర్తక, తైత్తిరీయోపనిషదంతర్గత భగవత్తత్త్వావిష్కరణమును చేయుటలో వీరి మార్గము పండిత పామర జనామోద యోగ్యముగా నున్నది. అయఃపిండసదృశమైన వేదాంత సిద్ధాంతమును పయఃపిచ్ఛిలముగా సోదర ప్రజానీకమున కందించుచుండిన వీరికృషి భగవత్ప్రీతిపాత్రమనుటలో సందేహము లేదు.

ఒక్కమాటలో చెప్పవలయునన్నచో బంగారు ముద్దవలెనున్న వేదాంత పరమార్థమును నానావిధాభరణములుగా సంతరించి, సామాన్య ప్రజానీకమునకు ధారణ యోగ్యముగా నొనర్చిన మహనీయులు శ్రీ వెన్నెలగంటివారు- వారి రచనము ఆర్షధర్మానుసారులకు శుభప్రవచనము—

'సులలిత సౌకుమార్య గుణశోభితమై నవభక్తిభావనా
కలితము, తత్త్వసారము వికారవిదూరము ధర్మబోధమై
చెలగుచు శైవలీలల విశిష్టత నెన్నెడి మీకృతిప్రభల్
చలువల వెన్నెలల్ జగతి జల్లును, వెన్నెలగంటి సత్కవీ!

# సుధాభిషేకము

శ్రీ చింతలపాటి నరసింహదీక్షిత శర్మగారు
భాషాప్రవీణ కవిరాజమౌళి
కోగంటిపాలెం
అగ్రహారము

శ్రీమంతులు, భక్తిభరితస్వాంతులు, అనుభవ పరిపాక కలితులునగు 'శ్రీ వెన్నెలగంటి లక్ష్మీనరసింహారావుగారు' శుద్ధాద్వైతతత్వ ప్రధానుసారులై ఆదిశంకరుల వేదాంతసారమును మననమొనర్చి. హరిహరాద్వైత సత్యమును గుర్తించుటకు రత్నఖనివలెయున్నది. విశాల పర్వతము అద్దమున ప్రతిబింబించు మాడ్కి ఈ చిఱుకబ్బమున శివతత్వలీలయంతయు సంగ్రహమయ్యు విస్తృతి పథమలంకరించినది. ఇది ప్రతి వారికిని అశ్యపఠనీయ గ్రంథము

'కోటిజన్మార్జితైః పుణ్యైశ్శివేభక్తిః ప్రజాయతే'

అని సూక్తి నిజముగా నరసింహారావుగారు సాటివారిలో ధన్యజీవులని చెప్ప వలెను. నామరూపములచే శివుడగు పరమేశ్వరుడు సర్వమంగళాంకృతుడై ఈ కవిగారి హృదయ పీఠమున విలసిల్లి నిత్యానంద పదవీ రసముగ్ధునొనర్చుగాత! యని నా అభిలాష.





## శ్రీ గురుదేవులు
## శ్రీ శ్రీ శ్రీ శివమహాస్వామివారు
## సమర్పణ

శ్రీ శివలీలా సారము । పాశవికత్వమ్ముఁ బాపి పరమార్థ శ్రీ
వైశిష్ట్య మొసగుగావుత । శ్రీ శివదేవ! దీనిఁజేకొనుమయ్యా! ॥

జ్యోతిస్స్వరూపుఁడౌ శివు । రీతిన్ జ్ఞానప్రసాదరేఖా శ్రీ వి
ఖ్యాతుఁడవు సద్గురుండవు । చేతమ్మున దీనిమెచ్చి చేకొనుమార్యా! ॥

సిద్ధయోగివీవు "శ్రీ శివలీలా త
రంగిణి"ని మునింగి రక్తిపొంగి
దీవనల నొసంగి దేవ! వీక్షింపు మీ
సుప్రసన్నదృష్టి శోభిలంగ ॥

ఓం తత్సత్.



లక్ష్మీహృదబ్జ భాస్కర । సూక్ష్మజ్ఞాన ప్రభావ శోభిత రేఖా ।
లక్ష్మ శ్రీ శంఖాద్యా । భా, క్ష్మాధవ దేవదేవ భక్తశరణ్యా ॥

శ్రీ శివాయ గురవేనమః

# కృతజ్ఞతాంజలి

అస్మద్గురుదేవులగు పూజ్య శ్రీ శ్రీ శ్రీ అవధూత శివమహాస్వామివారికి నమోవాకములు.

శ్రీ మదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండును, కలియుగ దేవుండును, శ్రీ అలమేల్మంగా పద్మావతీ సమేత వేంకటరమణుండును, మదీయ సుమంగళ గీతానాథుండును, జగదేకరక్షకుడైన శ్రీ శ్రీనివాసమూర్తి దేవస్థాన పరిషత్తును అభ్యర్థించితిని. వారు గ్రంథ ప్రాశస్త్యమును గుర్తించి ఉదారభావముతో సాయ మొనర్చిరి. అట్లే భక్తవర్యులుగూడ తగినంత శ్రద్ధాశక్తులతో చేయూతనిచ్చిరి. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలి సమర్పించుచున్నాడ.

శ్రీనివాసుడు విజయలక్ష్మి ప్రదాత
యగుచు భక్తావళికి మోదమందజేయు
సత్యశివసుందరాత్మక శక్తియుక్తి
కలుగజేయుత తిరుపతి తిలకభూష !

రెండు మాటలు :-

ఈ కృతికి వెలుగును ప్రసాదించిన పుణ్యపురుషులు - చతుర్వింశతినామ విభ్రాజితులైన శ్రీ శ్రీ శ్రీ అవధూత శివమహాస్వామివారి చరణ సరోజములకు భక్తిపురస్సరముగా తొలుదొల్త నమోవాకము లర్పింతును.

సహృదయులకు, సారస్వత రసికులకు, భక్తులకుమా శివ గ్రంథమాల మహారాజ పోషకులకు, రాజ పోషకులకు, పోషకులకు నమోవాకములు - శ్రీ గురుదేవు నాజ్ఞానుసారము వారు చూపిన వెలుగులో నడచుచు నేను సారస్వత కృషి కొంత కొంత చేసి ఈ "శ్రీ శివలీలా తరంగిణి" గుదిగూర్చితిని. దీనితోడు "ఆధ్యాత్మిక మతావశ్యకత, శ్రీ గీతాచార్య సందేశము, అద్వైత భావన, శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జునుల సుప్రభాత దండకము (ద్వితీయ ముద్రణ), కళ్యాణ మణిమాలిక, సంసార దీపము" అనువానిని అనుసంధించి నాకుగల భక్తిభావనాలేశమును ప్రకటించితిని. దీనియందు గల మంచి మీకు మంచి కలిగించిన నేను ధన్యుడను. గుణదోష నిరూపణలో హంసప్రాయులైన మీకు నేను వేరుగా జెప్పనవసరము లేదు.

శ్రీ శివనామ మహిమ, శ్రీ శివరాత్రి మహిమ, శ్రీ శివావతారములు, శ్రీ నటరాజస్వామివారి మూర్తినిర్ణయము మున్నగు శివభక్తి భరితమైన "శ్రీ శివలీలా తరంగిణి"గా మీ ముందుంచితి. కాన పరిమళ మాఘ్రాణించి జ్ఞాననిధులై తరింతురని కోరుకొనుచు, ఈ గ్రంథమునకు వన్నెచిన్నెలు కల్పించిన ఆంధ్రోపన్యాసకులు శ్రీ కొంపల్లి ఆంజనేయశాస్త్రి, M. A; M Ed. గారికిని, చిరంజీవి డాక్టరు డి. మురళీకృష్ణ, M.A; Ph.D; P.G.S.D (Sanskrit) లెక్చరర్ గారికిని, శ్రీ శివమహాస్వామివారి శిష్యాగ్రగణ్యులగు శ్రీ పోలూరు రామకృష్ణయ్య, M. A. గారికిని, భాషాప్రవీణ, కవిరాజమౌళి చిరంజీవి చింతలపాటి నరసింహదీక్షితశర్మగార్లకును నమస్సులు, ఆశీస్సుల నందించు చున్నాడను.

"శ్రీ శివలీలాతరంగిణి" యను నీ గ్రంథమును రచించుటలో అనేక గ్రంథములు నాకు మిక్కిలి సాయపడినవి. నాకు దోడ్పడిన గ్రంథకర్తలకు నే నెంతయు కృతజ్ఞుడను.

ఈ గ్రంథ ముద్రణకు సహకరించిన భక్తమణులగు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ పి వి. ఆర్. ప్రసాదుగారికిని, పబ్లిక్ రెలేషన్స్ ఆఫీసరు శ్రీ రావుల సూర్యనారాయణమూర్తిగారికిని, ఎడిటర్ శ్రీ కె. సుబ్బారావు, M. A. గారికిని, విద్వత్ కమిటీవారికిని నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలి సమర్పించుకొనుచున్నాను.

ఈ గ్రంథమును ముచ్చటగ ముద్రణమును ముగించి తగినంతలో నా కందించిన శ్రీ వివేకానంద ప్రింటర్సు ప్రొప్రైటరు శ్రీ అద్దేపల్లి నాగేశ్వర రావుగారికిని, మేనేజరు శ్రీ అద్దేపల్లి చెన్న కేశవరావుగారికిని, వారి సిబ్బందికిని నా హృదయపూర్వకాభివందన సహస్రము లర్పించుచు శ్రీ గిరి గురుదంపతులు సర్వదా వారి శ్రేయస్సును గల్పించుగాత యని వేడుకొనుచున్నాను.

సర్వేజనాః సుఖినోభవన్తు.

ఇట్లు,
గ్రంథకర్త.



# వంశావళి

పరమ తపోమహత్వముల పంటలు గంపలకెత్తినట్టియా
"హారిత మునీంద్రచంద్రుదు" మహామహితాత్ముడు గోత్రకర్తయై
వరల గడించె నిద్ధమగువాసిని వెన్నెలగంటి వంశ మీ
ధర నిజకీర్తి చంద్రికలుదార సుధారసముల్ వెలార్పఁగన్.

ఆ పవిత్రవంశమ్మున నవతరించి
రాణగాంచెను విష్ణుపురాణకర్త
"సూర్యనార్యుడు" సుకవితా సుందరుండు
మంజు మంజుల గుణపుంజ మందిరుండు.

పొడమెఁ దదుపరి నా వంశముననే "లక్ష్మి
నరసు" పండితమౌళి, కైసరుడు, సుగుణి
అందెఁ బండిత మాన్యమ్ము లతడు మత్పి
తామహుండు సమగ్రయశోమహుండు.

"వేంకమాంబ" దయార్ధ్రి: సాధ్వీమతల్లి
యిల్లుదీర్పఁగ నా తాతయిద్ధతేజు
నా జనకు "సుబ్బయాఖ్యు" విరాజమాన
దీవిభువుఁగనె గణిత విద్యావిలాస.

రామాతిలకము నా జన । నీమణి "రామమ్మ" కీర్తి నెలకొనఁజేయన్
సీమమ్మున నా జనకుఁడు । సోమునివలె నిత్యవృద్ధి శోభిలె ధరణిన్.

ఆసయధన్యులం దుదయమందిన పుత్త్రిఁడ నేను నన్ను "ల
క్ష్మీనరసింహు" దందురు - రచించితిఁ గొన్ని కృతుల్ గురూత్తమ
ధ్యానఫలానులబ్ధ కవితాగరిమన్, వృషశైలనాథ సే
వానుభవ ప్రబుద్ధహృదయము భక్తిలతల్ సుమింపఁగన్.

"సీతారామా భిధ" సం । ప్రీతిన్ గృహలక్ష్మియగుచు శ్రీవలె వంశ
శ్రీ తళుకొత్తింపఁగ నీ । రీతిన్ గృహమేధి ధర్మరీతిన్ గొంటిన్.

ఋతువుల పోలిక నార్గురు । సుతులును, పుత్రిక యొకర్తు శోభను బెంపన్
సతతము భగవత్పదరతి । గతిఁగాఁ దలపోసి, గూర్తుఁగైతల తేనెల్.

మేలొసఁగు ప్రాథమిక వి । ద్యాలయములయందు నొజ్జనై బాలురకున్
వీలయినంతగ - గఱపితి । నేలోపములేనిరీతి నే నక్షరముల్.

వదలితి నొజ్జరికము నీ । పదసేవా తత్పరత్వ భాసితమతినై
సదమల జీవిత నౌకను । కదలించుచు నుంటిని వాలుగాలిని దేవా!

తల్లిదండ్రుల గోల్పోయి తల్లడిల్లు
నన్ను పోషించి వ్యక్తినొనర్చి మంచి
వెలుగు బాటలు గూర్చిన పెద్దతల్లి
మదిని తురుమెళ్ళ యీశ్వరమ్మను దలంతు.

ఇట్లు
గ్రంథకర్త.



# కల్యాణ మణి మాలిక

శ్రీకరమ్ములు - భక్తవాంఛిత ఫల ప్ర
దాకరమ్ములు - సుకృత పుష్పాకరములు
శ్రీలు కూర్చుత - భ్రామరీ శ్రీ గిరీశ
మంజు మంజుల కళ్యాణ మౌక్తికములు.

పరిణయ శ్రీవిలాస సంభావితములు
విశ్వకళ్యాణ సంధాన విశ్రుతములు
భ్రామరీ మల్లికార్జు నాపాంగరుచులు
విజ్ఞకోటికి వెలుగు కల్పించుగాత.

పెండ్లి వేదికపై కళా విభ్రమములు
వెలువరించుచు కనికరమ్ముల సమృద్ధి
నలరు భ్రమరాంబికా మల్లికార్జునుల వి
వాహలక్ష్మి సమగ్ర సౌభాగ్య మొసగు.

వలపు పంటలకుప్ప గుంపలకు నెత్తు
మానిత భ్రమరాంబికా మల్లికేశ
తరుణ చాంద్రీ మనోజ్ఞ మందస్మితములు
నిత్యనూతన చైతన్య నియతి నిడుత.

శ్రీ గిరీంద్ర సముత్తుంగ శృంగపీఠి
క్రొత్త వెలుగుల సొబగులు కువ్వవోయు
భ్రామరీ మల్లికార్జున పాదయుగళి
గులుకు పారాణి వెలుగు కల్ములు ఘటించు.

ఓం తత్సత్



# శ్రీ గణపతి తారావళి

శ్రీ జయలక్ష్మి వరః లీ । లాజయ నిలయా! సతమ్ము లక్ష్మిగణ రా
జా! జోతలిడుదు, నూతన । తేజమ్మిడుమయ్య గణపతీః నతసుకృతీః

సంచిత దురిత మడంచుము । దంచిత కరుణానిధీః జయప్రదః నిను సే
వించిన సిద్ధియు బుద్ధి ల । భించుగదా? సిద్ధిగణపతీః దివ్యమతీః

చింతామణి గణపతిః నా । స్వాంతమ్మున నిలిచి ప్రోవుమా! విజయశ్రీ
కాంతా! చిక్కువని ప్రా । ర్థింతును నిరతమ్ము గణపతీః శుద్ధమతీ!

ఓ యేకదంత గణపతి! । నా యేలికవగుచు సిద్ధినాయక! నిలు మీ
నా యెదద తమ్మి గద్దియ, । ద్యేయస్థితి వెలయ గణపతీ-మాన్యధృతీ।

శ్రీ వక్రతుండ గణనా । థా! వేడుకలూర వేడెద న్నవరతన్నః
శ్రీ వల్లభః నిన్ను వినా! । దేవు డెవండయ్య గణపతీః శుభసుకృతీ.

ఓ లక్ష్మిప్రద గణపతి! । నాలోని తమోగణంబణంచుము వీర
శ్రీలాస్య రంజితాస్య-సు । ధీలాలితమూర్తి! గణపతీః శ్రితసుమతీ.

రక్షించు "నింబగణపతి" । రక్షితబుధపక్షః బుద్ధిలక్ష్మిప్రియ! నా
పక్షమున నిలిచి దయతో । వీక్షింపుమునన్ను-గణపతీ! సాధుమతీః

"లంబోదర గణపతి" యా । లంబనమ్షివయి కనికరమ్మున నాచే
తోంబుజమున నిలువుము తృ । ప్తిం బులకలు నిగుడ గణపతీః శుద్ధమతీః

ప్రణతులివె "ఋణవిమోచన" । గణపతిః సౌభాగ్యలక్ష్మి కాంతా గొలుతున్
గణుతింగొని కొందును కీ । ర్తిని లోకోత్తరము, గణపతీః సత్యమతీః

వందనము బుద్ధి లక్ష్మి ।సుంధరః శుక్లగణనాధః సురుచిర విద్యా
మందిర! శ్రీ వెలయగ ము । క్తిందిర నిడుమయ్య "గణపతీ" శ్రీవసతీః

శ్రీ ధూమ్ర గణపతీః లీ । లాధూర్వహః చరిత సిద్ధి లక్ష్మివరః నీ
గాధాళిగూర్తు, బ్రోవు...త్ర । యీధర్మనిబద్ధ! గణపతీః ధృతవికృతీః

నీవాడనంటి, కరుణా । భావమ్మున బ్రోవుమంటి, భక్తజనాళీ
భావితః సువర్ణదేవీ । దేవీప్రియః కృష్ణగణపతీః స్నిగ్ధపతీః

వరదాః మోడ్చెద నీకున్ । కరయుగళిన్ "రక్తవర్ణ గణనాయక!" నా
దురితము మాపుము పద్మా । ధిరమణ! గుణరమణః గణపతీః చిత్రకృతీః

దేవా౹ సువర్ణగణపతి । పావనగుణ౹ రంజితదేవి వల్లభ! అస్మద్
భావమున నిలుము - విలస । ద్ధివిభవోదార౹ గణపతీ౹ సత్యధృతీ!

ఓ విఘ్నగణపతీ౹ నే । గ్రైవారముచేయువాడ గ్రైకొమ్ము - ప్రజా
దేవీప్రియ! విఘ్నాశిని । దేవా౹ నిర్విఘ్నగణపతీ౹ నిత్యనుతీ౹

సేవింతు నతిప్రజ్ఞా । దేవీప్రియ౹ నాహృదబ్జ దివ్యమణీ
శ్రీవసతి నిలిచి యేలుము ।దేవా౹ నిర్విఘ్నగణపతీ౹ శుభవసతీ౹

శ్రీ భద్ర వికటగణపతి । నీభక్తియె నాయెడంద నెలకొనగా నెం
తో భావించెదనిక నీ । దే భారము బ్రోవగణపతీ౹— నతిసుకృతీ౹

ఓ బాలచంద్ర గణపతి । రేబవలున్ నీపదంబు హృన్మండలినే
శ్రీబుద్ధి ప్రదమును నెం । తే బొల్పుగ నిడుదు - గణపతీ! సత్యమతీ

సర్వాంబర గణపతి! నా । సర్వస్వము నీవశంబు సలిపి భజింతున్
దూర్వహుడ వీవె యేటికి । నిర్వాదీ మాటలిక - గణపతీ - శుద్ధకృతీ౹

శాంతాదేవీ వల్లభ । స్వాంతమ్మున గొలుతు నిన్ను సద్భక్తి సదా
దొంతరలై మేలొసగగ । నింతేనావాంఛ. గణపతి౹ దివ్యమతీ!

శ్రీ లోకమాతృవల్లభ । పాలించుము నిన్నుగొల్తు భావమునందున్
మేలొసగు దిక్కునీవే । ధీ లలితా౹ భద్రగణపతీ౹ సాధుమతీ!

ఎవ్వావి బరబ్రహ్మగ । నవ్వేదాంతులు వచింతురావిభు నిన్నున్
నివ్వటిలు భక్తిభావన । నెవ్వేళనుగొల్తు గణపతీ౹ సత్సుకృతీ!

కొందరు చతుర్ముఖుండని । కొందఱు విష్ణుడని ఎవని కొందఱు జీవుం
డందురో ఆనిను నవభ । క్తిందిర తగగొలుతు గణపతీ౹ నవ్యధృతీ౹

తెలివలువలుధరించుచు । నలువుగ విశ్వమ్మునిండి నాలుగు భుజముల్
వెలయగ చంద్రద్యుతి వ । ర్తిలు నినుభజియింతు గణపతీ!సత్యకృతీ౹

తలమీద పూపజాబిలి । తలతల చెందిరపు వన్నెతళు కొత్తంగా
నెలప్రాయము గులికెడు సుర । తిలకము నినుగొల్తు గణపతీ! మధురమతీ౹

హరిహర హిరణ్య గర్భులు । స్వరిపూహరణవేళ నెవని భజియించి జయేం
దిరగాంచిరొ యా ఘనునిను । దిరముగ నుతియింతు గణపతీ! సత్ప్రకృతీ౹

ఇన్నక్షత్ర సరమ్మను । వన్నెలు చెలువొంద కంఠభాగమ్మున నా
యన్నాధరింపు వేడెద । తిన్నని మతి నిమ్ము గణపతీ! విఘ్నపతీ౹

ఓం శాంతిః శాంతిః శాంతిః

# శ్రీ శివలీలా తరంగిణి

## శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జున సుప్రభాత దండకము

### -: శ్రీశైల క్షేత్రము :-

ఉత్తర ద్వారము - ఉమామహేశ్వరము.



పూర్వ ద్వారము - త్రిపురాంతకము.

శ్రీ మల్లికార్జునుడు శ్రీ భ్రమరాంబా సహితుడై శ్రీశైల సింహాసనమున శోభిల్లుచున్నారు - పరమేశ్వరుడు అష్టమూర్తుల నధిష్ఠించి ప్రపంచమును పాలించుచున్నారు.

దక్షిణ ద్వారము - సిద్ధవటము.

హరిః ఓం శ్రీ గురుభ్యోనమః
(శ్రీశైల సుధాలహరి నుండి)

శ్రీ పోలూరి రామకృష్ణయ్యా

# ప్రార్థన

"శ్రీ శ్రీ శ్రీ గిరి మల్లికార్జున కృపాసిద్ధ్యర్థమై కారయి
త్రీ శ్రేష్ఠ భ్రమరాంబికా మృదుమనః ప్రీత్యర్థమై భక్తినే
నశ్రాంతాశ్రయ పర్వత ప్రథితసర్వాధిక్య సౌందర్య స
త్యశ్రేయస్కర వర్ణనన్ బలికెదన్ ధర్మాభిలాషుండనై -

చిరపుణ్య చరిత్రుల। శ్రీ గిరిసుందర సిద్ధకూట కీర్త్యాశ్రయులన్
నిరుపమ కరుణాసింధుల। "గురుదంపతులను" భజింతు గురుతరభక్తి।

ప్రేమస్వాంతమృదూక్తి నేను భగవత్ప్రీత్యర్థమై హృద్గత
ప్రామాణాక్షరవిద్య మానగురుదేవ ప్రార్థనన్ శ్రీ శివ
స్వామి ప్రేరణ చిత్తశుద్ధిగలుగన్ సమ్యక్కళా కేళిలో
ద్ధామస్నిగ్ధతి తీక్షసల్పెదను సిద్ధజ్ఞానసంపన్నతన్॥

రంగద్భంగ శుభాంగదివ్యతరధారావ్యాప్త పాతాళ గం
గాంగీకార వినమ్ర వర్తనుడనై యావన్మహా సిద్ధ సత్
సాంగత్యాభ్యుదయాభిలాషినయి శ్రీశైలేంద్ర సాంద్రోజ్జ్వలో
చ్ఛృంగోద్ధామ విభూతి దర్శనము నర్థింతున్ గళాసిద్ధికై

సాక్షాన్మోక్ష వరప్రసాదియని విశ్వవ్యాప్త కీర్తిచ్ఛటా
వీక్షాఖండ మనోజ్ఞమై వెలుగు భూభృద్రాజమున్ శ్రీగిరిన్
దీక్షాబద్ధ కరాంబుజాతమున భక్తిన్ మ్రొక్కి తత్ క్షేత్ర మా
తృ క్షీరాక్షరపానమాధురిని తృప్తిన్ గ్రోలి జీవించెదన్॥

ఆగణితపుణ్య సంచయ మహానిధులంబలె బ్రహ్మ విష్ణు రు
ద్రగిరులు శ్రీగిరిన్ నిఖిలధరాధర రామణీయక
ప్రగుణ పృథూన్నతాగ్ర మునిరాజులు నాదగియొప్పచున్న త
ద్భగవ దనన్యరూపులకు భక్తిని వందన మాచరించెదన్.

కృతకృత్యత్వ విలక్షణుండనయి నీ ప్రేమోన్నతాశీర్వచ,
ప్రతతీశ్రేయము తో సుశబ్ద రచనాభ్యాసమ్ము గావించి నా
బ్రతుకున్ సార్థకమొప్పజేసెదను సర్వజ్ఞున్ దపః ప్రౌఢిమో
న్నదచిత్తున్ గురుదేవుగాంచి గుగుణగణ్యా! శ్రీ శివ స్వామిజీ!

మదిలోనున్న సమస్తభావముల సూక్ష్మజ్ఞాన సంపన్న కో
విదనై పుణ్యముచే గ్రహించెదవు నావృత్తాంతమిమ్మాడ్కి గాం
చెదవంచున్ దయసేతువంచు సరస స్నేహోదయోల్లాసినై
హృదయోత్సాహము వెల్లడించితిని తండ్రీ! శ్రీ శివ స్వామిజీ!

నన్ను ననుగ్రహించుటకే నాకొఱకే కరుణాప్రపూర్ణ సం
పన్న కళాప్రభావ పరివర్ధనశోభిత పుణ్యమూర్తివై
సన్నుత సత్యమూర్తివయి సత్వర మచ్చమ్మపేట వచ్చితే
నిన్ను సతింతు నామదిని నిత్యము తత్వనిధానమా! నతుల్.

ఆస్వాదించెద యుష్మదీయ మృదుపాదాంభోజ మాధుర్య న
వ్యస్వచ్ఛాక్షయ సిద్ధసాంద్ర మకరందానేకనిష్యంద బిం
దుస్వాదుత్వము కల్మి నిన్ను వినుతింతున్ శ్రీమరైకండనం
దిస్వామీ! దయసేయుమయ్య, యిదె నావిశ్వాసమున్ దెల్పితిన్.

పుణ్యుని లింగమూర్తి గురుమూర్తివరేణ్యుని సత్యశీల స
ద్గణ్యుని సిద్ధపూరుషుని తత్పరభక్తి నుతింతు నింత కా
రుణ్యముతోడ సిద్ధుల నెరుంగ వచించిన సిద్ధమాన్య బ్ర
హ్మణ్యుని సద్గురున్ శివకుమారుని నిత్యము నాత్మనెంచుచున్.

నెయ్యముతో మఱొక్క మహనీయుని సిద్ధుని తుంగదుర్తి బు
చ్చయ్యవరేణ్యు శ్రీగిరివిహార పరాయణు పుణ్యపూరుషున్
చయ్యన నాత్మలోదలచి జన్మ పవిత్రముగాగ భక్తితో
నొయ్య ననెప్డు గాంచగలవో గురుదేవ పదాబ్జసేవినై.

బమ్మెరపోతనార్య! నిను బంధురభక్తి మనోజ్ఞశబ్ద భా
వమ్ముల బల్కుచుండెదను వందనముల్ గొనుమయ్య నీదు నా
మమ్ము స్మరించి సిద్ధజనమాన్యుల సేవయొనర్చు భాగ్య యో
గమ్మును గాంచువాడ, ఘనకల్మష పుంజమునెల్ల వీడుచున్.

శ్రీ మద్భాగవత ప్రసిద్ధ రచనార్థిత్వమ్మె జన్మాంతరో
ద్దామాశేషఫలైకపుణ్యమని సీతారామచంద్రార్చనా
ప్రేమస్వాంతుడునై చెలంగిన యశస్విన్ బోతనామాత్యునిన్
నీమంబొప్ప భజించుచుందు హృదయోన్నిద్రాబ్జ మర్పించుచున్.

నీదౌ దర్శనభాగ్య మబ్బెననుచున్ నిస్సార సంసార భీ
ష్మోదగ్ర ప్రతిబంధకోదధి తరంగోత్తాలఝుంపా ప్రమా
దాదిక్లేశములన్ దొలంగుటకు నిన్నర్థించితిన్ శ్రీ చతు
ర్వేదిస్వామి! గ్రహింపు నిర్మల మనః ప్రేమప్రసూనాంజలుల్.

సర్వశ్రీగిరి రామణీయక కళాసాహిత్య శిల్పోన్నతా
పూర్వస్నిగ్ధవశీకృతాభినవ నైపుణ్యంబు పుణ్యాంగనా
శర్వాణీప్రియ శక్తిపీఠమహిత శ్వశ్రేయసప్రోజ్జ్వలా
శౌర్యాదైకవిశేష మట్టిశిఖరి శ్రీరాశికే మ్రొక్కెదన్."



హరిః ఓం

శ్రీ గురుభ్యోనమః

శ్రీ అవధూత శివమహాస్వామినే నమః



## కృ తి స మ ర్ప ణ ము

గురుదేవ శివకుమార!
కరుణారస పూర్ణదృష్టి కలనంగొనుమా
సురచిర దండకమిది సుం
దరవదనా! నీకు నర్పణం బొనరింతున్.

పల్లవిత కరుణతో రా
జిల్లు గురూ! దండకముగ జెలగెడు దీనిన్
ఉల్లమున దాల్చు "శ్రీగిరి
మల్లేశ్వర సుప్రభాత మణిహారమ్మున్"

ఈ సుప్రభాత దండక
మో సామీ! నవ్యభక్తి యుల్లాసంబ ల్
వాసింప, భక్త మణులకు
దోసమ్ములుపాపి, ముక్తిత్రోవలు దీర్చన్.

జ్యోతి స్వరూపుడౌ శివు
రీతిన్ జ్ఞానప్రసాదరేఖా శ్రీ వి
ఖ్యాతుడవు. సద్గురుండవు
చేతమ్మున మెచ్చి, దీనిఁ జేకొనుమార్యా.

శ్రీశైల శృంగదర్శన
మాశాంభవ పదమొసంగు, నజ్ఞాన గుణా.
వేశమ్ముఁ బాపు గురుఁడవు
శ్రీశైలేశుండ వగుట సిద్ధము దేవా!

—: ఓం తత్సత్ :—



# "శ్రీశైలక్షేత్ర మాహాత్మ్యము"

శ్రీశైలము భారతదేశమందుగల పరమ పవిత్ర పుణ్యక్షేత్రము కర్మ భూమియైన భరతఖండమందుగల యావత్పుణ్యక్షేత్రములందు సుప్రసిద్ధమైన ఈ శైవక్షేత్రము మహా మహిమాన్వితమైనదని పురాణ ప్రసిద్ధి.

శ్రీశైలమునకు శ్రీనగము, శ్రీపర్వతము, శ్రీగిరి మున్నగు పేర్లుకలవు. శ్రీశైలక్షేత్రము పర్వతాగ్రమున - విశాల భూభాగమున - వ్యాపించియున్నది. శ్రీశైలము వేదములకు ఆలవాలము. సంపదలకు పుట్టినిల్లు దివ్యశిఖరములతో- అమరేశ్వరాదితీర్థ రాజములతో పరాశరభరద్వాజాది మహర్షుల తపోవనములతో - రంగదుత్తుంగతరంగ సంగతంబగు కృష్ణవేణీ తరంగణితో - చంద్ర, సూర్య, భైరవాది పుష్కరిణులతో - అసంఖ్యాక ఓషధులతో రాజిల్లుచున్నది.

ఇట్టి పవిత్ర క్షేత్రమున శ్రీ మల్లికార్జునుని సేవించిన వారికి అశ్వమేధ యాగఫలము ప్రాప్తించునని భారత ప్రమాణము. సందర్శనమాత్రముననే సకల పాపములను వికలముచేసి, అఖండ మోక్షలక్ష్మీ ప్రసాదము ననుగ్రహించు పుణ్యక్షేత్రమిది. "శ్రీశైలశిఖరం దృష్ట్వాపునర్జన్మనవిద్యతే" అని పురాణములు ఘోషించుచున్నవి చరాచర ప్రపంచమంతయు శివమయము. సకలసృష్టియు పంచభూతములతో గూడియున్నవి. శర్వ, భవ, రుద్ర! ఉగ్ర,భీమ, పశుపతి, మహాదైవ, ఈశాన నామములతో — పృథివి, జలము' అగ్ని, వాయువు, ఆకాశము, జీవాత్మ, సూర్యుడు, చంద్రుడు అను అష్ట మూర్తులను అధిష్టించి, పరమశివుడు ప్రపంచమును పాలించుచున్నాడు. ఆ మహాదేవుడు ద్వాదశజ్యోతిర్లింగ స్వరూపములతో ఆసేతు హిమాచలము భారతావని భక్త జన సంరక్షణార్థము అవతరించి, భుక్తి, ముక్తులు ప్రసాదించుచున్నాడు.

సౌరాష్ట్రమున సోమనాథుడై శ్రీశైలమున మల్లికార్జునుడై, ఉజ్జయినిని మహాకాళుడై, ఓంకారమున పరమేశ్వరుడై, హిమాచలమున కేదారనాథుడై, డాకినిని భీమశంకరుడై, గౌతమీతీరమున త్ర్యంబకేశ్వరుడై శంకరుడు విజయం చేసి యున్నారు.

ఆంధ్రప్రదేశములలో పవిత్ర కృష్ణవేణీ తీరమున శ్రీశైల క్షేత్ర మున్నది కైలాస పర్వతముతో సమాన గౌరవౌన్నత్యములు కలిగి, సర్వదా దేవబృందసంసేవ్యమాన మగుటనే శ్రీశైలమునకు 'దక్షిణ కైలాస' మని ప్రసిద్ధి వచ్చినది. "శ్రీశైల శిఖరందృష్ట్వా పునర్జన్మనవిద్యతే" అను ప్రసిద్ధోక్తి వలన శ్రీశైలమున శిఖర దర్శనమాత్రముననే ముక్తికలిగి, పునర్జన్మ లేకపోవునని తెలియుచున్నది.

ఈ క్షేత్రమందు ప్రత్యేక విశిష్టత కానబడుచున్నది. ఇతర క్షేత్రము లందు ఆయా క్షేత్రప్రధాన దైవతములకు మాత్రమే ప్రాధాన్యము కలదు. ఇందు అట్లుగాక, క్షేత్ర దైవతమగు శ్రీ మల్లికార్జునకెట్టి ప్రాధాన్యము కలదో — అట్టి ప్రాధాన్యమే దేవియగు శ్రీ భ్రమరాంబకును గలదు. అష్టాదశ మహా శక్తులలో ప్రధానమగు "భ్రామరీశక్తి" యే భ్రమరాంబాదేవి. పార్వతికి భ్రమ రాంబయని నామాంతరము గలదు.

శ్రీశైలక్షేత్రము ఉన్నట్టి ఆంధ్రదేశము ఒకప్పుడు త్రిలింగదేశమని వ్యవహరింపబడెడిది. మూడు లింగాల చల్లని చూపులతో మూడు లింగాలకు మధ్యస్థంగా ఉండేది. మూడు లింగాలలో శ్రీశైలములోగల శ్రీ మల్లికార్జున లింగం ఒకటి, ద్రాక్షారామములలోని భీమేశ్వర లింగము రెండవది, కాళహస్తి యందలి శ్రీ కాళహస్తీశ్వరలింగము మూడవది. ఈ ముగ్గురు మహేశ్వరులచే చూడబడుచున్న త్రిలింగదేశమే మన తెలుగుదేశము. అదే నేటి తెలుగు దేశము. శిఖర సందర్శన మాత్రము చేతనే పునర్జన్మ లేకుండా ఉద్ధరించగల ఈ శ్రీశైల క్షేత్రములో మరే పుణ్యక్షేత్రములోను లేని ఒక విశిష్టమైన విచిత్ర ఆచారము ఉన్నది. అదే 'ధూళి దర్శనము.' ఏ పుణ్యక్షేత్రానికి వెళ్ళినా భక్తులు స్నానసంధ్యాదులను నెరవేర్చుకొని, సుచిర్భూతులై ఫలపుష్పాదులు తీసుకొని, స్వామిని దర్శించి ఆచార సాంప్రదాయాల ప్రకారం పూజించడం కద్దు. కాని యిక్కడ యాత్రికులు వస్తూనే ధూళి దూసరిత పాదాలతోనే స్వామిని దర్శించుతారు. అ తర్వాతనే వారు పాతాళగంగాదులలో స్నానాదులు పరిపూర్తిచేసుకొని స్వామిదర్శనం చేసుకొని ఆరాధనతో సేవించి తరించడం ఆచారము. ఈ విధానం మరే ఆలయములోను కనబడదు. శ్రీశైల మానవ కళ్యాణానికి, భక్త జనోద్ధరణకు భోళాశంకరుడు రూపొందించిన పుణ్యక్షేత్రం.

అఖండ తపస్సంపన్నులైన తన భక్తుల మనోభీష్టాలను నెరవేర్చేటందుకు వరదాత పరిఢవిల్ల జేసిన పుణ్యభూమి.

అట్టి శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జునుల సుప్రభాతమును దండక రూపమున స్తోత్రముజేసి తరిద్దాము.

సర్వేజనాః సుఖినోభవన్తు

సమస్త సన్మంగళానిభవన్తు.

ఓం తత్సత్.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినే నమః



యశ్శివో నామరూపాభ్యాం యాదేవీ సర్వమంగళా
తయోస్సంస్మరణాత్పుంసాం సర్వత్ర జయమంగళమ్॥

ఓం శ్రీ మహాగణాధిపతయేనమః

# శ్రీ భ్రమరాంబామల్లికార్జున సుప్రభాత దండకము

శ్రీ మద్గణాధీశ, నక్రాంతమున్నేను ప్రాతస్సమారంభవేళ, న్నమద్దీనబంధున్, గళాసింధు, శృంగారసింధూరరేఖా విరాజత్కపోలద్వయీ భాసురున్ దేవతాగ్రేసరున్, చండవిఘ్నావళీ ఖండనోద్దండు, నాఖండలాద్యామరశ్రేణివంద్యున్, స్మరింతున్ - కళారూపులై చంద్రరేఖాంకురాలంకృతోత్తంసులై, నిత్యమన్యోన్య రాజత్తపస్సారలీలా ఫలశ్రీకులై, భక్తసంతాన సంతర్పణోద్యత్ప్రశ్రీదులై, సర్వదా దివ్యభావాఢ్యులై, శ్రీ శివస్ఫూర్తి జెన్నారుచున్, మూడులోకాలకున్ నిత్యకళ్యాణ హేలావిశేషంబు చేకూర్చుచున్. శాశ్వతానంద లీలానుభూతి

ప్రహృష్టాంతరంగ ప్రసాదార్ద్రులై ఈశ్వరీ శంకరాభిఖ్య విఖ్యాతులైనట్టి జేజేలకున్ గూర్తు భక్తి పసారోల్ల సద్రీతులన్ నేను నిత్యంబు పల్జోతలన్ – శ్రీ మహాదేవః శంభోః దయాసార సింధోః ప్రపన్నాత్మబంధో! మహేశాః నమస్తే జగచ్చక్ర రక్షార్థమై శ్రీగిరీంద్రాగ్రశృంగంబునన్నిల్చి, పీయూషధారాతిరస్కారి కారుణ్య హృద్యాతిహృద్య ప్రసన్నేక్షణంబుల్ సదా భక్తవర్గంబుపై జిల్కుచున్, మౌళి భాగంబునం జంద్రరేఖా మృదూరోచిచెల్వొందగానాశ్రితామేయ సంపత్తులం గూర్చుచున్, సజ్జనస్తుత్యయై శంభునర్ధాంగియై భ్రామరీ నామధేయంబునన్ మించుతల్లిన్సదా సంస్మరింతున్ భవంబుం దరింతున్ – "ప్రసీదప్రసీద" ప్రభావాఢ్యః కళ్యాణశీలాః సవిత్రీః మదోన్మత్తదైత్యాళి నిర్మూలన ప్రక్రియారబ్ధ లీలా! కళామూర్తి! శ్రీచక్రరాజైకసంవాసినీః వేదగీతైక కీర్తిప్రభాచంద్రికాః దేవిః శ్రీశైలనాథేశ్వరీః సుప్రభాతంబగున్నీకు సర్వేశ్వరీః – సాంబ! శంభూః సురేంద్రాదివంద్యాః శివాః శంకరాః శూలపాణీః పినాకీః జటాబద్ధశుభ్రాంశుఖండాః మహోద్దండః గంగాధరాః యిందిరా సుందర ప్రాణమిత్రాః మఖాధీశః శ్రీశైల మల్లేశ్వరా! సుప్రభాతంబు నీకౌత విశ్వేశ్వరాః – విశ్వసంసేవితాః విశ్వమూర్తీః లలాటాక్షః విశ్వంబరాః విశ్వయోనీః పురారీః మహాభోగిభూషాధరాః సద్గుణ శ్రేణికాలంకృతాః ఈశః శ్రీశైలమల్లేశ్వరా! సుప్రభాతంబు నీకద్రిపుత్రీశ్వరాః– మోహనాకారః కారుణ్యరత్నాకరాః కాలకంఠాః మహాకల్పవృక్షా ప్రసూనార్చితాః యిష్టసంపత్ప్రదాః నిత్యసత్యాః శివాః దైత్యవిధ్వంసనోగ్ర త్రిశూలాః మహా దేవః శ్రీశైలమల్లేశ్వరాః సుప్రభాతంబునీకున్ జగన్మండలాధీశ్వరాః – అద్వయాః శ్రీ గణేశాది సంసేవితాంఘ్రిద్వయాః పార్వతీవల్లభాః యక్షగంధర్వసంకీర్తిత స్వచ్ఛకీర్తీః మహాభోగి రాట్కుండలోద్భాసిగండద్వయీ సుస్మితాస్యాః విభూః శర్వః శ్రీశైలమల్లేశ్వరాః సుప్రభాతంబు నీకౌనుః కామేశ్వరాః – పుణ్యరూపాః నిరీహాః శ్రితేష్టప్రదాః నిర్వికారాః నిరాఘాటః నిర్మాయః విష్ణుప్రియా! నిశ్చలాః నాగభేదీః ఫణిభూషణాః నిర్మలాత్మాః సదానందాః శ్రీపర్వతాధీశ్వరాః సుప్ర భాతంబగున్నీకు కైలాసశృంగేశ్వరాః – ఈశః సృష్టింతు వీవిశ్వగోళమ్ము నీవే యదృష్టస్వరూపాః జగద్రక్షణాశక్తి నీయందె పెంపొందునో శంకరాః కింకరీ భావముంబూని సంహారశక్తి ప్రభావంబు నీయందు శ్రీశైల శృంగాధినాథాః గణాధీశ్వరాః సుప్రభాతంబు నీకౌను సౌవర్ణశైలేశ్వరాః ఏకభావుండవయ్యున్ బహుత్వమ్మునన్ వెల్గుచున్నావు లోకమ్మునన్మల్లినాథాః వృషేంద్రధ్వజాః నిత్య నిశ్శంకధీరంజితాః భ్రామరీనాయకాః లోకవాసాః సుఖావాసః శ్రీశైలశృంగే

శ్వరా! సుప్రభాతంబగున్నీకు కళ్యాణకల్పేశ్వరా! - దివ్య పాతాళగంగాజల స్నానసంపూత దేహుల్, పవిత్రాచ్ఛభస్మ త్రిపుండ్రోల్ల సత్ఫాలభాగుల్, మునుల్ నిర్జరుల్ భక్తవర్యుల్ శివా! నిన్ను గీర్తించుచున్నారు శ్రీశైలమల్లేశ్వరా! సుప్రభాతంబు నీకా ప్రమిత్రాయితార్థేశ్వరా! - శ్రీత్రిమూర్త్యాఖ్య నొప్పారు శృంగావళిన్ దాకుచుంబొంగుచుం దూకు కృష్ణానదీ స్వచ్ఛ నీరమ్ములన్ జాత పాతాళగంగాసుధాసార పూరమ్ములం గ్రుంకి, నీభక్తు లొక్కొక్క మెట్టెక్కుచున్ నిన్ను వర్ణించుచు న్వచ్చుచున్నారు వీక్షించు శ్రీశైలమల్లేశ్వరా! సుప్రభాతంబు నీకౌను నాట్యేశ్వరా! - ఈశ! శ్రీమల్లికేశా! ప్రభాతంబునన్ భక్తిభావమ్మునన్ మర్త్యుడెవ్వాడు నీ సుప్రభాతమ్ము గానమ్ము గావించునో వాడు సౌఖ్యంబు కోకొల్లగాపొందు, యన్యండెవం డందగాలేని యాశాంభవంబౌ పద మ్మొంది యానంద దుగ్ధాబ్ధినోలాడు నిక్కంబు సాంబా: నమస్తే! నమస్తే! నమస్తే! నమః-



## -: శ్రీ మల్లికార్జున స్తోత్రము :-

అన్యోన్యసంశ్లిష్టదేహార్ధ్యులై, సర్వకాలంబులేజవ్వనంబూని చెల్వొందు శైలాత్మజా చంద్రమౌళుల్ మదీయంబు భక్తిస్ఫుటంబౌ నమస్కారముంగొంద్రు, ధాత్ర చ్యుతేంద్రాది సంపూజితాం ఘిద్వయీరాజితుల్. భస్మ పాటీరసంలేప విభ్రాజితుల్, గిత్తమే లత్తడిన్, స్వారిగావించునా పార్వతీ శంకరుల్ నా నమో వాకముల్ కొందురెల్లప్పుడున్, నిన్ను సేవింతు లోకాలతంద్రిన్, సమస్తాదిమూర్తిన్. దయాతోయరాశిన్, మహా పాపహంతన్, కరోల్లాసిశూలా యుధున్, పాపదూరున్, నతా ఖండవాంఛాప్రదున్, భక్తి సంపత్తిలభ్యున్, మనః సదా మ్రొక్కు మమ్మా! వడిన్ బ్రహ్మముఖ్యామర వ్రాతశీతాచ్ఛ కీరిన్ మహామ తద్దైత [illegible]కర్తన్, మహానిగ్రహ ప్రాప్తి కర్తన్, లస ద్దివ్య సౌంద[illegible] మనోజ[illegible] సమస్తాఘముల్ పాపునాతండె మచ్చిత్తమా! దుష్టసా[illegible] [illegible] - కళ్యాణదాతన్. సుఖానంద హేతున్.

నవప్రేమ సేతున్, నటేశున్, మహేశున్, దినాధీశ చంద్రాగ్ని నేత్రున్, పవిత్రున్, గిరీంద్రాత్మజా ప్రేమపాత్రున్, సదానేను సేవింతు చిత్తాబ్జపీఠంబు నన్నిల్పి శ్రీశైల మల్లేశ్వరున్, — భృంగియిచ్చాను సారంబుగా నాట్యముం జేయు దేవుండు, మత్తేభచంచన్మదగ్రాహి నిత్యస్ఫురన్మాధవాహ్లాద లీలావిలాసుండు పంచేషుసమ్మానితుండున్, సితాంగప్రభారాశి, సత్ప్రభుడై యెప్పు శ్రీ పర్వత భ్రామరీవల్లభుండెప్పుడున్ నా మనఃపద్మ మధ్యంబునందు న్విహారమ్ము సల్పంగ నేవేడుదున్. - చంద్రరేఖాకిరీటుండు, దేవావలీ జీవనాధారభూతుండు, పాదాశ్రితవ్రాత పాశచ్ఛటాబంధనచ్ఛేత్త, సంఫుల్ల మల్లీసుమాభుండు, వామాంగ సందీప్త భార్యామనోజ్ఞుండు, శ్రీశైల శృంగాగ్రపీఠీ సమాసీనుడైనట్టి మల్లేశ్వరస్వామి నాధ్యానయోగ్యుండగుంగాక, - కేలంగు రంగంబు, శీర్షంబునంబూపజాబిల్లి, పార్శ్వంబునంగామినీరత్న, మక్షంబులన్ నిండు కారుణ్య సంపత్తియున్, ఫాలభాగమ్మునన్ భూతిరేఖల్, ముఖమ్మందు మందస్మితమ్ముల్, జటాజూటమందున్ అసద్గాంగతోయమ్ములంబూను శ్రీశైల మల్లేశు డెల్లప్పుడున్ ప్రేమతో సర్వలోకమ్ములంబోచెడింగాత - రంగారు బంగారు శృంగాల నుప్పొంగు శ్రీశైలమందున్ మహాకల్పవృక్షాతి శీతంబునేరత్న సందోహ సన్నిర్మితోత్తుంగసౌధాగ్ర సంస్థాపిత స్వచ్ఛకల్యాణ పీఠమ్మునన్ శైలరాజాత్మ జాలంకృతాంగమ్ములన్, సోమరేఖోల్లసన్మౌళియై నవ్యకారుణ్య పీయూషముల్ చిందుకందోయి, లేనవ్వు లుప్పొంగు నెమ్మోము రాజిల్లగా దేవతా సార్వభౌమత్వముంగాంచి శ్రీ భ్రామరీనాధుడాత్మీయ సత్త్వాభవమ్ము న్నిరూపించుచున్నాడు - నిత్యమ్ము నేవేవియోగీంద్ర చిత్తారవిందమ్మునన్ రాజహంసీ విధిన్నెల్లు, నా మందహాసస్ఫురద్వక్త్రి, మాద్యస్తమో ధ్వంసనప్రౌఢ, విఘ్నాంధకారావళీచ్ఛేదన ప్రక్రియాదక్ష, శ్రీభ్రామరీదేవి యుల్లాస సంపత్తులన్ సర్వదానాకు గల్పించుతున్ — చంద్రఖండోల్లసత్ఫాలభాగమ్మునన్ నవ్యకస్తూరికారేఖ తావుల్ గుబాళింప, కర్పూరసమి శ్రీతోదార తాంబూల వీటినవామోదముల్ వక్త్రపద్మమ్మునన్ జిందువందన్. సదా చంచలా పాంగభంగీతరంగాతికారుణ్య సారంబు భక్తాళి దారిద్ర్యముంబాప, శ్రీశైలశృంగాగ్రరంగమ్ము నన్నేల్లు శ్రీ మాత, నైశ్వర్యలీలాసమేతన్, ప్రభూతన్. సదా నేను భావింతునా భావవీధిన్ - మరాళీలసన్మందయానన్, ప్రఫుల్లారవిందేక్షణన్, పద్మగర్భాది దేవావళీ మౌళిరత్న ప్రభారాజితాంఘ్రిద్వయిన్, దివ్యరాజీవపత్రార్చితో రోజయుగ్మన్, మహారాజాధి రాజేశ్వరిన్, సద్గుణైశ్వర్య

సంపత్కరిన్, చిత్తపీఠమ్మునన్నిల్పి శ్రీశైల శృంగాగ్ర చింతామణీన్ మాతృ కారూపిణిన్. సర్వదా నేను భావింతు - శ్రీచక్ర సంచారిణిన్. శ్రీ ముకుందాది గీర్వాణ సంస్తుత్య పాదాన్వితన్ సర్వలోకావన ప్రౌఢలీలాయుతన్, గాన సంసక్త సద్యోపనోద్భాసిగంధర్వకన్యా సమారాధితన్, దివ్యనవ్యాంబరాలం కృతన్, దీన సంతాననిర్వేల సంపత్ప్రదాత్రిన్, జగన్మండల శ్రీసవిత్రిన్, మనః పద్మసీమన్నిరూపించి శ్రీశైల శృంగస్థితన్గొల్తు శ్రీమాతనత్యంత కారుణ్యశీతన్, మహాభ్రామరీలోకమాతన్ - మణింమంజులమ్మైన దర్విన్. సుధాన్నైకసంపూర్ణ కుంభంబు హస్తమ్ములంబూని కళ్యాణియై, సత్కలా వేణియై, భక్తతాపంబు పోకార్చు శ్రీ భ్రామరీదేవి, శ్రీశైలశృంగంబునన్ ఠీవి వెల్గొందు మేల్దేవి. నా యిష్టపారంపరిన్ బూర్తి గావించుతున్. —



# శ్రీ మల్లికార్జున ప్రపత్తి

దేవదైత్యావళీవంద్యపాదాంబుజద్వంద్వ ! నిర్ద్వంద్వ ! ఈశా ! జయప్రేమకోశా! జయస్వామి ! సృష్టిస్థితి ప్రక్రియా సర్వసంహారకారా ! నిరాకారా నీకున్ జయశ్రీ ఘటిల్లున్ ప్రపన్నత్వమందొన్నమమ్మున్ 'సదాపాలయత్వం' మహా దేవ ! క్రేగంటి చూపుల్ పిసాళించు గౌరీముఖంబున్ విలోకించుచున్, సంత రానందవారాశినోలాడుచున్, సచ్చిదాత్మ స్వరూపంబునన్మించు శ్రీశైల మల్లేశ్వరుండే సదా నాకు సన్మార్గముంజూపుతన్ - తళుక్కన్నుంగనన్ బెళుకొల్కించునాకన్నెలేడింగరంబందు గీలించి కారుణ్యముల్ చిందుకందోయి తోనొప్పు శుభ్రాంశురేఖాకలాపుండు, గీర్వాణబృందాగ్రగణ్యుండు, గౌరీసహా యుండు, శ్రీశైలశృంగాగ్రనిక్షేపమై వెల్గుమల్లన్న పాపమ్ము లెల్లన్ని వారించి నా కోర్కులందీర్చుతన్ - సాంధ్యవేళన్ విజృంభించి వేదాంత మౌళిస్థితంబై, నవప్రేమ పుష్పించగా, భ్రామరీచిత్త పద్మాంతరాళమ్మునన్ నిల్చి, క్రొంగ్రొత్త నెత్తావులన్ గుప్పుచున్, దివ్యభోగీంద్ర భూషాగణాలంకృతంబై, సమస్తామరస్తోమ పూజ్యస్థితింగాంచియంచద్గుణ స్థానమై, శ్రీ శివాలింగిత

స్ఫూర్తి చెన్నొందుచున్ మల్లికాభిఖ్య పేరొంది శ్రీశైల శృంగాగ్రరంగస్థితమ్మైన శ్రీ మన్మహాలింగమున్నేను సేవింతు - నేదేవి సర్వప్రపంచైకమూలమ్మునై ఆది దేవేశుడౌ శంభు నర్ధాంగియై, లోకరక్షార్థమైనవ్యదివ్యావతారమ్ములం బూని, దుష్టాళివిధ్వంసమున్, శిష్ట రక్షావిధించేయుచున్ శ్రీగిరీంద్రమ్మునన్ వెల్గునాభ్రామరీదేవి శ్రేయస్సులన్నాకు జేకూర్చు - నేతల్లితేజస్సు నానాస్వరూపమ్ములన్, సర్వలోకస్థితింగూర్చునో, యాశివప్రేయసీమౌళి, శ్రీశైలసంవాస కౌతూహల శ్రీసముల్లాస, భక్తావళీ కల్పవల్లీవతంసమ్ము, శ్రీ భ్రామరీమూర్తి నానావిధ శ్రేయముల్ నాకుచేకూర్చుతన్ - దిక్కుగానెంతు నాచంద్రరేఖాకలాపున్ గిరీంద్రాత్మజాతన్, సదానాకు నాయిర్వురేదిక్కు వేరాక్క దైవమ్ము నేనెన్నడుం గొల్వజాలన్ — నమస్తే ! నమస్తే ! నమః



## శ్రీ మల్లికార్జున మంగళాశాసనము

భవానీశ ! యీశా ! ప్రపన్నేష్టకామ్యప్రదా ! శ్రీగిరీశా ! మహాదేవ ! శ్రీశైల మల్లేశ ! నీకున్ శుభంబయ్యెడున్ - సర్వకళ్యాణరూపా ! నగాధీశవాసా ! సుఖావాస ! గంగాధరా ! శ్రీగిరీశా ! దయంజూపుమా మాపయిన్ - నోసచ్చిదానందరూపా ! మహానందదాతా ! బుధస్తుత్య ! వేదావళీగమ్య ! శ్రీశైలనాథా దయంజూపుమామాపయి - న్సదాభక్తి ముక్తిప్రదా ! దేవముఖ్యా ! నమ ద్భక్తలోకావనా ! సుందరేశా ! తపోగమ్య ! సౌమ్యా ! శివా ! శ్రీగిరీంద్రా ! దయంజూపుమామాపయిన్ - మేలు చేకూర్చుమీ, నాదుదోసమ్ములన్ నీవు పోకార్చుమీదేవ ! రారామదీయాంతరంగాబ్జ పీఠమ్ము నన్నిల్వుమోస్వామి ! జ్ఞాన ప్రదీపమ్ము వెల్గించుమీ, గాఢ మాయాంధకారమ్ము మాయించుమీ, భ్రామరీశా ! నమస్తే, మహాదేవ ! దేవా ! భవద్భక్తి లక్ష్యాను సంధాన సంయుక్త సంపన్నుమహార్తాను వర్తిత్వదైనందినాఖ్యాన సంగీతసం శోభితోపాప నాశీలురన్గామమున్ జేయుమయ్యావిభూ ! స్వామి ! హారీతగోత్రుండ లక్ష్మీనృసింహాఖ్యుడన్ నాదుదోషంబులన్నీవు మన్నింపుమయ్యా ! నమస్తే ! నమస్తే ! నమః !

:- ఓం శాంతిః ! శాంతి ! శాంతిః :-



# అద్వైత భావన



శ్రీ మహిళాగిరివర పు । త్రీ మానస జలజ మిత్ర! శ్రితమందారా!
నా మదినమ్మితిఁ గావుము । కోమలపద పద్మయుగ్మ గోవింద శివా! ॥

సారవిహీనంబగు సం । సారమ్మునఁ జిక్కి యొక్కసారియు నిన్నున్
నోరారఁ దలపనేరని । శ్రీరహితున్నన్ను బ్రోవు శివగోవిందా! ॥

నేరను మంత్రము తంత్రము । నేరను యోగమ్ము భక్తి నిష్ఠలెఱుంగన్
సారెకు నిన్ను భజింతును । గూరిమి నన్నేలుకొమ్ము గోవింద! శివా! ॥

కలుషధ్వంసక! నిను ని । శ్చల మతిభజియించువాడు శాశ్వత సౌఖ్య
మ్ములగాంచు నీ దయాసుధ । చిలుకుము కలుములు ఫలింప శివగోవిందా! ॥

ఏవాడు నీ పదాంబుజ । సేవాసుధ గ్రోలి తనివి చెందునో యతడే
సేవధి సద్గుణ పాళికి । కోవిదమణి యతడె సుమ్ముగోవింద శివా !

ఒకమారు కౌస్తుభము నిం । కొకసారి కపాల మాల నొప్పుగ ధరియిం
తు కదా ! నీ సమభావమే । సికపూవుగదయ్య మాకుఁ శివగోవిందా !

గజ చర్మము పీతాంబర । మజ వినుతాదాల్తు వీవు హరుడవాఁ హరివో
నిజ వృత్త మెఱుగజాలను । కుజ నగణౌద్ధత్య హరణ గోవింద ! శివా !

కందమ్ముల మోదపయో । బిందులు చెలువొంద, భక్తి వివశుడనై యీ
కందమ్ములు నిచ్చితి దయ । చిందగ ననుజూడుమయ్య ! శివ గోవిందా !

ఓం తత్సత్



# ఆధ్యాత్మిక మతావశ్యకత:



మానవజాతి భవిష్యత్తును నిర్ణయించుటకు ఇంతవరకు కారణభూతముల యినటువంటియు, ఇంకను కారణభూతము లగుచున్నట్టియు, మూలశక్తులు అనేకములు కలవు. వాటి యన్నింటిలోను మతరూపమున గోచరించు దీనిని మించినది వేరొకటి లేదు.

సమస్త సంఘ వ్యవస్థలకును వెనుక ఎక్కడో ఒకచోట మతమహిమ యుండితీరును. మానవ సమాజములందు మిత్రత్వమును గూర్చు శక్తులలో అత్యద్భుతమగు శక్తి మతమునుండియే యుద్భవమగుచున్నది. అనగా పుట్టు చున్నది, అనేక సందర్భములలో జాతి, దేశము, వంశము అను యీ మూడు బాంధవ్యములను మించి బలవత్తరమై మతసంబంధము వెలయుచుండును.

ఒక్క వంశములోనివారికంటెను, అన్నదమ్ములకంటెను ఒక్క దేవతనే పూజించుచు, ఒక్క మతమునే అవలంబించువారు హెచ్చుగ పరస్పర విశ్వాస మును, పరస్పరాభిమానము చూపుకొనుచు, ఒకరికొకరు అండయై నిలతురనుట మనమందఱు మెఱిగినదే! అందు సిద్ధాంతములు రెండు. మతము పైతృకము అను సిద్ధాంత మొకటి. 'అఖండ' భావనా పరిణామము అను సిద్ధాంతము రెండవది.

"త్వం స్వాహా, త్వం స్వధాత్వంహివషట్కార స్వరాత్మికా ।
త్వమేవ సృజ్యతే విశ్వం, త్వమేవ పరిపోషతే ॥"

రాత్రి సూక్తము—మార్కండేయ పురాణము.

మతమునకు ప్రథమ దశ (1) పితృదేవతారాధనమని ఒక పక్షమువారి వాదము. (2) ప్రకృతియందలి మూలశక్తులకు మూర్తి కల్పనచేయుట యని రెండవపక్షమువారి వాదము.

మృతులయిన తన బంధువులను సంస్మరించు చుండవలయునను కోరిక మానవునందు కలదు. శరీరము నాశనమైన పిమ్మటను వారు సజీవులయి యున్నటులనే భావనచేసి వారికి పిండదానముల చేయుచు వారినొక విధముగ ఆరాధింపగోరును దీనినుండి మతమనునది ప్రారంభమైనది

మతము ప్రకృతి శక్తుల యారాధనమునుండి మొదలిడినదని ప్రాచీనార్య గ్రంథములనుండి నిదర్శనములు చూపు పండితులు రెండవ పక్షమువారు.

పై రెండు పక్షముల సిద్ధాంత వాదములును పరస్పరము ఒకదాని కొకటి విరుద్ధములుగా కాన్పించుచున్నను, మూడవదగు నింకొక సిద్ధాంతముచేత వానికి సమన్వయము కూర్చవచ్చును. అదియే మతమునకు అంకురమని తెలియుచున్నది.

ఇంద్రియము లేర్పఱచు హద్దులను అతిక్రమించు ప్రయత్నమే అది. పూర్వికుల అనగా మృతులయినవారి ఆత్మలకొఱకు వెదకుచుండును. అనగా ఈ శరీరము నాశనమైన పిమ్మట నిలిచియుండుదానిని గూర్చి తెలిసికొన ప్రయత్నించుచుండు నన్నమాట. లేదా మహత్తరములయిన ప్రకృతి వికాశములకు మూలమగు మహాశక్తిని గ్రహింప యత్నించుచుండును. ఈ రెండింటిలో నేది యైనను ఒక్క విషయము మాత్రము స్పష్టము. అది మానవుడు తన యింద్రియములతో తృప్తుడయి యుండజాలడు; వాని నతిక్రమింప జూచుచుండును. ఇందుకు కారణము సుబోధమే మతమును గూర్చిన ప్రప్రథమ జ్ఞానాంకురములు స్వప్నముల ద్వారమున వెలువడుట సహజమని తోచుచున్నది. అమృతత్వమును గూర్చిన ప్రప్రథమ భావనకూడ స్వప్నద్వారముననే లభింపవచ్చును.

పసివారును పామరులును జాగ్రత్ స్వప్నావస్థలకుగల భేదము నంతగా గ్రహింపజాలరు. శరీరము మృతమైనట్లు తోచు నిద్రావస్థ మనస్సు దీని విచిత్ర చర్యలనన్నింటిని సాగించుచుండునను వాదము వారికి సహజమైకాన్పించుచుండును. అందు ఆశ్చర్యమేమియు లేదు. అట్లే ఈ శరీరము నశించిన యనంతరమును నట్టిచర్యయే జరుగునని పర్యవసానమును తేల్చుటయందు విడ్డూరమేమియు లేదు. అలౌకిక సంఘటనల నిట్లు గ్రహించుట చాల సహజమని తలంతురు. ఈ స్వప్నభావము నాధారము జేసుకొని నరునిబుద్ధి క్రమక్రమముగ నుత్తమ భావనలకు కడంగగలదు.

మృతులయిన తన బంధువులను సంస్మరించు చుండవలయునను కోరిక మానవునందు కలదు. శరీరము నాశనమైన పిమ్మటను వారు సజీవులయి యున్నటులనే భావనచేసి వారికి పిండదానముల చేయుచు వారినొక విధముగ ఆరాధింపగోరును దీనినుండి మతమనునది ప్రారంభమైనది

మతము ప్రకృతి శక్తుల యారాధనమునుండి మొదలిడినదని ప్రాచీనార్య గ్రంథములనుండి నిదర్శనములు చూపు పండితులు రెండవ పక్షమువారు.

పై రెండు పక్షముల సిద్ధాంత వాదములును పరస్పరము ఒకదాని కొకటి విరుద్ధములుగా కాన్పించుచున్నను, మూడవదగు నింకొక సిద్ధాంతముచేత వానికి సమన్వయము కూర్చవచ్చును. అదియే మతమునకు అంకురమని తెలియుచున్నది.

ఇంద్రియము లేర్పఱచు హద్దులను అతిక్రమించు ప్రయత్నమే అది. పూర్వీకుల అనగా మృతులయినవారి ఆత్మలకొఱకు వెదకుచుండును. అనగా ఈ శరీరము నాశనమైన పిమ్మట నిలిచియుండుదానిని గూర్చి తెలిసికొన ప్రయత్నించుచుండు నన్నమాట. లేదా మహత్తరములయిన ప్రకృతి వికాశములకు మూలమగు మహాశక్తిని గ్రహింప యత్నించుచుండును. ఈ రెండింటిలో నేది యైనను ఒక్కవిషయము మాత్రము స్పష్టము. అది మానవుడు తన యింద్రియములతో తృప్తుడయి యుండజాలడు; వాని నతిక్రమింప జూచుచుండును. ఇందుకు కారణము సుబోధమే మతమును గూర్చిన ప్రప్రథమ జ్ఞానాంకురములు స్వప్నముల ద్వారమున వెలువడుట సహజమని తోచుచున్నది. అమృతత్వ మును గూర్చిన ప్రప్రథమ భావనకూడ స్వప్నద్వారముననే లభింపవచ్చును.

పసివారును పామరులును జాగ్రత్ స్వప్నావస్థలకుగల భేదము నంతగా గ్రహింపజాలరు. శరీరము మృతమైనట్లు తోచు నిద్రావస్థ మనస్సు దీని విచిత్ర చర్యలనన్నింటిని సాగించుచుండునను వాదము వారికి సహజమైకాన్పించు చుండును. అందు ఆశ్చర్యమేమియు లేదు. అట్లే ఈ శరీరము నశించిన యనంతరమును నట్టిచర్యయే జరుగునని పర్యవసానమును తేల్చుటయందు విడ్డూర మేమియు లేదు. అలౌకిక సంఘటనల నిట్లు గ్రహించుట చాల సహజమని తలంతురు. ఈ స్వప్నభావము నాధారము జేసుకొని నరునిబుద్ధి క్రమక్రమముగ నుత్తమ భావనలకు కడంగగలదు.

మున జూడగలదు. ఇట్టి సత్యములే ప్రపంచమున నన్ని మతములకు మూలాధారములు. లోకములోని యన్ని మతములును ఇంద్రియముల యావరణలను తర్కాంపు హద్దులను దాటిపోగల యీ విచిత్రవ్యక్తి మనస్సునకు కలదని సిద్ధాంతీకరించుచున్నవి. ఇవన్నియు కేవల భావైకగమ్యములు. సునిర్మితములైన సకలమత తత్త్వములందును నివి కేవల సత్తగా – భావమయ వ్యక్తియనిగాని సర్వవ్యాప్తియనిగాని, భావైకగమ్యుడగు దేవుడనిగాని, నీతిశాసనమనిగాని, అస్తిత్వముగల ప్రతిదానికిని నాధారమగు మూలసత్యమనిగాని ప్రవచింపబడుచున్నవి.

వీనినిబట్టి యీ భావకల్పనము ఇంద్రియములందు ప్రభవ మగుటలేదని తేలుచున్నది. మనలో నెవరుగాని పూర్ణాదర్శమూర్తి యగు మానవుని కాంచి యుండమ. అయినను ఆట్టివాని యునికిని విశ్వసింపుడని యుపదేశము నొందుచున్నాము. మనమెవ్వరము పరమాదర్శమూర్తిని ఇంకను ప్రత్యక్షము చేసికొని యుండకపోయినను యటువంటి యాదర్శములేనిది పురోభివృద్ధి కాంచజాలక యున్నాము. కావున ఆదర్శ భావైకమూర్తి యొకటి కలదనియు, దానిని యీ మతములన్నియు మన యెదుటనుంప ప్రయత్నించుచున్నవనియు స్పష్టమగుచున్నది ఆ మూర్తిని సగుణ పురుషరూపముననో నిర్గుణ భావముగనో, ఒక విశిష్ట ధర్మముగనో, కేవల సత్తారూపముగనో అవి చిత్రించును. ఆయా ధర్మముతో తాదాత్మ్యమును పొందుటకో మనము నిరంతరమును శ్రమపడుచున్నాము. ప్రతిమానవుడును తానెట్టివాడైనను, ఎక్కడనున్నను, సర్వశక్తిమంతమగు నొక ఆదర్శమూర్తిని భావన చేయుచుండును. ప్రతి నరుడును ఒక యఖండానందమయ రూపుని ఆదర్శముగ భావన చేయుచుండును. మనచుట్టు జరుగు కార్యములన్నియు సర్వత్ర ప్రకటితమగు ప్రవృత్తి యంతయు ఆ అప్రతిహత శక్తినో, ఆ పరిపూర్ణానందమునో, చేరుటకై పెనగులాడుటయే సుడీ! కాని తామెంతగా నీ యప్రతిహతశక్తి కొఱకై యత్నించుచున్నను అది యింద్రియముల ద్వారమున లభించునది కాదని కొందఱు త్వరలోనే గ్రహింతురు ఆశాశ్వతానందము కూడ యీ యింద్రియముల ద్వారమున లభించునది కాదని కొందఱు త్వరలో తెలిసికొందురు. అనగా ఆ యఖండతను గ్రహించుటకీ యింద్రియముల ప్రజ్ఞ చాలదనియు ఈ శరీశమునకట్టి శక్తి లేదనియు గ్రహింతురు పరిమితమగు లెద్దాని సాహాయ్యమునకాని అఖండమును వ్యక్తము

చేయుట యసంభవము. ఇట్లు పరిత్యాగమే నీతిసూత్రమున కాధారము. త్యాగ శీలములపై నాధారపడని నీతిసూత్ర మెన్నడుగా బోధింపబడి యుండలేదు.

"నాహరి త్వమేవ" (నేను కాదు. నీవే అని యే) నీతిధర్మము ఘోషించు చుండును. "అహం కాదు, నాహం" అనునదే దాని యాదర్శసూత్రములు. ఇంద్రియముల ద్వారమున ఆ యనంతశక్తినికాని, ఆ పూర్ణానందమును కాని పొంద ప్రయత్నించునప్పుడు, మానవుడు గట్టిగ పట్టుకొనియుండు నిరర్థక వ్యష్టిత్వమును కడపటనిలిచి యితరులను నీకు ముందుగా నిలుపవలసియుండును ఇంద్రియములు "నేను" ముందు అనుచుండును. నీతిధర్మమో "నేను" తుది నుండవలయును అనును. ఇట్టి నీతిశాస్త్రములన్నిటికిని పరిత్యాగము (వైరాగ్యము) పునాదిగా నున్నది. భౌతిక ప్రపంచమున 'వ్యష్టి' వినాశము కావలెను. ఆ యనంతమూర్తి యీ భౌతిక ప్రపంచమున వ్యక్తమగువాడు కాడు. అట్లగుట సాధ్యపడదు. ఊహింప నలవికాదు.

మానవుడా యఖండమూర్తిని చక్కగ దర్శింపగోరునెడల ఈ భౌతిక ప్రపంచమును త్యజించి లోకాంతముల కుద్గమనము చేయవలయును. ఈ రీతిగా భావనచేయగా వివిధములగు నీతిశాస్త్రములు నిర్ణీతములయినవికాని సమస్త నీతికిని ప్రయోజనమును, పరమార్థమును, గమ్యమును, ఈ వ్యష్టిత్వభంజనమే కాని, వ్యష్టిత్వ నిర్మాణ మేమాత్రముకాదని వారు తలంచుటలేదు. ఈ ప్రకృతి కతీతమగు నొక యాధారములేనిది, అనగా అతీంద్రియ దృష్టి యని పేర్కొను నదిలేకుండ, నీతిధర్మమే కలుగదు.

పరిపూర్ణమును చేరు ఆవేదన లేనియెడల పరమాదర్శమనునదే యుండ జాలదు నీతియే పరమార్థము కాజాలదు. అదియొక పరమావధిని చేర్చు సాధన మాత్రము సంఘమునుండి మాత్రమే సంగ్రహింపబడిన ధర్మమును స్థిర స్థాయిగా నుండవచ్చునుగాని అంతకుమించి విలువ యుండజాలదు. కాని మతము నుండియు, ఆధ్యాత్మిక విచారమునుండియు, సంగ్రహింపబడిన ధర్మసిద్ధాంతము కాని, నీతిశాస్త్రముగాని, నరుని యనంత స్వరూపమును పూర్ణముగా తనలో నిముడ్చుకొనగలంత విశాలమైనదిగ నుండును. అది వ్యష్టి ప్రసక్తిని గైకొనియు అఖండముతోడి సంబంధము కలిగియే వర్తించును. సంఘముతోడను ప్రసక్తి కలిగియుండును. ఏలయన వ్యష్టి నరులు కొందరు కూడియేకదా సంఘమేర్పడు

చున్నది. కావున నది వ్యష్టికిని, వాని శాశ్వత జీవనమునకు ననువర్తించును. అటులనే సంఘమంతటికిని, ఆ సంఘము ఏ కాలమున నే స్థితియందున్ననుగూడ అనువర్తింపగలదు. కావున మానవజాతికి ఆధ్యాత్మికమగు మతమెల్లపుడును అవసరమగుచునే యుండునని మనము గ్రహింపగలము.

ప్రకృతి నతిక్రమింప యత్నించుచున్నంతవఱకే మానవుడు మానవు డనిపించుకొన నర్హుడగును. ఈ ప్రకృతి బాహ్యమనియు, ఆంతరమనియు రెండు విధములుగ నుండును. ప్రతి నరునకును సహజమును, జన్మస్వాస్థ్యమునగు ఆనంతశక్తి ప్రత్యక్షము కావించుకొనుటకై ప్రేరేపించు మహాశక్తి మతమే! శీలనిర్మాణమునందును, శ్రేయస్కరమును ప్రోత్సహించుటయందును ఇతరులకు శాంతిగూర్చుటయందును, తన శాంతి నొడగూర్చుకొనుటందును మూలాధార శక్తియై పరుగునది మతమే! కనుక యా దృష్టితో అధ్యాత్మికచింతకు కడంగ వలయును.

"లోకములో వశీకరణ శక్తిని మిగుల ప్రయోగించుచుండిరో యనదగు వారు, తమభావములను శతసహస్ర సంఖ్యాకులలో ప్రవేశపెట్టి నడుపజాలువారు తమ జీవితముచేతనే ఆధ్యాత్మిక వహ్నిని ఇతరులలో ప్రజ్వలింపజేయగలరు– ఇట్టివారి నందరిని వెనుకనుండి నడుపునది ఆధ్యాత్మిక చింతనయే యని, అనగా పారమార్థిక చింతనయే యని తెలియుచున్నది. వారిని కదల్చు ఆ మూలశక్తియే మతము.

సంకుచితములును, పరిమితములును, కలహకారణములు నగు మత భావము లంతరింపవలసియున్నవి. మతమును గూర్చిన భిన్న సాంప్రదాయ భావములన్నియు జాతి, శ్రేణి సంబంధమగు పృథగ్భావసము లన్నియు విడిచి వేయవలయును. ప్రతి శ్రేణికి, ప్రతి జాతికి ఒక ప్రత్యేక దేవత యుండవలయు నను భావమును, తక్కినవారందఱును నపమార్గానువర్తులనెడు భావమును, మూఢవిశ్వాసమువలన కలుగుచున్నవని గ్రహించి, విసర్జనము చేయవలసి యుండును. అట్టి యూహలన్నింటిని పాఱతోలవలయును.

మానవబుద్ధి వికసించుకొలఁదిని దాని ఆధ్యాత్మిక గమనముకూడ విశాల మగుచుండును.

అన్ని మతాచార సంప్రదాయముల నడుమ మైత్రి చేకూరవలసి యున్నది. అట్లున్నయెడల ఇరుతెగలవారును లాభముబడిసి-సత్యముగా పురోగ మనము చేసినవారే అగుదురు గదా! దేశకాల పరిమితులచే ఇప్పుడు కట్టువడక మనస్సునకును ఇంద్రియములకును అందరాక వీని కతీతముగ వెలయుచు, అవ్యక్తమును అనంతమును నైయుండు 'ఏకమేవా ద్వితీయ' మగు ప్రజ్ఞానమును కలిసికొని అందైక్యమును పొందగల్గుదుము.

ఓం తత్సత్.





# శ్రీ గీతాచార్య సందేశము

"నేను పరబ్రహ్మము — పరబ్రహ్మమే నేను"

## నేను - ఆత్మ



**అర్జునా!**

సచ్చిదానంద స్వరూపుడైన నేను గీతల నాశ్రయించి ఉందును. గీతలే నాకు ఇల్లు. గీతలలో చెప్పబడిన జ్ఞానమును అవలంబించియే నేను మూడు లోకములను పాలించుచున్నాడను. నేను అవ్యయమైన యీ యోగమును సృష్ట్యాదిని సూర్యునకుపదేశము జేసితిని. సూర్యుడు మను చక్రవర్తికి జెప్పెను. మను చక్రవర్తియు, ఇక్ష్వాకు మహారాజుకు జెప్పెను. ఇట్లు పరంపరగా వచ్చిన యీ యోగమును రాజర్షు లెఱుంగుదురు.

నేను బుట్టుకలేని వాడనైనను క్షీణముకాని జ్ఞానశక్తియే స్వభావముఁగల వాడనైను, భూతములన్నింటికిని ప్రభువునైనను, సత్వరజస్తమో గుణాత్మక యగు, నా వైష్ణవ మాయనవలంబించి నా మాయచేత నేను బుట్టుచున్నాను.

ఎప్పుడెప్పుడు ధర్మమునకు హానియును, నధర్మమునకు వృద్ధియు గలుగుచుండునో అప్పుడప్పుడు బుట్టుచుందును. ప్రతియుగమందును సన్మార్గ లను రక్షించుటకును దుర్మార్గులను నశింపజేయుటకును, ధర్మమును బాగుగా స్థాపించుటకును బుట్టుచుందును.

ఎవడు దివ్యమైన యిట్టి నా జన్మమును కర్మమును నిజముగాఁదెలిసి కొనునో వాఁడు ఈ దేహమును విడిచిన వెనుక మరల జన్మమును బొందడు. నాలోనైక్యమగును. రాగము, భయము, కోపము వీనిని వదలినవారై ప్రపంచ మంతయు నా మయముగాఁజూచుచు నన్ను ఆశ్రయించి అనేకులు జ్ఞాన మనెడి తపస్సుచేఁ బవిత్రులై నా భావమును అనగా బ్రహ్మత్వమును (మోక్షమును) బొందిరి.

నన్ను ఎవరెట్లు ఆశ్రయింతురో వారిని అట్లే నేనును అనుగ్రహించు చుందును. అన్ని విధముల చేతను మనుష్యులు అనగా కర్మాదికారులు నా మార్గమును అనుసరించుచుందురు. నేనే గుణ విభాగమున బట్టియు, కర్మ విభాగమున బట్టియు, నాలుగు జాతులవారిని సృజించితిని. మాయా సంబం ధము చేత నాలుగు వర్గములవారి యట్టి ధర్మములకు నేను కర్తనైనను, వాస్తవము చేతగర్తనుగాను, కావుననే నన్ను అవ్యయుడని దెలిసికొనుము.

ఆ కర్మలు నన్నంటవు. నాకు గర్మఫలమందు గోరికలేదు. ఈ రీతిగా నన్నెవడు తెలిసికొనునో వానికి గర్మబంధము లేదు. (మోక్షము గలుగు ననుట) ఇట్లు తెలిసికొని మోక్షమునందు కోరికగల పూర్వపువారునుగూడ, గర్మములను జేసిరి. నీవు గూడ పూర్వులగు జనకాదులచే అనాదిగా జేయ బడిన కర్మమునే జేయుము. ఈ కర్మాకర్మముల విషయమై బుద్ధిమంతులు గూడ సంశయములను బొందిరి. కాబట్టి యది తెలిసికొనిన సంసారమునుండి మోక్షమును బొందుదురో అట్టి కర్మాకర్మముల సంగతిని నేను నీకు జెప్పె దను.

కర్మము యొక్కయు, వికర్మము యొక్కయు, అకర్మముయొక్కయు యదార్థము తెలిసికొనుటకు చాల కష్టమున్నది.

ఎవడు వ్యాపార మాత్రమునందు గర్మాభావమును కర్మాభావమునందు గర్మమును జూచుచుండునో వాడు మనుష్యులలో బుద్ధిమంతుడు. వాడు యోగి, వాడు సమస్త కర్మములను జేయువాడు. ఎవడు చేయు కర్మములన్నియు కామము, వానికి గారణములగు సంకల్పములను లేనివై యుండునో, అటువంటి జ్ఞానమనెడి అగ్నిచే దహింపబడిన కర్మములు గల వానిని నిజమైన పండితునిగా బ్రహ్మవేత్తలు చెప్పుదురు. కర్మములందభిమానమును ఫలాసక్తిని విడిచి వెనుకజెప్పిన జ్ఞానముచేత నిత్యతృప్తుడై, ఆశ్రయరహితుడై, కర్మముల జేయుటకు బ్రవర్తించినను వాడేమియు జేయనివాడే. కోరికలను విడిచి అంతఃకరణమును ఆత్మను నియమించుకొని యేవిధమైన సంబంధమును కలుగజేసికొనక అభిమానము లేకుండ శరీర యాత్రకుపయోగించు కర్మములను జేసినను పుణ్యపాపములను బొందడు

ఆత్మ నిరవయము, నిర్గుణము, విపరిణామ రహితమునగుటచే బుట్టుట, పెరుగుట తరుగుట, చచ్చుట మున్నగు నవస్థలొకప్పుడును దానికి లేవు. కావుననే యది నిత్యము, శాశ్వతము పురాణమునై యున్నది శరీరము హతము గావింపబడుచున్నను అది (ఆత్మ) హతముగాకుండును.

## ఆత్మ

పరమాత్మ స్వరూపుడగు నేను ఒకానొకప్పుడును లేనివాడనుగాను. నీవు లేనివాడవుగావు. మనమందఱమును ఈ దేహములు నశించిన వెనుక గూడ ఉండెడివారమే

ఆత్మకు ఈ స్థూలదేహమునందు బాల్య, యౌవ్వన కౌమారములు కలుగుచున్నట్లే మఱియొక దేహమును గలుగుచుండును

అసత్తగు దేహములుండవు. సత్తగు నాత్మకు లేమిలేదు. ఏ ఆత్మ ఈ ప్రపంచమంతయు నిండియున్నదో ఆ ఆత్మకు నాశనము లేదని తెలిసికొనుము అవ్యయమగు నీయాత్మకు నాశమును గలుగజేయునది యేదియును

లేదు. ఎప్పుడును ఏకరూపమై నాశములేనిదై ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరముగానిదీ యాత్మ : ఈ ఆత్మను జంపెడి వానినిగాను, చంపబడు వానినిగాను దలచెడివారు తెలియనివారు. ఈ ఆత్మ ఒకప్పుడును పుట్టుక కలది కాదు. మరణము గలదియు గాదు. కొన్నాళ్ళకు గలుగునదియుగాని, కాదు. ఏమన ? ఆత్మ పుట్టుక అనాదియైనది. శరీరము పోయినను పోవునది గాదు.

మనుష్యుడు చినిగిపోయిన వస్త్రములను విడిచి క్రొత్త వస్త్రములను గట్టుకొనునట్లు, ఆత్మ జీర్ణములైన శరీరములను విడిచి, క్రొత్తవి యగు శరీరములను పొందుచుండును. ఈ యాత్మను శస్త్రములు ఛేదింపజాలవు. అగ్ని కాల్పజాలదు. ఉదకము తడుపజాలదు. గాలి శోషింపజేయలేదు. ఆత్మ ఛేదింపదగినది గాని, దహింపదగినదిగాని కాదు. ఎప్పుడును ఏకరూపముగా నుండునది అంతటను నిండియున్నది. స్థిరమైనది అచలమైనది సనాతనమైనది. ఆత్మ చక్షురాదీంద్రియముల కగపడదు. మనస్సుచేనాలోచించుటకు వీలు లేనిది. ఏ వికారములును ఆత్మకులేవు (అని తత్త్వజ్ఞులు చెప్పుదురు.)

ఒకానొకడు ఈ యాత్మను ఎప్పుడును జూడని వస్తువును జూచినట్లు ఆశ్చర్యముగా జూచును అట్లే మఱియొకఁడు ఆశ్చర్యముగా నొకనితో జెప్పును. వేఱొకడు ఆశ్చర్యముగా వినును. ఇంకొకడు వినినను ఈ ఆత్మను దెలిసికొనలేడు. పిపిలికాది బ్రహ్మపర్యంతమును ఆత్మ ఉండునది. సత్వగుణ ప్రధానుఁడవై యోగక్షేమముల నపేక్షింపక అట్టి ఆత్మ విషయిక జ్ఞానము కలవాడవు కమ్మా. నీవు కర్మఫలములకు గారణుడవుగాకుఁడ కర్మల నాచ రింపుము. ఎవడు ఆత్మయందాశక్తి గలవాడై ఆత్మచేతనే తృప్తినొందు చున్నాడో ఆత్మయందే సంతోషమును బొందుచున్నాడో, అటువంటి వానికి గర్మములవసరములేదు కర్మములను జేసినను, జేయకున్నను బ్రయోజనము లేదు. నష్టమును లేదు. ఆత్మ జ్ఞానము గలవాడు కర్మముల యందాసక్తిగల మూఢులబుద్ధిని జలింపజేయువాడు ; తనకు ఫలాపేక్ష లేకున్నను దాను కర్మ ములను జేయుచు వారిచేతను గూడ నన్ని కర్మములను జేయించుచుండవలెను. మరియు బుద్ధి భేధమును గలిగియుండగూడదు.

దేహము కన్న నింద్రియములు ఇంద్రియముల కన్న మనస్సు, మనస్సు కంటె బుద్ధి, బుద్ధి కన్న నాత్మ ఒక దానికంటె నొకటి యొకటి యెక్కువయని పండితులు చెప్పుదురు — గనుక బుద్ధికంటెను ఆత్మను ఎక్కువగా దెలిసికొనుము బుద్ధిచే మనస్సును నిగ్రహించుకొనుము.

హోమము జేయు పాత్రము బ్రహ్మము. హవిస్సు బ్రహ్మము. అగ్ని బ్రహ్మము. హోమము చేయువాడు బ్రహ్మము. హోమము బహ్మము. బ్రహ్మ స్వరూపము కల కర్మము నందు నిశ్చలమైన బుద్ధిగలవాడు పొందవలసిన ఫలమును బ్రహ్మమే. బ్రహ్మవేత్తను బ్రహ్మాగ్నియందాత్మ నాత్మచేతనే ప్రక్షేపమును జేయుచున్నారు. (అనగా బ్రహ్మాత్మైకత్వ నిష్ఠులగుచున్నారు.)

కొందఱు ఇంద్రియములను ఆధ్యాత్మిక వాయువుయొక్క కర్మములను జ్ఞానముచే బ్రజ్వలింపఁజేయఁడిన ఆత్మ సంయమమనెడి యోగాగ్నియందు హోమము జేయుచున్నారు.

బ్రహ్మవేత్త "ఇంద్రియములు విషయములందు బ్రవర్తించుచున్న యవియే కాని బ్రహ్మస్వరూపుడనగు నేను ఏమియు జేయుటలేదు" అని ధైర్యముతో దలచుచుండును. ఫలాసక్తి లేకుండ గర్మములను బ్రహ్మము నందుంచి యాచరించునో వాడు నీరు తామరాకు నంటనట్లు పాపముచే స్పృశింప బడడు - బ్రహ్మము నందు బుద్ధియుంచి బ్రహ్మ స్వరూపులై బ్రహ్మము నందే పట్టుదల గలిగి బ్రహ్మమే గతియును కొనుచు పునరావృత్తిలేని స్థాన మును (మోక్షమును) బొందుచున్నారు - బ్రహ్మము సర్వసమము దోష వర్జితము

ఏ పురుషుడు ఆత్మయందు సుఖముగలవాడై ఆత్మారాముడై ఆత్మ ప్రకాశముగలవాడై యుండునో ఆ యోగి బ్రహ్మభూతుడై యీ జన్మము నందే అనగా జీవించి యుండియే బ్రహ్మానందమును బొందును.

ఎవడు సమస్త భూతములను నా యందును· సర్వభూతముల యందును తన్నును చూచునో అట్టి బ్రహ్మాత్మైక్య సంధానము గలవానికి నేను పరోక్ష ముగా నుండును

నేను సమస్త ప్రపంచము యొక్క ఉత్పత్తి నాశములకు కారణుడను. పరమేశ్వరుడనగు నాకంటె వేఱుకారణమేసియు లేదు. సూత్రమందు మణులు గ్రుచ్చబడియున్నట్లే జగమంతయు నా యందే కూర్చబడియున్నది జల మందలి రసము, సూర్యుని యందును చంద్రునియందును ఉన్న తేజస్సు, వేదముల యందు ఓంకారము, ఆకాశమునందు శబ్దమునేనే అయియున్నాను. భూమియందలి సుగంధము, అగ్ని యందలి తేజస్సు, భూతములన్నిటి యందునున్న జీవనము, తపస్వుల యందలి తపస్సు నేనేయని తెలిసి కొనుము

సమస్త భూతములకును అనాదియగు నుత్పత్తి కారణము, బుద్ధిమంతుల యొక్క బుద్ధి. తేజశ్శీలుల యొక్క తేజస్సు నేనేయని తెలియుము. బల వంతుల యొక్క కామరోగములు లేని బలము, భూతములయందలి ధర్మము నకు విరుద్ధముగాని కామము నేనే అని తెలిసికొనుము. అదియిదియననేల సత్వ గుణ ప్రధానములగు పదార్థములు, రజోగుణ ప్రధానములగు పదార్థములు, తమోగుణ ప్రధానములగు పదార్థములు - పదార్థములు అన్నియు నా వలననే పుట్టుచున్నవనియే తెలిసికొనుము. కాని నేను వానికి వశుడను కాను. అవిమాత్రము నా యధీనములై యుండును.

ఎవడెవడు శ్రద్ధతో గూడిన వాడై భక్తుడగుచు ఏ యే దేవతామూర్తిని బూజింపదలచునో అట్టివానికి శ్రద్ధ నేనే సుస్థిరము చేయుచున్నాను. వాడు అట్టి శ్రద్ధతో గూడినవాడై ఆ దేవతల నారాధింప బ్రవర్తించును. ఆ దేవతల వలన గోరికలను బొందును. ఆ కోరికలు నేనే యేర్పాటు జేసినవియే సుమా !

నేను యోగమాయా సమావృత్తుడనగు నేనందఱకును ప్రకటముగాను. కావుననే మూఢులైన యీ పురుషులు పుట్టుకయు, నాశమును లేని నన్ను దెలియంజాలరు. నేను గతించినవియు, ఇపుడుండునవియు, రాబోవునవియు అగు భూతములను ఎఱుగుదును. నన్నొకడును దెలియలేడు. ఎవరు నన్నాశ్ర యించి జరామరణములను దొలగించుకొనుటకు ప్రయత్నింతురో వారు పర బ్రహ్మమును దెలియుదురు సమస్తమగు నధ్యాత్మమును సమమగు కర్మమును దెలియుదురు. ఎవ్వరు అది భూతము అది దైవము, అది యజ్ఞము అని వీనితో

నాయందాసక్తి గల మనస్సు గలవారు మరణ కాలమందును నన్ను దెలిసి కొందురు.

జగత్తులకు మూల కారణమగు అక్షరము జీవరూపముగా బరిణమించుటయే ఆధ్యాత్మము భూతములయొక్క ఉత్పత్తిని వృద్ధిజేయు దేవతోద్దేశముగా జేయబడిన ద్రవ్యత్యాగరూపమగు యజ్ఞమునకే కర్మమని పేరు నశించు పదార్థము అది భూతము. పురుషుడు అది దైవతము. ఈ దేహమందలి నేనే అది యజ్ఞమును, ఎవడు మరణకాలమందు నన్నే స్మరించుచు దేహమును విడిచిపోవునో వాడు నా భావమును బొందును.

అభ్యాసమనెడి యుపాయముతో గూడినదియు నితర విషయములను జెందనిదియునగుమనస్సుతో ప్రకాశరూపుడగు పరమ పురుషుని జింతుపుచు నతనినే పొందును.

ఎవడు సర్వజ్ఞుడును, అనాదిసిద్ధుడును, నియామకుడును, సూక్ష్మమైనదానికన్నను సూక్ష్మమైనవాడు, అన్నింటిని బోషించువాడును మలినములగు మనోబుద్ధులకు గోచరముగానివాడును ప్రకృతికంటె బైగా నుండువాడును అగు పురుషుని మరణకాలమందు భక్తితోగూడినవాడై విక్షేపరహితమగు మనస్సుతో యోగబలముచే బాగుగా భ్రూమధ్యమందు బ్రాణవాయువునుంచి చింతన చేయునో వాడు ప్రకాశస్వరూపుడును బరమాత్మ స్వరూపుడును అగు పురుషుని బొందును.

ఎవడు ఇంద్రియ ద్వారములన్నింటిని నియమించి మనస్సును హృదయమందు నిరోధించి తన ప్రాణవాయువును భ్రూమధ్యమందుంచి యోగస్థైర్యము నాశ్రయించినవాడగుచు "ఓమ్" అనెడి యేకాక్షరమును బ్రహ్మముగా నుచ్చరించుచు నన్ను స్మరించుచు దేహమును విడిచి అర్చరాది మార్గమున బోవునో వాడుత్తమగతిని బొందును. మఱియొకదాని యందు జిత్తములేనివాడగుచు నెవడు నన్ను నిరంతరమును బ్రతిదినమును స్మరించునో అట్టి నిత్యయుక్తుడగు యోగికి నేను సుఖముగా దొరకుదును. నన్ను బొందిన మహాత్ములు మోక్షమును బొందినవారేగనుక దుఃఖాశ్రయమును అనిత్యమును అగు జన్మమును మఱిపొందరు. బ్రహ్మలోకము వరకును యే లోకమునకు బోయినను బునరా

వృత్తిని బొందరు (తిరిగి జన్మింతురు). నన్ను బొందికనవారికి మరల జన్మము లేదు.

అవ్యక్తమనగా అక్షరమని చెప్పబడినది. దానినే ఉత్తమమైన గతిగా జెప్పుదురు. దేనిని పొందినవారు మఱి తిరిగిరారో అదియే నా యుత్తమమగు స్వరూపము. ఎవనిలో భూతములన్నియున్నవో, యెవనినే ప్రపంచమంతయు నిండియున్నదో, అట్టి పరమ పురుషుడనగునేను ఏకాంత భక్తిచేతనే దొరుకుదును.

దేనిని తెలిసికొనిన సంసారము నుండి విడుదలగుదురో అట్టి ఈశ్వరోపాసనతో గూడినదియు, మిక్కిలి రహస్యమును, అసూయలేని ఈ జ్ఞానము విద్యలలో శ్రేష్ఠమును, రహస్యములలో శ్రేష్ఠమును, పవిత్రమును, ఉత్తమమును, ప్రత్యక్షబోధగలదియు, ధర్మమునుండి తొలగనిదియు, నాచరించుటకు సుఖకరమైనదియు, అవ్యయమైనదినైయున్న ధర్మమును నమ్మనివారు నన్ను జేర మృత్యువుతో గూడిన సంసారమార్గమునందు దిరుగుచుందురు. ఇంద్రియములకు గోచరముకాని స్వరూపముగల నాచే నీ జగత్తంతయు నిండియున్నది. భూతములన్నియును నా యందున్నవి నేనా భూతములనంటి యుండలేదు. అంతటను సంచరించు మహా వాయువు నిత్యమును ఎట్లు ఆకాశము నందుండునో అట్లు సర్వభూతములును నా యందున్నవి కల్పాంతమందు భూతములన్నియు నా మాయలో లయమగును. మరల వానిని కల్పాదియందు నేనే సృజించుచుందును. ప్రకృతివశమ్మునంజేసి యస్వతంత్రమగు నీ భూతముల నన్నింటివి నా యధీనమగు మాయ నవలంబించి మరల మరల సృజించుచుందును.

అధిష్ఠాతనగు నా చేత ప్రకృతియే చరాచర ప్రపంచమును గనుచున్నది. ఈ కారణము చేతనే యీ జగత్తు మరల మరల బుట్టుచుండును. సర్వభూత నియామకమగు నా తత్త్వమును దెలిసికోలేనివారై మూర్ఖులు మనుష్య శరీరము నవలంబించిన నన్ను అవమానము చేయుచుందురు. అటువంటి మూర్ఖులు నిష్ఫలమైన ఆశగలవారును వ్యర్థమైన జ్ఞానము గలవారును, నిక్షేపమును బొందిన చిత్తముగలవారును. తమోగుణ ప్రధానమును, రజోగుణ ప్రధానమును, బుద్ధిని భ్రమింపజేయునదియునగు ప్రకృతి నాశ్రయించినవారును

నన్నవమానింతురు. మహాత్ములగువారో సత్వగుణము నాశ్రయించినవారై యితరుల యందు మనస్సులేని వారలగుచు నన్నే జగత్తులకు గారణుడ ననియు నిత్యుడననియు దెలిసికొని సేవింతురు.

ఈ జగత్తులకు దండ్రిని నేనే, తల్లిని నేనే, కర్మఫలమునిచ్చువాడును నేనే, పావనమైనవాడును నేనే, ఓంకారము నేనే, ఋగ్యజుస్సామ వేదములును నేనే, కర్మఫలము భరించువాడు, నియామకుడు, శుభాశుభముల జూచువాడు, భోగస్థానము, రక్షకుడు, హితము చేయువాడు, సృజించువాడు, సంహరించు వాడు, ఆధారము, లయస్థానము, నశింపని బీజములన్నియు నేనే.

ఎవరు ఇతరుల సేవింపని వారలై నన్నే చింతించుచు సేవింతురో అట్టి నిత్యాభియుక్తులకు నేనే యోగక్షేమములను బొందుచున్నాను. శ్రద్ధతో గూడిన భక్తులు ఎవరైనను అన్యదేవతలను బూజించుచుందురో వారు నన్నే పూజించిన వారగుదురు. కాని వారు బునరావృత్తిని బొందుదురు.

ఎవడు భక్తితో బత్రముగాని, పుష్పముగాని, ఫలముగాని, జలము గాని నాకు సమర్పించునో అట్టి నిష్కామభక్తుడు భక్తితో సమర్పించినట్టి యాయా పత్రపుష్పాదికమును నేను ప్రీతి పూర్వకముగా బుచ్చుకొందును.

నేనన్ని భూతముల యందును సముడను. కావున నాకు ప్రియుడు గాని, ద్వేషింపదగినవాడుగానిలేడు. ఎవడు నన్ను భక్తితో సేవింతురో అట్టి భక్తులు నా యందుందురు. నేను వారియందుందును.

ఎంత దురాచారము గల వాడయనను అన్యమును సేవింపక నన్నే సేవించుచుండునో వాడు శ్రేష్ఠుడనియే తలంపవలయును. ఏమనగా వాడు "పరమేశ్వర సేవచేతనే కృతార్థుడనగుదును" అను మంచి నిశ్చయము గల వాడగును. అట్టి దురాచారుడు వేగముగా ధర్మాత్ముడగును. నిత్యమగు శాంతిని బొందును. నా భక్తుడెన్నటికిని నశించువాడు కాడు. ఎవరైనను నీచజన్మముగల వారగుదురు గాక ; అట్టి వారును స్త్రీలు, వైశ్యులు, శూద్రులు – వీరు వారన నేల వీరందఱును నన్ను సేవించి నిశ్చయముగానుత్తమ గతిని బొందుదురు. కావున అనిత్యమును, సుఖ రహితములు అగు నిట్టి మానుష దేహమును

బొందిన నీవు నన్ను సేవింపుము. నా యందే మనస్సు గలవాడవు కమ్ము. నాకే భక్తుడవు కమ్ము. నన్ను బూజించువాడవుకమ్ము. నాకే నమస్కరింపుము. ఈ రీతిగా నా యందాసక్తుడవై మనస్సునుంచితివేని పరమానంద స్వరూపుడ నగు నన్నే పొందుదువు.

దేవతలుగాని మహర్షులుగాని నా జన్మము నెఱుంగరు. నేనేకదా! దేవతలకును మహర్షులకు సర్వప్రకారములచేతను కారణభూతుడనై యున్నాను.

ఎవడు నన్ను బుట్టుకలేనివానిగను, ఆదిలేని వానిగను సర్వలోకములను నియమించువానిగను, దెలిసికొనునో అట్టివాడు మనుష్యులలో మోహరహితు డగుచు పాపములన్నింటిచే ముక్తుడగును. సర్వభావములన్నియు వేఱువేఱుగా ప్రాణులకు నా వలననే కలుగుచున్నవి. నేనే అన్నింటికిని గారణము. నా వల ననే సర్వమును బ్రవర్తించుచున్నది. నాయందాసక్తి గలవారై నన్ను బ్రీతి పూర్వకముగా సేవించువారికే ఏ యుపాయముచే నన్ను బొందుదురో అట్టి బుద్ధి రూపమగు నుపాయమును ఇచ్చుచున్నాను వారిననుగ్రహించు నుద్దేశము తోనే నేను వారి బుద్ధివృత్తియందుండువాడనగుచు బ్రకాశించు జ్ఞానమను దీపముచే అజ్ఞానము వలన బుట్టినవారి సంసార రూపమగు తమస్సును నశింప జేయుచుందును.

సర్వ భూతముల అంతఃకరణములయందు ఉన్నటువంటి పరమాత్మను నేను. సర్వ భూతముల ఉత్పత్తిస్థితి నాశములకు గారణమునేనే. ద్వాదశాదిత్యు లలో విష్ణువనువాడను నేనే. ప్రకాశించువానిలో నంశుమంతుండగు సూర్యుడను నేనే. దేవతలలో మరీచిని నేను. నక్షత్రములలో జంద్రుడను నేను. వేదము లలో సామవేదము దేవతలలో నింద్రుడు ఇంద్రియములలో మనస్సు, భూత ముల సంబంధమగు జ్ఞానశక్తి నేనే. రుద్రులలో శంకరుడు, యక్షరాక్షసులలో గుబేరుడు, వస్తువులలో నగ్ని, పర్వతములలో మేరువునేనే. పురోహితులలో ముఖ్యుడగు బృహస్పతిని నేనే. సేనా నాయకులలో గుమారస్వామిని నేనే. స్థిరజలాశయములలో సముద్రుడను నేనే. మహర్షులలో భృగుమహర్షిని నేనే. వాక్కులలో నేకాక్షరమగు "ఓమ్"కారము నేనే. యజ్ఞములలో జపయజ్ఞము నేనే. స్థావరములలో హిమాలయము నేనే యగుచున్నాను.

వృక్షములన్నింటిలో రావిచెట్టు, దేవర్షులలో నారదుడు, గంధర్వులలో చిత్రరథుడు. సిద్ధులలో గపిలమహాముని నేనే యగుచున్నాను గుఱ్ఱములలో ఉచ్చైశ్రమము నేనే. ఏనుగులలో నైరావతము నేనే నరులలో రాజును నేనే. ఆయుధములలో వజ్రము, ధేనువులలో గామధేనువు ప్రజల యుత్పత్తి హేతు వగు, కాముడును నేనే. పాములలో వాసుకుని నేనే. విషములేని పాములలో అనంతుడను నేనే. జలచరములకు రాజగు వరుణుడు నా విభూతియే. పితృ దేవతలకు రాజగు అర్యముడను, నియామకులలో యముడను నేనే. దైత్యులలో ప్రహ్లాదుడను, గణన చేయువానిలో కాలమును, మృగములలో సింహమును, పక్షులలో గరుత్మంతుడను నేనే యగుచున్నాను. వేగముగలవానిలో వాయువు, శస్త్రధారులలో రాముడు. మత్స్యములలో మకరము, నదులలో గంగానది నేనే యగుచున్నాను ఆది మధ్యాంతములు, ఆత్మవిద్య, వాదమును నేనే యగు చున్నాను. అక్షరములలో అకారము, సమాసములలో ద్వంద సమాసము, కాలము, కర్మముల విధించువారలలో విశ్వతోముఖుండగు దాతను నేనే. సర్వ హరమగు మృత్యువును. స్త్రీలలో కీర్తి, శ్రీ. వాక్కు, స్మృతి, మేధ, ధృతి, క్షమ యివన్నియు నా స్వరూపములే సామములో బృహత్సామము, ఛందస్సులలో గాయత్రి, మాసములలో మార్గశీర్షము, ఋతువులలో వసంత ఋతువు నా విభూతియే.

శిక్షించువారి సంబంధమగు దండము నా విభూతియే జయింపదలచు వారిదగు నీతి, గోప్యమగు వానిని గోపనము చేయు మౌనము, తత్త్వజ్ఞాను లజ్ఞానము నేనే సుమా!

దివ్యములగు నా విభూతులకు అంతములేదు. వేయేల? ఐశ్వర్యముతో గూడినదియు, సంపదతోగూడినదియు, సర్వాతిశాయియునగు ఏయే వస్తువుగలదో అది యంతయు నా యంశము వలన బుట్టిన తేజస్సనియే బాగుగా నెఱుంగునది. ఇట్లు వేఱు వేఱుగా దెలిసికొనుటచే నీకేమి లాభమున్నది? ఈ జగత్తంతయునొక యంశముచే నిండి నేనున్నాను. నాకంటే వ్యతిరేకమయినది కొంచెమునులేదు.

ఎవరు సర్వకర్మములను నాయందు సమర్పించి నాయందాసక్తి గలవారై యే కొంతయగు భక్తియోగముచే నన్ను ధ్యానించుచు నుపాసింతురో అట్టినా యందు చిత్తముంచిన వారిని మృత్యువుతో గూడిన సంసార సముద్రమునుండి

శీఘ్రకాలములో నేనే ఉద్ధరింతును. కావున నీవు నాయందే మనస్సును స్థిరముగా నుంచుము నాయందు బుద్ధి యుంచుము. ఒకవేళ నాయందు మనసును స్థిరముగా నుంచజాలవేని యోగాభ్యాసముచే నన్ను బొందుటకు ప్రయత్నించుము. అట్లు అభ్యాసము చేయుటకు శక్తిలేని వాడవైతివేని నన్ను గురించి కర్మములు జేయుము. అట్లును చేయలేనిచో నన్ను శరణము జొచ్చిన వాడవై నియతచిత్తముతో సర్వకర్మఫలమును విడిచిపెట్టుము. జ్ఞానము దీనికంటె ధ్యానము, దీని కన్న కర్మఫల త్యాగము శ్రేష్ఠము. దీనివలన శాంతి కలుగును.

ఈ శరీరమునకు క్షేత్రమని పేరు. దీనిని దెలిసికొనినవానిని క్షేత్రజ్ఞుడని చెప్పుదురు. దేహము లన్నింటియందును ఉన్నటువంటి నన్నే క్షేత్రజ్ఞునిగా దెలిసికొమ్ము. పృథివ్యాది పంచమహాభూతములు, అహంకారము. మహత్తత్త్వము. మూలప్రకృతి. కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, మనస్సు, శబ్దాది విషయములు, ఇచ్ఛ. ద్వేషము, సుఖము, దుఃఖము, శరీరము, చేతన, ధృతి ఇవి యన్నియుగలసి క్షేత్రమని తెలియుము. పరమేశ్వరుడు నగు నా యందు సర్వాత్మ దృష్టిచే ఏకాంత భక్తికలిగి యుండుము. అది లేనిది, నిరతిశయమైనది బ్రహ్మము. అది సత్తుగాదు, అసత్తును గాదని చెప్పుదురు. అది లోకమందలి సర్వమును ఆవరించుకొనియుండి సంగములేనిదై సర్వమును భరించునది. సత్త్వరజస్తమోగుణములు లేనిది. సత్త్వాది గుణములను బాలించునది. మూఢులకు దూరముగా నుండుచు, పండితులకు చేరువగా నుండుము. భూతములయందు అభేదముగ నున్నను భేదము గలదానివలె నుండును భూతములను బోషించునది. ప్రళయమందు మింగునది. సృష్టికాలమందు నానారూపములుగా బుట్టునట్టి జ్ఞేయ పదార్థము. చంద్రసూర్యాదులనుగూడ బ్రకాశింపచేయునది అదియే జ్ఞానమనునది. అదియే జ్ఞేయపదార్థము. దానిని జ్ఞానముచేతనే తెలిసికొనవలయును. అది అందరి హృదయములయందును ఉన్నది.

ప్రకృతి పురుషులిద్దఱును ఆది లేనివారని తెలిసికొనుము. దేహేంద్రియాది వికారములు, సత్త్వరజస్తమోగుణములు, ఆ గుణపరిణామములకు సుఖదుఃఖాదులు ఇవన్నియు బక్రృతివలన గలిగినవని తెలియుము. శరీరేంద్రియముల యొక్క కర్తృత్వము విషయమై ప్రకృతి హేతువని చెప్పుచున్నది. పురుషుడు (జీవుడు) సుఖదుఃఖములయొక్క భోక్తృత్వ విషయమై హేతువని చెప్పబడు

చున్నాడు ప్రకృతి కార్యమగు దేహమందున్నవాడై జీవుడు అసత్తువలన బుట్టిన సుఖాదిగుణముల ననుభవించుచున్నాడు. దేవాది యోనులయందలియు; తిర్యగాది యోనులయందలియు, జన్మముల యందలి గుణసంగమ కారణము: సమీపమందుండువాడై, చూచువాడును, ఆమోదించువాడును, భరించువాడును, భోక్తయు, మహేశ్వరుడును, పరమాత్మయనని చెప్పబడు పురుషుడు దేహమందున్నను దానికంటె భిన్నుడే. కొందరు ధ్యానముచే దేహమందు మనస్సుచే నాత్మను జూచుచుందురు. ప్రకృతి పురుషవైలక్షణ్య పర్యాలోచనచేతను అష్టాంగ యోగముచేతను, కర్మయోగముచేతను ఆత్మను జూచుచుందురు. ఎవడు ప్రకృతిచేతనే సర్వప్రకారములుగ జేయబడుచుండు కర్మములను జూచు ఆత్మ కర్తగాదని చూచుచు, భూతముల పృథగ్భావమును (భేదమగు) ఒక్క ఈశ్వరశక్తియగు ప్రకృతియందున్నదానిగను, ఆ ప్రకృతివలననే భూతముల విస్తారమును జూచుచుండిన బ్రహ్మత్వము నొందుచున్నాడు.

ఒక్క సూర్యుడు ప్రపంచమునంతయు నెట్లు ప్రకాశింపజేయుచున్నాడో అట్లే క్షేత్రజ్ఞుడు క్షేత్రముల నన్నింటిని ప్రకాశింపజేయుచున్నాడు. ఇది నెవరు తెలిసికొందురో వారు మోక్షమును బొందుదురు.

గొప్పదియగు నా ప్రకృతి ఉత్పత్తికి గారణము నేను దానియందు జగద్విస్తార హేతువగు చిదాభాసుని ఉంచుచున్నాను. అందువలన బ్రహ్మాది సర్వభూతముల యుత్పత్తియు నగుచున్నది. సమస్త యోనులయందును ఏమూర్తులు పుట్టుచున్నవో వానికన్నింటికిని బ్రకృతి తల్లివంటిది. నేను బీజప్రదుడ నగుటచే దండ్రివంటివాడను. సత్వము, రజస్సు, తమస్సు అను గుణములు మూడు ప్రకృతివలన బుట్టినవగుచు నిర్వికారుడై దేహమందు దాదాత్మ్యముగనున్న ఆత్మను నిబంధించుచున్నవి. దేహాద్యాకారముగా బరిణమించు నీ మూడు గుణముల నతిక్రమించి దేహి (జీవుడు) జన్మము, మృత్యువు, జర మొదలగు దుఃఖములచే విడువబడిన వాడగుటకు బ్రహ్మానందమును బొందును. నేనే బ్రహ్మమునకును, అవ్యయమగు మోక్షమునకును, శాశ్వతమగు ధర్మమునకును అఖండమైన సుఖమునకును ప్రతిష్ఠ అనగా స్థానము. ఏ స్థానమును సూర్యుడు, చంద్రుడు, అగ్ని ప్రకాశింపజాలరో, ఏ పదమును బొంది మరల దిరిగిరారో అది నా ముఖ్య స్థానము. ఏ తేజస్సు సూర్యునియందున్నదియై ప్రపంచము

నంతయు ప్రకాశింపజేయుచుండునో, ఏ తేజస్సు చంద్రునియందుండునో, ఏ తేజస్సు అగ్నియందుండునో ఆ తేజస్సంతయు నా సంబంధమైనది యనియే తెలిసికొనుము. నేనును బలముచే భూమియందుండి భూతములను ధరించు చున్నాను. నేనే రసస్వరూపుడగు చంద్రుడనై ఓషధుల నన్నింటిని బోషించు చున్నాను.

నేను జఠరాగ్నినై ప్రాణులయొక్క దేహము నాశ్రయించి ప్రాణాపాన ములతోగూడి ప్రాణులు భుజించు భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యములను నాలుగు విధములైన యన్నమును పచనము చేయుచున్నాను.

నేను సర్వప్రాణుల హృదయమందును అంతర్యామి రూపముగానున్నాను. నావలననే స్మృతి, జ్ఞానము ఆ రెంటియొక్క నాశనము గలుగుచున్నవి. నేనే అన్ని వేదములచేతను దెలియదగినవాడను. నేనే వేదాంత సంప్రదాయమును ప్రవర్తింప జేయువాడను. వేదార్థమును దెలిసినవాడను అగుచున్నాను.

క్షరుడు, అక్షరుడు నని యీ యిద్దఱు పురుషులును లోకములో ప్రసిద్ధులు. అందు క్షరుడనగా బిపీలికాది బ్రహ్మపర్యంతమునుండు సర్వభూతములును, అక్షరుడనగా గూటస్థుడునని చెప్పబడుచున్నారు. ఈ యిద్దఱికంటెను వేఱుగ నుత్తమపురుషు డొకడు కలడు. వానినే పరమాత్మ యందురు. ఆతడు మూడు లోకములను ప్రవేశించి భరించుచుండుమ అతడు ఈశ్వరుడు నిర్వికారుడును. నేను క్షరమున అతిక్రమించినవాడ నగుటచేతను అక్షరునికంటె నుత్తముడ నగుటచేతను వేదములయందును లోకమందును బురుషోత్తముడనని ప్రసిద్ధి నొందితిని. ఎవడు నిశ్చితమతియగుచు నెవడు నన్ను బురుషోత్తమునిగ దెలిసికొనుచున్నాడో వాడు సర్వప్రకారములచేతను నన్నే సేవించుచుండును. అందువలన సర్వజ్ఞుడగును.

దైవమనియు నసురమనియు భూతములయొక్క సృష్టి రెండువిధములు. దైవసంపద మోక్షముకొఱకును, అసురసంపద బంధముకొఱకును అగును. ధర్మమందలి ప్రకృతి నెఱుంగువారు దైవసంపద (స్వభావము) గలవారు. అధర్మమునుండి నివృత్తి నెఱుంగనివారు. అసురసంపద గలవారు (స్వభావము) వీరు అనేకవిధములగు మనోరథములయందు ప్రవర్తించిన చిత్తముగలవారగుటచే

విక్షేపము బొందుచు, మోహమనడివలలో దగులుకొని కామభోగములయందు ఆసక్తులై యశుచియగు నరకములో గూలుచుందురు. వీరు దమదేహముల యందును బరుల దేహములయందును జిదంశచేనున్న నన్ను ద్వేషించుచు మంచి వారి గుణములయందు దోషముల నారోపించుచు యజ్ఞములు చేయుచుందురు. అట్లు నన్ను ద్వేషించు క్రూరులును, అమంగళులును అగు నరాధములకు సంసారమందు మాటిమాటికిని ఆసురయోనులయందు బుట్టించుచుందును. అట్లు అసురయోనులయందు బుట్టిన మూఢులు ప్రతిజన్మమందును నన్ను బొందకయే అందుండి యధమగతిని బొందుచుందురు. కామము, క్రోధము, లోభము అను మూడును నరకమునకు ద్వారములు. కావుననే ఆత్మను నీచయోనులయందు బడవేయునవి కాబట్టి యీ మూటిని తప్పక విడువవలయును. ఈ మూడింటిని విడిచి తమ శ్రేయస్సునకు సాధనములగు తపస్సు, యోగము మొదలగు కర్మముల నాచరించి దైవసంపదను బొంది, ఆ వెనుక మోక్షమును బొందును.

శాస్త్రమునందు జెప్పబడిన కర్మములను దెలిసికొని "ఈ పని చేయవల యును, ఈ పని చేయరాదు" అను విషయములను దెలిసికొని కర్మాధికారివై కర్మముల నాచరించుము.

ప్రతివానికి సాత్వికమని, రాజసమని, తామసమని శ్రద్ధ మూడువిధము లగుచున్నది. అది పూర్వకర్మ సంస్కారమువలన బుట్టుచుండును. అందఱికిని సత్త్వ తారతమ్యమునుబట్టి శ్రద్ధ కలుగుచుండును. కావున నీ పురుషుడు శ్రద్ధా మయుడు. ఎవడెట్టి శ్రద్ధగలవాడో వాడట్టి శ్రద్ధతో గూడినవాడగును. ఏ మంచి పనిచేయుటకైనను మంచి శ్రద్ధ యుండవలయును. యజ్ఞములు, దానములు, తపస్సులు మొదలగు కర్మములు విడువరాదు. జ్ఞానమని, జ్ఞేయమని, పరిజ్ఞాత యనియు మూడువిధములు. సాధనమని, కర్మమని, గర్తయనియు మూడు విధములు. ప్రతివాడును కర్మములయందాసక్తిగలవాడయినచో జ్ఞానయోగ్యు డగును. ఏ పరమాత్మవలన భూతము ప్రవృత్తి యగుచున్నదో యే పరమాత్మ యీ ప్రపంచమంతటను నిండియున్నదో అట్టి పరమాత్మను తన కర్మములచేతను బూజించిన మానవుడు సిద్ధినొందును. బాగుగా నాచరింపబడిన పరధర్మముకంటె విగుణమైనను స్వధర్మము శ్రేష్ఠము. స్వభావనియుతమైన కర్మముల నాచరించు వాడు పాపమును బొందడు. దోషముతో గూడినదైనను సహజమైన కర్మము లను విడువరాదు. ప్రయోజనము లన్నియు పొగచేత నిప్పావరింపబడినట్లు

దోషములచే నావరింపబడియే యున్నవి. భక్తిచేతనే నెవరో యెట్టివాడనో యథార్థమును దెలిసికొనుము నన్ను యథార్థముగా దెలిసికొనిన పిమ్మట నా యందు ప్రవేశింతువు. ఎప్పుడును సర్వకర్మములు నాచరించువాడైనను నన్నాశ్రయించినవాడై నా యనుగ్రహము వలన శాశ్వతమను అవ్యయమను అగు పదమును బొందును. సర్వకర్మములను మనస్సుచేత నా యందుంచి నా యందాసక్తుడవై బుద్ధి యోగము నవలంబించి యెప్పుడును నా యందే చిత్తము గలవాడవగుము. నాయందే చిత్తము గలవాడవై యుంటివేని నా యనుగ్రహము వలన సర్వ దుఃఖములను అతిక్రమింతువు ఒకవేళ నే జెప్పినదంతయు నహంకారముచేత వినవేని నశించిపోయెదవు. ఏ యహంకారమునవలంబించి స్వకర్మ చేయనని తలంచుచున్నావో ఆ యహంకారము నీకు వట్టిది సుమా! ఏమనగా - నిన్ను బ్రకృతియే కర్మను (యుద్ధము) చేయుటకు నియోగించును

ఈశ్వరుడు సర్వభూతాంతర్యామియై యున్నాడు యంత్రముమీది వానిని త్రిప్పుపగిది మాయచే సర్వజీవులను భ్రమింపజేయుచున్నాడు. మనోవాక్కాయములచే (త్రికరణశుద్ధిగా) అతనినే శరణుగోరుము. మత్కారుణా కరునికరుణచే శాంతమైనట్టియు, శాశ్వతమైనట్టియు, గొప్పదగు పదవిని పొంద గలవు. అతి రహస్యమైన జ్ఞానమును నీకుపదేశించితి. విమర్శించి నీ యిష్టము వచ్చినటుల జేయుము.

పశుధర్మలగు నాహార నిదురా విహారాదులే మానవునకు పరమావధి గాదు గనుక ధర్మమునొక దానిని నిరంతరము స్మరింపుచు పరమాత్మ సర్వ భూతాంతర్యామియై వెలుంగుచున్నాడు. దేహమనెడి దేవాలయమందలి పర మాత్మను పూజించుట అను దయ సత్య శౌచములు కలిగి వర్తించలయును. అందువలన నిహపర సాధనమగు శాశ్వత కీర్తిని గడించగలవు. విచారించి యుచితము నాచరింపుము.

నాయందే చిత్తముంచుము నన్నే సేవింపుము పూజింపుము నాకే నమస్కరింపుము. అట్లు చేసితివేని నన్నే పొందెదవు. నిజముగా ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను. నాకు నీవు చాలా యిష్టుడవు. సర్వధర్మములను విడిచిపెట్టి నన్నొక్కనినే శరణు పొందుము. నేను నిన్నన్ని పాపముల నుండియు విడి పింతును. విచారింపకుము. ఇట్టి పరమ రహస్యమును నా భక్తులకు జెప్పిన

వాడు నాయందు గొప్ప భక్తి గలవాడై తప్పక నన్నే పొందును. కావున వాని కంటె మనుష్యులలో నాకు మేలు చేయు వాడొకడును లేడు. ధర్మమును దప్పని యీ మన సంవాదము నెవడధ్యయనము చేయునో వాడు నన్ను జ్ఞానయజ్ఞముచే బూజించినట్లే యని నా ముఖ్యాభిప్రాయము.

ఎవడు శ్రద్ధ గలవాడై యసూయలేని వాడై వినునో వాడును అన్ని పాపములచే విడువబడి యశ్వ మేధాది పుణ్య కర్మముల జేసిన వారి లోకము లకు బోవును.

ఈ గీతార్థ తత్త్వమును తన ధర్మమును విడచిన వారికి గురువునందు గాని ఈశ్వరునందు గాని భక్తిలేని వానికిని పరిచర్య చేయని వానికిని. నన్ను నిందించు వానికిని ఎన్నడును చెప్పవలదు.

అర్జునుడిట్లు చెప్పుచున్నాడు:— కృష్ణా నా మోహమంతయు పోయినది. నీ యనుగ్రహము వలన స్మృతి కలిగినది. నా సందేహములన్నియు బోయి స్థిరముగానున్నాను. నీవు చెప్పినది చేసెదను.

ఇక్కడ నారాయణుడగు శ్రీ కృష్ణ పరమాత్మ నరుడగు అర్జునునకే గాక సమస్త నరులకు అర్జునిని నిమిత్త మాత్రముగా జేసి గీతోపదేశము గావించెను. ఓమ్ తత్సత్ — శ్రీకృష్ణ పరబ్రహ్మార్పణమస్తు శ్రీ గురుదేవుల ద్వారా సమ ర్పితము. ఇతిశమ్.

## ఆత్మస్వరూపము

ఆత్మస్వరూపము నెఱుంగుటయే మనుష్యుని తుట్టతుది లక్ష్యము. ఆ లక్ష్యముతో బూజించుటయే సరియగు నుపాయము.

ఈ మాంసపిండమయమైన స్థూల దేహమే నా యదార్థ స్వరూపము కాదనియు దీనికంటె వేరుగానొక సూక్ష్మశరీరము నాకు గలదనియు, నా పాప పుణ్యములు, ధర్మాధర్మములు, నా యాశలు, నా కోరికలు నన్నియు నీ సూక్ష్మ శరీరము వల్లనే వ్యక్తములగుచున్నవన్నియు (తెలియబడుచున్న వనియు) దేవశక్తి సమూహము సైతము ఈ సూక్ష్మదేహము నుండియే

యావిర్భవించుననియు, మఱియు నీ కానవచ్చుచున్న స్థూలదేహము, సూక్ష్మ దేహము యొక్క ఘనీభూత వికాసమేయనియు, నిదిభోగాయతన క్షేత్ర మనియు నీ ఘటస్థాపన కార్యము వల్లనే యత్రశమముగా మనసున నాటుకొనును. ఈ రీతిని బూజచేయగా జేయగా సూక్ష్మదేహ విషయక సంస్కారములు స్థూలదేహమువలెనే సుధృఢములగునపుడు ఈ సూక్ష్మ శరీరమెక్కడనుండి పుట్టుచున్నది? యను దానిపై మెల్లగా లక్ష్యము పడి మెల్లమెల్లగా గారణ శరీరము ప్రత్యక్షము కాజొచ్చును క్రమముగా గారణ శరీర సంబంధమైన జ్ఞానము సుధృఢముకాగా, అనగా 'నేను' అన్నంతమాత్రముననే కారణ శరీరము వఱకు బ్రతీతి గోచరమగు చుండును. అపుడు కారణాతీత క్షేత్రము వైపు యనగా నిరంజన స్వరూపము వైపు నిగాపడును దాని ఫలముగా జీవుడు ఆత్మ స్వరూపసంధానమొందును. ఈ విధముగా సుఖదుఃఖములతో నిండిన సంసార సాగరము నావలిగట్టుజేరి పూర్ణానంద స్వరూపమున నిల్చిపోవును. ఇదే మనుష్యుని మనుష్యత్వము ఇదే మనుష్యుని తుట్టతుది లక్ష్యము

ఓం తత్సత్.





# అక్షరాభ్యాసము

# శ్రీ శివనామ మంత్రోపదేశము

ఓం నమశ్శివాయైచ నమశ్శివాయ

భగవన్నామోచ్చారణ మొక యంశముగా ఉపాసనా పద్ధతిలో జెప్ప
బడినది. మన పూర్వులచే సంస్కరింపబడి యుపాసనానుకూలముగా గ్రహింప
బడిన నామములనేకములు గలవు. అవి శ్రీరామ, శ్రీకృష్ణ, శివ మొదలగు
నామములు. అట్టివానిలో 'శివ' యను నక్షరద్వయ విశిష్టమగు పదము
మిక్కిలి గౌరవింపబడుచు వచ్చుచున్నది. ఇందులకు నిదర్శనము చాలగలవు.

భారత దేశమునందలి భారతీయులెల్లరు దమతమ భాషలలో దమ బాలు
రకు నక్షరాభ్యాసము గావించుటకు ప్రారంభముననే 'ఓం నమఃశివాయ సిద్ధం
నమః' అను సంస్కృత వచనమును నేర్పుదురు. ఇందు 'శివ' అను పదము
చతుర్థ్యంతమై 'శివాయ' అని మారి 'ఓం'కార ప్రణవము నాదియందును,
'సిద్ధంనమః' అను పద విశేషము నంతమందును గలిగియున్నది

ఈ యుపదేశమే పరంపరాగతమై యక్షరాభ్యాస కాలమందు భారతీయ
యాచారమైయున్నది. ఇందులకు కారణమేమనగా సుపుత్రశిశువు జన్మించి
నపుడు బాల్యముననే వానిని సరియైన మార్గమున బెట్టి విద్య చెప్పించి, జ్ఞాన
శీలుడగు పెద్దవానినిగా జేసి, వానివలన సద్గతిని బొంది సుఖించుట మానవునకు
గ ర్తవ్యమును, ముఖ్యవాంఛయునై యున్నది. కావున వేదచోదితమై విద్వాంసు
లచే స్తుతింపబడి మహాపురుషులచే జపింపబడి శుభకత్తు విలసిల్లినది.

సుతునిఁదొడపైఁ గూర్చుండఁబెట్టుకుని యక్షరాభ్యాస సమయమునఁ
దండ్రి యుపదేశించుచుండుట మనము ప్రత్యక్షముగాఁ జూచుచున్నాము.
తాను నిరు పార్శ్వముల యందలి వస్తువుల విలువను దెలియజేయు ముల్లువలె,
నాభరణములంచు మణిచందమున వేదములకు మధ్యవర్తియై సమస్తపదము

లందును శోభించుచున్నదని వేదవిదులు కొనియాడుచున్నారు. 'నమశ్శివాయచ శివతరాయచ' అని శ్రుతియందును గలదు. మన శాస్త్రములం దెచటగాంచినను శివ శబ్ద విచారమును, మన పవిత్ర స్థలములందెచట విలోకించినను శివాలయ నిర్మాణములు నెక్కుడుగాగలవు అది యటుండ జగద్విఖ్యాతములగు భారత భాగవత రామాయణాది సద్గ్రంథములయందు శివనామమహిమయు, శివ మూర్త్యర్చన ప్రభావమును, శివానుగ్రహ సంపన్నుల చరిత్రములును బెక్కు సారులు పేర్కొనంబడియున్నవి. ఇన్నివిధముల శివనామముయొక్క గొప్ప దనము గ్రహింపబడియుండుటచేతనే శివ మంత్రోపదేశము అక్షరాభ్యాసము తోడనే శుభార్థ ప్రతిపాదకమగుటచే నెల్లరకును శివశబ్దము త్రికరణశుద్ధి కరమునగు జపధ్యానాధి కార్యములందు పరిగ్రహింపఁదగియున్నది. అంత మాత్రము సమత విషయకమగు నభిప్రాయ భేదముల మనము గల్పించు కొని ద్వేషములు పెంచుకొనరాదు. లోకకళ్యాణ కరమగు మత మొక్కటే కాని యిన్ని లేవు. సమస్త విశ్వపరిపాలకుఁడగు భగవంతుఁడు నొక్కడే. బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివాది నామములచే పేర్కొనం బడుచున్నవారెల్ల నయ్యాది మహాదేవుని ప్రతిబింబములే. కావుననే దేవుని నామము జపించినను, ధ్యానించినను, నా మహాదేవుని నామమే యగును. అందుచే మనము శివనామము శుభప్రదము గావున దానిని గ్రహించుటలో నన్యమతద్వేషముగాని, యన్య మతావమానము గాని యెంత మాత్రము లేదు. పూర్వము శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మాధ్వస్వామి, తమ తమ యభిప్రాయముల చొప్పున, గొందఱ కొందఱను దమపక్షముల వారింగాజేసికొని వేర్వేఱు సంఘములు స్థాపించిరి, ఇందులకు వారి వారి యాత్మశక్తియే యాధారమైనది; కాని వారి మతములెల్ల మానవుని యుత్కృష్ట ధర్మమునే బోధించుచున్నవి కావున మతద్వేషము చేయరాని పని, మానవ శ్రేయోభివృద్ధికి, దోడ్పడు మతమే మతమని ఇదివఱకే మనము తెలిసికొని యుంటిమి.

కావున యాది మహాదేవుని నామముగా నంగీకరింపబడి శివశబ్దము గ్రహించి జపించి తరించండి.

ఓం నమః శివాయనమః సిద్ధం నమః

ఓం తత్సత్

ఓం నమః శివాయనమః సిద్ధం నమః



# శ్రీ శివనామ నిర్వచనములు



శ్లో॥ యశ్శివో నామరూపాభ్యాం । యాదేవీసర్వమంగళా ।
తయోస్సంస్మరణాత్పుంసాం । సర్వ త్ర జయమంగళమ్ ॥

శ్రీ శివనామములు:- 1. శివుడు. 2. మహేశ్వరుడు. 3 శర్వుడు. 4. రుద్రుడు 5 స్థాణుడు. 6. విష్ణుఘ 7. సర్వవ్యాపి. 8. సర్వగతుడు. 9 పితామహుడు. 10. సంసార వైద్యుడు 11. సర్వజ్ఞుడు. 12. దిసర్వభృత్. 13 పరమాత్ముడు. 14. పరాత్పరుడు 15. గంగాధరుడు. 16. జగద్యోని. 17. దివ్యమంగళ విగ్రహుడు. 18. పండితుడు 19. అనాదినిధనుడు. 20 శంఖుడు 21. హిరణ్య గర్భుడు. 22. వేదాంత వేద్యుడు. 23. కాలాత్ముడు. 24. పరమ శివుడు. 25. జ్యాభుజంగాధిపుడు 26. పశుపతి. 27. శ్రీ దక్షిణామూర్తి 28. ఆది గురుమూర్తి. 29. ఈశానుడు. 30 గౌరుడు. 31. అర్ధ నారీశ్వరుడు. 32. వైదికాగమ పీఠస్తుడు. 33. ఈశ్వరుడు. 34. సదాశివుడు 35. లింగము. 36. విద్యాపతి. 37 భర్గుడు. 38 గాయత్రీ మంత్ర ప్రతిపాద్యుడు 39. నాయకుడు (నేత). 40. స్వయంప్రభువు.

బ్రహ్మానంద స్వరూపుడును నిర్వికారుడును గనుక శమించి యుండువాడు శివుడు. 'శేరతే సజ్జన మనాంస్య స్మిన్నితి శివః' — ఈయనయందు సజ్జనుల మనస్సులుండును. 'శేతేసజ్జన మనస్స్వితివా — సాధువుల మనస్సులయందు శయనించి యుండువాడు గనుక శివుడు.

'సర్వత్ర పక్ష పాతిత్వాభావేన సమత్వాద్వా శివః' — ఎందును పక్షపాతము లేకుండ సమత్వమును కలిగియుండుటచే శివుడు స్వార్థక నామధేయుడు.

శివనామా కర్షన చేత సర్వ భూతములును దేవదానవులును, అమరులును శివమయులగుదురు 'శివేచ్ఛానాం సర్వార్థోపక్రమం సాధయతీతివా శివః — (అనుశాసనిక) అన్ని ప్రయోజనములను సాధించుట కుపయుక్తమైనదీ నామము.

మనుష్యులెల్లరును తమ ప్రయోజనముల పరిపూరణమునకు శివుని, ఇచ్ఛగించెదరు. ఇది నిత్యము వారు అనుసరించు విధానము. 'శివస్స్వయం ప్రకాశయతివా' — స్వయం ప్రకాశము కలవాడగుటచే ఈయన శివుడనబడుచున్నాడు.

'హింసిధాతోస్సింహ శబ్దోవశ కాంతే శివశబ్దః' — అగ్నిషోమాత్మకత యాచాభిమన్యతే పౌరాణికైః వాయుసంహితోయాం — కాంతి శివుని యధీనము అగ్నిసోముని చెందియుండుట చేతను శివుడు పరముడు. 'శంనిత్యం సుఖం, మానందమికారః పురుష స్మృతః — శం, అనగా సుఖము. పరమానందము. ఇకారము పురుషుని ఉద్దేశించినది'. 'వకార శ్శక్తి రమృతం మేల నంశివ ఉచ్యతే' (ఇత్యోచ్యతే ఋద్ధిరితి) — వకారము అమృత శక్తి కలది. గావున సుఖమును పరమానందమును అమృతత్వ శక్తిని కలిగించు పురుషుడు శివుడని అర్థము.

శివం కళ్యాణం తద్యోగాద్వా' శివము అనగా, శుభము. దానితో కూడిన వాడు 'శివ ప్రదత్వాద్వా' — శుభముల నిచ్చువాడు కావున శివుడు.

ఏవం శివశబ్దోతి మంగళ వాచకత యా శుత్యాచోచ్యతే' శివశబ్దమిట్లు మంగళమును సూచించుటకు ఉపయోగించ బడ చున్నది.

'శివాఋ తవస్సంతు. శివా వనస్పత యస్సంతు అహోరాత్రే శివేస్యాతాం' — శివునిచే ఋతువులును, పుష్పముల వలన బుట్టిన ఫలములతో గూడిన మామిడి మొదలయివి. పుష్పములు లేక ఫలములతో గూడిన పనస, మేడి, మొదలైన చెట్లు అహోరాత్రములును కాపాడబడి వర్ధిల్లుచున్నవి.

'స్వస్తిశివం కర్మాస్త్వితి' :— కర్మములు శివునిచే కాపాడబడి భద్రముగా నుండును - 'పతితశ్శ్వ పచశ్చండాలో వాయశ్శివ ఇతివాచంవదేతతే నసహభుంజీత । తేనసహసంభాషేతతేన సహసంవసతేతి । ఏవ మత్యంత శోభనత్వేన పతితపావనత్వేన నిరతిశయ సుఖప్రనేత్వేనచ ప్రసిద్దే నిత్య సుఖ వాప్తయే తస్మై శివాయనమ ఇత్యర్థః — కుక్కను వండుకొని తినువాడైనను

(శ్వపచుడు) శివనామమును నోరార వచించుటచే పతిత్వము తొలంగి విముక్తుడగును. అందుచే నత్యంత శోభనకరమగుట చేతను పతితపావన శక్తివంతమును నిరతిశయ సుఖము నొసంగునదియు అగుటచేతను ప్రసిద్ధమై నిరంతరము శుభమును కలిగించునట్టి ఆ శివునికి నమస్కరింపవలయునని అర్థము.

శివ శబ్దము కాపాడునది. అభ్యుదయార్థియైనవాడు నామ కీర్తన మాత్రము చేతనే ప్రతిఫలమును పొందగలుగును.

"సర్వప్రపంచ కృత్యనిర్వహణే ఆయమేకఏవేష్టే ఇతీశ్వరః" — శ్రీ శివునకు మహేశ్వరుడని పేరుగలదు.

సర్వ ప్రపంచ కార్యనిర్వహణదక్షుడై ప్రభుత్వము కలవాడు గనుక ఈశ్వరుడు. "మహాంశ్చాసా వీశ్వరశ్చ మహేశ్వరః" — అనగా శ్రేష్ఠుడైన ఈశ్వరుడనియు, ఐశ్వర్యయుక్తుడగు మహేశ్వరుడని అర్థము. శృతియందు "అస్యసర్వేశ్వరత్వం శృతిరిత్థం నిర్వక్తి । అధికస్మాదుచ్యతే మహేశ్వరః"— శృతియందు సర్వేశ్వరత్వము శివునికే చెందుచున్నది. అందుచే ఆయన మహేశ్వర శబ్దచిహ్నితుడు. అన్ని లోకములను లయింపజేసి సృజించును, సృజించి లయింపజేయును. అంతేకాక తానే అందు వహించును కావున ఆయనకు మహేశ్వరత్వము రూఢియైనది. "శివశ్శూలీ మహేశ్వర ఇతినిఘంటుః" — శివుడని, శూలముగలవాడని, మహేశ్వరుడని నిఘంటువు తెల్పుచున్నది. ఈ మహేశ్వర శబ్దము, జనేశ్వరుడు-లేక యోగీశ్వరుడు అనునట్లు విభక్తమైన సంపదను లేక వైభవమును సూచించునదికాదు. అమేయమును సంపూర్ణమును నైన సకలైశ్వర్యయుతమైనది. రుద్రుడు విష్ణువు బ్రహ్మలగు త్రిమూర్తుల సృష్టిత త్త్వశక్తికి జ్ఞానమిచ్చుటకు తగిన విధమును కలిగించు లక్షణము గలది మహేశ్వర శబ్దము సూచింపబడుచున్నది.

"పురుషోత్తమ స్మృతోమహేశ్వరఃత్ర్యంబక ఏవనాపరః"

శ్రీ కాళిదాస మహాకవి తన రఘువంశ మహాకావ్యములో పురుషోత్తముడైన శివునిగ పురుషోత్తమునిగ సూచించి యున్నాడు. త్ర్యంబకుడే పురుషోత్తముడు. ఇతరులు కాదు. ఇటు మునులును, శతక్రతువైన ఇంద్రుడును సమర్థించెను. ఈశ్వర శబ్దము ఐశ్వర్య యుక్తుడయిన శివునికే చెల్లును: పురుష

సూక్తములోని సర్వవ్యాప్తిత్వమును గలిగిన పురుషుడాయన ఒక్కడే. మోక్షకాములాయనను ఆరాధించి నియమిత ప్రాణులై ముక్తిని పొందెదరు. ఆయన ప్రళయమందును ఉండువాడు (స్థాణుడు) భక్తియోగమున సులభసాధ్యుడు. మరి చంద్రుని మౌళిలో ధరించి వైభవము గల ఈయనయే మహేశ్వరుడు (చంద్రలోకము). శ్రీ శివునకు శర్వుడనియు నామాంతరము కలదు. ప్రళయమందు భూతములను హింసించు వాడై కల్పితమైన ఈ జగత్తును హింసించి తన స్వరూపమాత్రంచేత నిలుచువాడు గావున శర్వుడు. శ్రీ శివునకు రుద్రుడని పేరు కలదు. సాంసారిక దుఃఖమును పోగొట్టువాడు గావున రుద్రుడు వేదాంత వాక్యములను పలికి శివజ్ఞానోపదేశము చేయు మహనీయుడు. శ్రుతుల మూలమున ధర్మాదులను బోధించునట్లు పలుకువాడు. అంత్యకాలమున దుఃఖించునట్లు చేయువాడు.

పురాణ నిర్వచనము:—"రుదుఃఖ హేతుంచ విద్రావయతినః ప్రభుః రుద్ర ఇత్యుచ్య తేతస్మాత్ శివః పరమ కారణమ్" అశుభములను నిర్మూలించి తల ఎత్తు కొనకుండ జేయువాడు. గావున శివునికి రుద్ర నామధేయము అర్థమైనది.

శివపురాణం :— దయానిధి అయ్యు అంతమున అన్నింటిని హింసించువాడు రుద్రుడు.

సంసార రోగమును శమింపజేసి సుఖములను ప్రసాదించువాడు గర్భ జన్మమును ముసలితనమును మరణమును జెంది వచ్చుచు పోవుచు శ్రమచే భిన్నులైయున్న జంత్వాదులకు విశ్రాంతికై మహాప్రళయమును తమస్సును స్వీకరించెను. క్షణమున అవిద్యామోహితులను సుచిర నిద్రను సుఖమును అనుభవించునట్లు చేయును. వైద్యునివలె శస్త్రచికిత్స చేయుపట్ల హాహా అను దుఃఖసూచక శబ్దములను కలిగించు విధానమున సంసార రోగమును హరింప జేయునపుడు ఈయన వ్యవహరించుచు జంతువులను కాపాడుచున్నాడు. అందుచే శివంకరుడైన దేవుడు రుద్రుడు.

శివునకు విష్ణువని నామాంతరము గలదు. విశ్వమంతయు వ్యాపించినవాడు గావున విష్ణువు.

"విగ్రహవ్ వ్యాప్తౌ స్వీయాభిరష్టమూర్తి భి రుద్రఃఏవ విష్ణురిత్యర్థః"—

అష్టమూర్తి స్వరూపుడైన శివుడు సర్వవ్యాపిత్వమును జెందియుండుటచే విష్ణువగును.

సహస్ర నామస్తోత్రములో 'విశ్వం, విష్ణుః, వషట్కారః' అని ఉన్నది. అట్లే అమరములో 'విష్ణుర్నారాయణః కృష్ణః' అని యున్నది. అనగా విష్ణువునకు సర్వవ్యాపకత్వము శబ్దగమ్యత్వమును అన్నింటిని చేయగల శక్తియుండుట గోచరించుచున్నది. శర్వుడు, శివుడు, స్థాణుడు మొదలగు నామములచే రుద్రుని సర్వవ్యాపిత్వము స్థిరత్వము తెలియుటచే ఆ అర్థమున ఆయనకు విష్ణువు అను శబ్దము అన్వర్థమైయున్నది.

సర్వవ్యాపియైన భగవంతుండగుటచే సర్వగతుడు శివుడు. వృక్షము వలె స్తబ్ధత్వము వహించి దివి వఱకు వ్యాపించిన పూర్ణపురుషుడు. విశ్వము నంతయు పరివేష్టించి యుండువాడు ఈశ్వరుడు అమృతుడు దిశలను భేదించు కొని అన్ని లోకములకు వ్యాపించుటచే మహాదేవుడు. దేవతలందఱియందును ప్రవేశించి యుండువాడు గావున విష్ణువు ఇట్లు పురాణములలో శివుని సర్వ వ్యాపితము ప్రకటింపబడియున్నది.

వ్యవహారములో రాజులలో విష్ణ్వంశ వ్యాపించియుండుటచే సర్వవ్యాపి ఈశ్వరుని యందదిస్ఫుటము ఆత్మయందును అణువునందును వ్యాపించి అంత రాత్మయై యుండుటచే సర్వవ్యాపిత్వముచేత విష్ణువు ఈశ్వరుడే.

రుద్రసంహితలో జెప్పిన విధముగా సర్వదేవాత్మకుడు రుద్రుడు. దేవతలందఱును శివాత్మకులే. రుద్రుని దక్షిణవైపున సూర్యుడు, బ్రహ్మ త్రేతాగ్నులును ఎడమ పార్శ్వమున ఉమాదేవియును విష్ణువును, చంద్రుడును స్థిరులై యుందురు. అందుచే గోవిందునకు నమస్కరించిన రుద్రునకు నమస్క రించినట్లే. ఉమస్వయముగా విష్ణువువలెను, విష్ణువు చంద్రునివలెను రుద్రునితో తాదాత్మ్యము చెందియుందురు

"నీ నామము లోకములో ఎక్కడ ఉండునో అక్కడే నా నామము విహరించును" అని గోవిందునకు చెప్పబడినది — అని భారతమునందు చెప్ప బడినది.

కూర్మవాసిష్ఠ పురాణములందును లింగపురాణ, ఆదిత్య పురాణము లందును శివుడు దారుకావన ప్రదేశమును ప్రవేశించినప్పటి వర్ణణలో హరిపార్వ త్యంశజుడనియు, శివుని వామాంగము శక్తి విష్ణుసోమాత్మకమని చెప్పుటచే హరి అనునది శివుని నామములలో అత్యుత్కృష్ట నామమని గ్రహింపవలెను. శక్తిస్వరూపమే విష్ణువని, విష్ణువే శక్తిస్వరూపమని యుండుటచేత, శివవామాం కమదే అగుటచేత విష్ణుశబ్దము శివునకు అన్వర్థము.

శివునకు పితామహుడని పేరు గలదు. పితలను పుట్టించిన వాడగుటచే పితామహుడు బ్రహ్మ అగును. ఆయనకు పితృత్వము వహించుటచే శివుడే పితా మహుడు (శృతి శాంతి పర్వణి। " శివోమహేశ్వరో రుద్రో విష్ణుశ్చైవ పితా మహః। సంసార వైద్య స్సర్వజ్ఞః పరమాత్మేత్యు దాహృతః। ")

(శివ పురాణగత కైలాస సంహితలో శివుని దివ్య నామాష్టకము)

1. శివుడు, 2. మహేశ్వరుడు, 3. రుద్రుడు, 4 విష్ణువు, 5. పితా మహుడు, 6. సంసార వైద్యుడు, 7. సర్వజ్ఞుడు 8. పరమాత్ముడు, అను ఈ ఎనిమిది నామములు దివ్యమైనవై శివవైభవమును చాటుచున్నవి. స్వభావతః అత్యంత పరిశుద్ధాత్మ యగుటచే శివుడని; అనంత కళ్యాణ గుణైక ఘనుడగు ఈశ్వరుడై వేదాదులచే నుతింపబడి, భావింపబడి, వేదైక వేద్యుడే వేదాంతములో ప్రతిష్ఠితుడై ప్రకృతి లీనుడై యుండుటచేతనే గాక త్రిగుణాతీతుడై మాయను వశపఱచుకొని మాయియై వెలుగువాడగుటచే మహేశ్వరుడని; సంసారిక దుఃఖ హారియై రుద్రుడని; శరీరాది సర్వఘటములందును ఎల్లెడలను వ్యాపుడగుటచే విష్ణువని; జగత్తునకు సృష్టికర్తయైన బ్రహ్మాదులకు పితృత్వము వహించుటచేత పితామహుడని; నిదానజ్ఞుడైన వైద్యుడు రోగములను పోగొట్టు విధమున సంసా రము అనెడు రోగమును పోగొట్టు వైద్యుడు గావున సంసార వైద్యుడని శివుని పిలిచెదరు. అణువు మొదలుకొని అన్నింటియందును ఉండి వాని అంతు పొంతు లను ఎఱిఁగియున్న వాడగుట చేతను, అన్నింటికి హేతుభూతుడై యత్నము లేకనే అన్నింటిని తెలిసి యుండుటచేతను సర్వజ్ఞుండని; సర్వాత్మలకును పరము డగుటచే పరమాత్ముడని ఈ నిర్వచనములను ఆయా నామములకు ఋజుపఱచు కొనవలెను.

శివుడు అష్టమూర్తి యగుటచే సర్వమును ధరించువాడు స్థితి, జీవన

శ్వాసావకాశాధికములగు ఉపకారముచేత అన్నింటికిని. ఆధారభూతు డై యుండి భరించి పుష్టికరుడగుటచే సర్వభృత్ అను నామము సార్థకమైనది.

దివ్య కైలాసవాసుడు శివుడు — దివ్యమై శివుని లాస్యవృత్తమును శిరోధార్యముగ కల్గియున్నదగుటచే పర్వతేంద్రమై భాసిల్లునది కైలాసము. ఆ కైలాసమున వసించియున్న భగవంతుడు కమనీయుడు ప్రళయకాలము నందు గూడ నశింపనిదై శివుని ఆలయమై, సంధ్యాకాల ఆనంద తాండవ ప్రదేశమై, స్ఫటికమై, మణిమయమై, ఏకాదశ సహస్రైకాదశలక్షోత్తరైకాదశ కోటి సంఖ్యాకమై విచిత్రములగు నానావిధ మణిమయ శిఖరశ్రేష్ఠమై శివానంద నిలయమగుటచే దివ్య కైలాస శిఖరేంద్రుడు అనుట సార్థక నామము.

శివుని అఖండ బిల్వచ్ఛదన ప్రియుడని అందురు. బిల్వము అనగా ధ్వంసము చేయునది. కుష్ఠాదిరోగములను పోగొట్టునది, పాపనివారకమైనది. బిల్వపూజ అఖండమైన బిల్వముచే ఆచ్ఛాదింపబడుటను వాంఛించువాడు శివుడు.

శివుడు సంసార వైద్యుడు - అనగా సంసార రోగములను నివారించు వైద్యుడు. అనగా గర్భజన్మ జరామరణ స్వర్గ నరక కాంతారమునందు పదే పదే సంచారము చేయుటయే సంసారము. ఇట్టి ఈరోగమునకు చికిత్స చేయువాడు గనుక శివుడు సంసార వైద్యుడు. అట్టి చికిత్సను తెలిసి అధిగమించిన వాడగుటచే వైద్యుడు. రుద్రములో "అధ్యవోచ దధి వక్తా ప్రథమో దైవ్యోభిషక్" అని వున్నది లోకములో శివస్థలములకు వైద్యనాథము అని ప్రతీతి కలదు. కావున శివుడు సంసార రోగములను నిర్మూలించి మనలను కాపాడు రక్షకుడు.

శివునకు సర్వజ్ఞుడని ప్రతీతి కలదు. యుగయుగాలుగా కల్పాదినుండి సర్వప్రాణులయొక్క కర్మఫలానుభవ యోగ్య శరీరాదికములను తెలిసియున్న వాడగుటచే శివుడు సర్వజ్ఞుడగును.

శివుడు పరమాత్ముడు. పరాత్పరుడు సర్వ శరీరములందును ఆత్మ రూపమై ఎల్లప్పుడు సమన్వయింపబడుటచే పరమాత్ముడు శివుడు. 'నన్ను సర్వ క్షేత్రములందును క్షేత్రజ్ఞునిగా తెలియుము' అని భగవానుని వాక్యము. సర్వాంతరతముడయి యుండు అంతరాత్మ యగుటచే పరమాత్మ శబ్దము సార్థకమయినది. ఇంద్రియములను మనస్సును బుద్ధిని హిరణ్య గర్భాఖ్య తత్వమును

మించి ఉత్తరోత్తరమయిన పరమునకు కూడ పరమై శ్రేష్ఠమయి అవ్యక్తమయిన సూక్ష్మరూపి యగుటచే పరాత్పరుడు శివుడు.

శివుడు గంగాధరుడు:- శివుడు గంగను భగీరథ యత్నమున ధరించుటచే గంగాధరుడనియు సూర్యాదులు మొదలుకొని అందఱి దేజములను తనయందిము డ్చుకొన్న నిధి యగుటచే పరమేశ్వరుడు "తేజోనిధి"యనియు. జగత్తు షడ్భావ వికారములకు లోనై వెళ్ళునది గావున దానిని కల్గించు కర్త శివుడు సనాతను డయిన భూతపతి ఈశ్వరుడే ఈ జగత్తునకు కారణభూతుడు. నిఖిలములకు కారణుడు కావున జగద్యోని అని అందురు.

శివుడు దివ్య మంగళ విగ్రహుడు:- ఆరాధనచే శ్రేష్ఠమయిన కళత్ర పుత్ర మిత్ర స్వరాది మంగళములు లభించును. అట్టి ఆకారము కలవాడు పరమేశ్వరుడు. దివ్య సుఖమును పొందింపజేయు వాడు గావున దివ్య మంగళ విగ్రహుడు మరియు పండితుడు బ్రహ్మచే సృష్టింపబడిన బ్రహ్మాండముల నన్నింటిని కుమ్మరివలె ఏకత్వము చేసి కలిపి వేయగల విద్యను ఎఱింగినట్టి బుద్ధిగల సమర్థుడయిన పండితుడు ఈ అనేక కోటి బ్రహ్మాండములను భోగార్థము పరమేశ్వరుడు సృష్టించి తన బుద్ధి సంపత్తిని ప్రదర్శించి, ఆత్మైకతా బోధనకై ఈ వివిధ తత్త్వమును నిర్మూలించి, జగద్భ్రాంతిని పోగొట్టుచున్నాడు. అందఱికిని ఐహికాముష్మిక సుఖములను ఇచ్చునది సర్వమంగళా దేవి. సర్వ మంగళయైన పార్వతీ దేవి భోగమును, మోక్షమును సుఖమును దయచేయును. అట్టి శివశక్తిచే అలంకరింపబడి శోభిల్లుచున్న పరమశివుని, మూర్తి సర్వ మంగళాలంకృతాకృతి. అట్టి శివుని మన హృదయములో ప్రకాశింపజేసి సర్వమంగళములను పొందగలము.

జనన మరణ రహితుడయిన శివునకు ఆది లేదు అంతము లేదు గనుక ఈశ్వరునకు అనాదినిధనుడను నామము కల్గినది. జనన మరణాదుల నుండి రక్షింపగల శక్తిమంతుడు కావున అనాదినిధనత్వము సిద్ధము. శివుడు సుఖమును పరమానందమును మోక్షమును ఇచ్చునట్టి వాడు గనుక శంభుడందురు. ఆదిగురు వయిన శంభువు మోక్షదాయకుడు. సత్యము, జ్ఞానము, ఆనందము — ఇవి శివ దేవుని లక్షణములు. ఈయనకు హిరణ్య గర్భుడని నామాంతరము గలదు. హిరణ్మయమయిన రుద్ర వీర్య పరిణామ రూపమే రుద్రుని గర్భము నుండి

బ్రహ్మగా వెలువడినది. రుద్ర వీర్యము హిరణ్మయమైనది. విష్ణుక్షేత్రమున పడి నది గౌర్యంశ సంభూతుడైన హరినాభి నుండి తత్తేజము బ్రహ్మగా వెలువడినది. ప్రళయ కాలము శివుడే బ్రహ్మ, విష్ణులనులయింప జేయును. ప్రళయావసానమున రుద్ర విష్ణు బ్రహ్మలను శివుడే సృజింపజేయును. ఇది వేదాంతము. అందుచే శివునకు హిరణ్మయ గర్భ జనకత్వము సార్థకమయినది. రుద్రతేజము విష్ణు క్షేత్ర ప్రయుక్తమై విధి రూపమున వెలువడును 'శివాయ విష్ణు రూపాయ శివ రూపాయ విష్ణవే' అనుటచే హరిహర భేదముచే శివునకు హిరణ్య గర్భ జన కత్వము రూఢి యగుచున్నది.

శివుడు వేదాంతవేద్యుడు :- వేదాంతసాధనచే ఎఱుగబడువాడు అనగా వేదాంత మహావాక్య విచారముచేత పొందతగి తెలియదగిన మహనీయుడు గావున వేదాంతవేద్యుడు.

శివుడు కాలాత్ముడు :- కాలమును ఆత్మగా గల్గిన వాడగుటచే కాలాత్ముడు. అనగా జీవరాశ్యాదుల ఆయువులను లెక్కించువాడై కాలుడై మనస్సును ప్రేరేపించువాడై మహేశ్వరుడు కాలాత్ముడగుచున్నాడు. మరియు చేతనాచేతనములను జగత్తుచేరుట విచ్ఛిన్నమగుటయును వీనినన్నింటిని ప్రేరేపించువాడగుటచే కాలాత్ముడు అయినాడు.

పరమశివుడు విచిత్రమైన బహువిధ శక్తులచే శోభిల్లును. పరమేశ్వరుని శక్తి విచిత్రమును బహుళమును గలిగియున్నది. ఈ శక్తిచేతనే సర్వజగ త్తంత్రమును స్వామి ప్రారంభిచుచున్నాడు. నిశ్చలమైనది శాశ్వతమైనది అకృతమైనది అగునట్టి ధనువును గలవాడు పేరులో స్థిరత్వముగల ఈశ్వరుని హస్తాబ్జములో మహామేరుధనువున్నది. జ్యాభుజంగాధిపుడని మనకు లింగ పురాణము చెప్పుచున్నది.

పాశత్రయబద్ధులైన ద్విపాదులు, చతుష్పాదులు అయిన సర్వ జంతువు లకును పతియైన స్వామి పశుపతి. జీవులందఱు పశువులు సర్వజ్ఞుడయిన ఈశ్వరుడు జీవులను అజ్ఞాన పాశము నుండి విడిపించువాడు మన పశుపతి.

అన్ని తత్త్వములకును పారమార్థికమైన రూపము ఆత్మతత్త్వ శ్రీ గురు మూర్తి రూపముచే బోధించుటచే పరమేశ్వరుడు సర్వతత్త్వ ప్రబోధకుడయి నాడు. శ్రీ దక్షిణామూర్తి స్వరూపుడయిన శివుడే "ఆదిగురుమూర్తి" ఈశా నుడు సర్వవిద్యాగురువు.

కీర్తన చేయబడువాడును మనస్సు అతని యందు ఉద్యమించుట చేతను శివుడు గౌరుడు అనగా పసుపువన్నె కాంతిగలవాడని అర్థమున్నది. శివునకు స్వతః ఏ వర్ణమును సంక్రమించి యుండలేదు. హిమశిలాఖండ మహాకాశము వలె నిర్మలమయినది. కాని గౌరీదేవిని వామ భాగమున ఉంచుకొని అర్థ నారీశ్వరుడగుటచే గౌరవర్ణము కలవాడయ్యెను. "బాలార్కాగ్ని తటిత్ప్రతప్త కనకప్రస్పర్థి తేజోమయం గంభీరధ్వని సామవేద జనకంతామ్రాధరం సుందరం" పంచముఖస్తవములో బోధాయనుడు శివవామభాగమును ప్రస్తుతించెను దీని భావము మేరు సమీపమునందున్న నేరేడు పండ్లరసముచే పాఱిన నదియందు తడిసిన గౌరీదేవి కలయికచే పసిమివర్ణమును శివుడు పొంది యున్నాడు.

శివుడు వైదికాగమపీఠస్థుడు — ఎట్లన వేదాగమాదులందు ప్రతిపాద్య ప్రతిపాదన సంబంధము చేత వానిని పీఠము గలవాడు ఈశ్వరుడు. నాల్గు వేదములును సదాశివుని అమేయవిభవమును ప్రతిపాదించుచున్నవి. వేదాంతములు పరమశివుని పరమార్థతత్త్వమును బోధించుచున్నవి. దక్షిణ పశ్చిమ సన్నిధులందు విద్యమాన బలిపీఠములందు సర్వభూత గణాది రూపములచే కూర్చుండి బలి ఉపహారములను స్వీకరించి అనుగ్రహించుటచే వైదికాగమ పీఠస్థుడు అని శివుని భావింపగలము.

శివస్థలవాసియైన పరమపాపికైనను పరమ పంచాక్షరీ శ్రీరుద్ర, జప లింగారాధనాది మహా పుణ్యవంతులకును అవసానమున తారకము నుపదేశించుట శివుదేవునిలీల ప్రాణుల కర్ణములందు జ్ఞానమణియగు తారకమంత్రోపదేశమును స్వయముగా శ్రీ పరమేశ్వరుడు చేయుచున్నాడు. ఇట్టి బోధను చెందుటచే ముక్తి సౌలభ్యము గల్గుట శ్రీ వారణాసి, శ్రీ కాళహస్తి, శ్రీశైలము మొదలగు క్షేత్రముల మహిమయైయున్నది.

శ్రీహరి బ్రహ్మలు కల్పాదిలో పరమేశ్వరుని మాయామోహితులై తమ తమ సామర్థ్యములను గొప్పగా చెప్పుకొను సమయమున అత్యద్భుతమయిన మహాలింగమొకటి ఐశ్వర్యప్రభాసమన్వితమయి వారియందు వెలసెను. జ్వాల మాలావృతమయి అప్రమేయమయి దివ్యమయిన ఆ లింగము యొక్క ప్రాద

మెక్కడున్నదో కనిపెట్టుటకు విష్ణువు వరాహరూపియై బయలుదేరెను. బ్రహ్మ తన వాహనమయిన హంసనధిష్టించి లింగము శిరస్సెక్కడనున్నదో కనుగొనుటకు వెడలెను. కాని లింగము ఆది అంతములను వారు తెలియలేకపోయిరి. బ్రహ్మమార్గమున మొగలిపువ్వు దళము సహాయమును గైకొని తాను లింగపు శిరమును గాంచినట్లు అబద్ధము చెప్పెననియు అందుచే అటు మొగలిపువ్వునకు పూజార్హత లేకుండపోయెననియు, బ్రహ్మ శాపగతుడయ్యెననియు, శ్రీ విష్ణువు శ్రీ శివుని ప్రార్థనచేసి ప్రత్యక్షము జేసికొనెను. కావున హరిబ్రహ్మలు పాదమును శిరస్సును చూడలేకపోయిరి.

శివుడు లింగాకారమున నుండును — లింగము చేతనా చేతన రూపమైన సర్వ పదార్థములను వలయితము చేసి సర్వాధారమై వరలునది. సర్వకారణమయినది.

ఆకాశము లింగమని, భూమి తత్పీఠికయని ఆలయము సర్వభూతములని, అయించుటచే లింగమని అందురు. లింగము నుండి అన్ని భూతములు ఉద్భవించినవి. శాంభమయిన తేజమే లింగము.

శివుడు సర్వవిద్యా నిలయుడు. వేదాదికములను సృజించిన మహనీయుడు. సర్వ విద్యాధిపతి. పరవిద్యచే తత్వోపదేశముచే జన్మించిన శివజ్ఞానమున ముముక్షువులను కాపాడును. శివస్థానమున చనిపోయిన మూర్ఖులైనను తత్త్వజ్ఞానోపదేశమున విద్యాసింధువులై తరించునట్లు జేయును గనుక విద్యాపతి.

శివుడు భర్గుడు :- కామకాలాదులను కాలపాకము నొందించినవాడు గనుక భర్గుడు లేక పాపాదులను మాడ్చివేయువాడు. కావున భర్గుడు. ఆయనయే గాయత్రీ మంత్రప్రతిపాద్యుడయిన దేవుడు.

శివుడు నాయకుడు (నేత) వాయుసూర్యాది దైవత కులమును తమ తమ కార్యములందు ప్రవిష్టులగునట్లు శాసించునట్టియు ప్రేరేపించునట్టివాడు కావుననే నాయకుడయినాడు. ఈశ్వరుని కఠిన శాసనము చేతనే సర్వ చరాచర జగత్తు అంతయును నియమము తప్పక వర్తించుచున్నది. కావున సన్మార్గమున మనలను

నడుపు నాయకుడు శ్రీ భ్రమరాంబా సమేత మల్లికార్జునుడు. స్వయం జ్యోతియై దిక్కులకు వెలుగు కలిగించు స్వయంప్రభువు. స్వప్రభచే వెలుగును కావున స్వయంప్రభువు.

సూచన:- భగవంతుని పూజ చేయునప్పుడు ఉపయుక్తమగుచున్న దివ్య నామములను అర్థములతో గ్రహించి అర్పించిన విశేష ఫలము కల్గును.

ఓమ్ తత్సత్





# శ్రీ శివలీలా మహిమ

## ( భారతము - అనుశాసనిక పర్వము )

"శుభకరుడగు శంకరునకు 1) మహేశ్వరుడనియు 2) శివుడనియు 3) శంకరుడనియు 4) రుద్రుడనియు 5) మహాదేవుడనియు 6) స్థిరుడనియు 7) విశ్వరూపుడనియు 8) సర్వతశ్చక్షుడనియు 9) పశుపతియనియు 10) వృషభవాహనుడనియు 11) మృడుడనియు - ముఖ్యమైన యీ యేకాదశ నామములు పరమేశ్వరునకు కెటులకలిగెనో తెలిసికొనియవ్వాని కథలు వినిన శివభక్తి పరాయణులకు భోగమును మోక్షమును గరతలామలకములగునని వినియున్నాము నాయందు దయయుంచి. యాపేర్ల యర్థము వివరింపుమని ధర్మరాజు శ్రీకృష్ణుని కోరగా నా మహదేవుని మహైశ్వర్యముల గుఱించియు నీతని గుణవిశేషములంగూర్చియు, నతని నామముల గూర్చియు వివరించెదను. సావధానుడవై వినుమని శ్రీకృష్ణుడు ధర్మరాజుతో నిట్లుజెప్పెను.

మానవ జన్మమెత్తినందులకేకథలు విని ధర్మసంగ్రహణ మొనరింప వలయునో యీ విషయమును బ్రశ్నించితివి గాన సంతసించితినని ఈశ్వరుని దలంచి నమస్కరించి యా శివుని దివ్యమహిమను శ్రీకృష్ణుడు నిట్లు జెప్ప దొడంగెను.

'ఏ మహాత్ముని చరితములు వినుటచే మానవులకు సకల క్రతువు లాచరించిన పుణ్యము గలిగి భోగభాగ్యములు గలుగునో ఆ మహాదేవుడు సర్వాంతర్యామియయ్యునగోచరుడు'' అట్టి పరమేశ్వరుని దెలిసికొన యాతని మహిమలు వివరించుట అనన్యము. అప్రమేయుడయి, అనౌపమ్యుడయి, అవ్య యుడయి, ఆద్యంతరహితుడయి, అవాఙ్మానసగోచరుడయి, స్త్రీపురుషాది భేద రహితుడయి, సనాతనుడయి సర్వభూతాంతర్యామియై, సన్మార్గుడయి యుండెడి శివుడిట్టివాడని తెలిసికొనుటకును, అతని చరితములిట్టివని వచించుటకును నేను శక్తుడను గాను నేననననేల బ్రహ్మాదిదేవతలును, మహాఋషులును, సూక్ష్మ

రూపములనైన జూడగల సూర్యుండును సైతము సమర్థులు గారు. కేవల నర మాత్రుడనేననెంత, అయినను నీవు నన్ను ప్రశ్నించితివి. కాన నాకు దెలిసినంత వఱకు - నేను పుత్రార్థినై యోగసమాధియందున్నప్పుడు కాంచిన తెఱంగున నా మహాదేవుని మహైశ్వర్యములం గుఱించియు, నతని గుణవిశేషములం గూర్చియు. నతని నామముల గూర్చియు వివరించెదను.

వాయువు, అగ్ని, ఇంద్రుడు సూర్యుడు వసువులు మొదలగు దేవత లెల్ల శివునియందు నంతర్గతులైయున్నారు. అట్టి శివుని గొప్పతనము నాసక్తితో వినినను. జెప్పినను సమస్తములగు కోరికలును నెరవేరును.

అణిమాదష్టైశ్వర్యములును గలవాడయి భక్తులకు నైశ్వర్యములొసగు గావున మహేశ్వరుడనియు, తన్నారాధించువారలకు శుభములొసగు గావున శివుడనియు, సుఖము కలిగించు గావున శంకరుడనియు, పాపాత్ములను ఘోర రుద్రరూపము దాల్చి శిక్షించుగావున రుద్రుడనియు, దేవతలందఱిలో గొప్ప దగు శక్తిగలవాడగుటచే మహాదేవుడనియు, మహా ప్రళయమునందైన నాశనము లేనివాడగుటచే స్థిరుడనియు, చరా చరాత్మకమగు ప్రపంచమే రూపముగా గలుగుటచే విశ్వరూపుడనియు, జగతులన్నియు వీక్షించుచుండువాడగుటచే సర్వతశ్చక్షుడనియు, నరమృగసురాసురాది జీవులకెల్ల బతి యగుటచే బశుపతి యనియు, ధర్మదేవత కలిపురుషునిచే హింసింపబడి తన్ను శరణు చొచ్చి నపుడు దానిని వృషభముగాఁజేసి యధిరోహించుటచే వృషవాహనుడనియు ప్రాణ సమానములగు వరములను భక్తుల కొసంగుటచే మృడుడనియు, నీశ్వరునకు నామములు గలిగె; ఇంకను వేదసమ్మతములగు నామములనంతములు గలవు.

ఈ నామములను సన్మార్గులు నిరంతరము స్మరించుచు, నితరులకుపదే శించుచు ప్రచురించుచు నిహసౌఖ్యములననుభవించి శాశ్వత పదవి గాంచెదరు.

ఓం తత్సత్





# శ్రీ శివలింగావిర్భావము

## లింగ లీలలు - లింగము - లింగార్చన మహిమలు - లింగాష్టకం

పూర్వము ప్రపంచ లయసమయమున చరాచర వస్తుజాలమంతయు లయమొందెను. సర్వము నిబిడితమోమయమయ్యెను. కాని యందు సద్వస్తు నొకటిని నిండియుండెను. అది నిర్గుణము నిరుపాధికము. ఆత్మ కారణము. కొంతకాలమునకు ఆ బ్రహ్మపదార్థము ఒకమూర్తి కల్పనము జేసికొనెను. అతడే పరమేశ్వరుడు. అతడు తన మూర్తినుండి యొకశక్తి తనువును సృష్టించెను. అదియే ప్రకృతిమాయ శివయనబడును. అప్పుడా పరమశివుడు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములనెడు పంచముఖములు కలవాడయ్యెను. ఫాలచంద్రుడు దశబాహువులతో నొప్పెను. త్రిశూలము ధరించెను.

అంతనా శివాశివులు అవిముక్త సక్రాంశియోగ తపంబుల విహరింప సాగిరి. వారు విశ్రాంతి నొందగోరి సంకల్పింపగ, నొక పుత్రుడు జనించెను. అతడే విష్ణువు అతడు చతుర్భుజుడు పీతాంబరధరుడు శంఖ చక్ర గదాబ్జధారి. అతడు పరమశివునాజ్ఞచే దపమొనరించెను. తన తనువునుండి వెడలిన జలధారలందాతడు పవ్వళించి, బహుయుగములు నిద్రించెను. అందుచే నారాయణుడనబడెను.

విష్ణుదేవుని నాభినుండి యొక పద్మము బయలువెడలెను. అందుండి యొక పురుషుడు జనించెను. అతడే బ్రహ్మదేవుడు అతడు పరమ శివుని యాజ్ఞచే తపమొనరించెను.



# శ్రీ శివలింగావిర్భావము



## లింగ లీలలు - లింగము - లింగార్చన మహిమలు - లింగాష్టకం

పూర్వము ప్రపంచ లయసమయమున చరాచర వస్తుజాలమంతయు లయమొందెను. సర్వము నిబిడితమోమయమయ్యెను. కాని యందు సద్వస్తు నొకటిని నిండియుండెను. అది నిర్గుణము నిరుపాధికము. ఆత్మ కారణము. కొంతకాలమునకు ఆ బ్రహ్మపదార్థము ఒకమూర్తి కల్పనము జేసికొనెను. అతడే పరమేశ్వరుడు. అతడు తన మూర్తినుండి యొకశక్తి తనువును సృష్టించెను. అదియే ప్రకృతిమాయ శివయనబడును. అప్పుడా పరమశివుడు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములనెడు పంచముఖములు కలవాడయ్యెను. ఫాలచంద్రుడు దశబాహువులతో నొప్పెను. త్రిశూలము ధరించెను.

అంతనా శివాశివులు అవిముక్త సక్రాశియోగ తపంబుల విహరింపసాగిరి. వారు విశ్రాంతి నొందగోరి సంకల్పింపగ, నొక పుత్రుడు జనించెను. అతడే విష్ణువు అతడు చతుర్భుజుడు పీతాంబరధరుడు శంఖ చక్ర గదాబ్జధారి. అతడు పరమశివునాజ్ఞచే దపమొనరించెను. తన తనువునుండి వెడలిన జలధారలందాతడు పవ్వళించి, బహుయుగములు నిద్రించెను. అందుచే నారాయణుడనబడెను.

విష్ణుదేవుని నాభినుండి యొక పద్మము బయలువెడలెను. అందుండి యొక పురుషుడు జనించెను. అతడే బ్రహ్మదేవుడు అతడు పరమ శివుని యాజ్ఞచే తపమొనరించెను.

మును, అతి తేజవంతమును సిద్ధానందమును, దృఢమును అగు పరమాత్మ గోచరించెను. హరిబ్రహ్మలు భయముగదుర, నద్దానిని కాంచుచుండిరి. కొంత సేపటికి ఆది మహాదేవుడని విష్ణువు గుర్తించెను.

ఆ శబ్దము (ఓమ్ — అ + ఉ + మ వంటిది) నందు బీజమును, యోనిని, బీజిని గననగును. అకారము బీజము, అది బ్రహ్మ; ఉకారము యోని, అది విష్ణువు; మకారము బీజి అది రుద్రుడు; త్రిమూర్తులీక్రమమున సమస్త సృష్టియు నొప్పునట్లును, అజ్ఞానమునూ అనుగ్రహము జరుపుచు భాసిల్లు చుందురు. ఈ ముగ్గురిపై ప్రధాన పురుషేశ్వరుడు ప్రణవనాదాత్మకమై యొప్పును. అతడే ఆత్మబీజ. బీజియోనులుగ విభజించి, వెలయించె అట్టి మహేశ్వరుడే ఈ లింగము.

ఆ మహాలింగమున బీజమైన అకారము ఉకారాత్మమైన యోని యందు జేర్చబడి కాంచనాండమై, చాలాకాలము నీరమునందే యుండెను. వేయి సంవత్సరముల అనంతరము విశ్వకర్త పరమేశ్వరుడు దానిని నీటినుండి తీసి, పైపొరను పగులగొట్టి రెండు చక్కలుచేయగ, నొకటి ప్రపంపపైభాగము(కపాలము)ను, రెండవది ప్రపంచమును, అయ్యెను. ఆ యండము నుండి బ్రహ్మ పుట్టి, సృష్టికర్తయై సృష్టి చేయును "ఓమ్" నాదార్థమిట్లెఱుగదగు. అని యజుర్వేదము, ఋగ్వేదము, సామవేదము ఒకదానినొకటి బలపరచుచూ చెప్పుచున్నవి." అని హరిబ్రహ్మ లెఱిగి మహాదేవుని ధ్యానించిరి.

అంత పరమాత్ముడు అక్షరాత్మక రూపము నొంది, నవ్వుచు వారి యెదుట గోచరించెను అకారాది (హక్ష) కారాంతమగు నేబది వర్ణంబులాదివ్య మూర్తికి సర్వావయవములై యొప్పుచుండె

అంత వారిరువురు మహేశునిపైన గాంచగ, మృత్యుంజయ మంత్రమును, శివ పంచాక్షర మంత్రమును. దక్షిణామూర్తి మంత్రంబును, వారిద్దఱామంత్రములను జపింపగ, నంత ఈశానుండును వేదస్వరూపుండును, పురుషుండును, పురాతనుండును. అఘోర హృదయుండును, సుందరుండును, లలిత సాదుండును. విశ్వతోక్షికరుండును, వరదుండునీశ్వరుండగు మహాదేవుంగాంచిరి. బహు విధముల స్తుతించిరి.

మును, అతి తేజవంతమును సిద్ధానందమును, దృఢమును అగు పరమాత్మ గోచరించెను. హరిబ్రహ్మలు భయముగదుర, నద్దానిని కాంచుచుండిరి. కొంత సేపటికి ఆది మహాదేవుడని విష్ణువు గుర్తించెను.

ఆ శబ్దము (ఓమ్ — అ + ఉ + మ వంటిది) నందు బీజమును, యోనిని, బీజిని గననగును. అకారము బీజము, అది బ్రహ్మ; ఉకారము యోని, అది విష్ణువు; మకారము బీజి అది రుద్రుడు; త్రిమూర్తులీక్రమమున సమస్త సృష్టియు నొప్పునట్లును, అజ్ఞానమునూ అనుగ్రహము జరుపుచు భాసిల్లు చుందురు. ఈ ముప్వురిపై ప్రధాన పురుషేశ్వరుడు ప్రణవనాదాత్మకమై యొప్పును. అతడే ఆత్మబీజ. బీజియోనులుగ విభజించి, వెలయించె అట్టి మహేశ్వరుడే ఈ లింగము.

ఆ మహాలింగమున బీజమైన అకారము ఉకారాత్మమైన యోని యందు జేర్చబడి కాంచనాండమై, చాలాకాలము నీరమునందే యుండెను. వేయి సంవత్సరముల అనంతరము విశ్వకర్త పరమేశ్వరుడు దానిని నీటినుండి తీసి, పైపొరను పగులగొట్టి రెండు చక్కలుచేయగ, నొకటి ప్రపంపపైభాగము(కపాలము)ను, రెండవది ప్రపంచమును, అయ్యెను. ఆ యండము నుండి బ్రహ్మ పుట్టి, సృష్టికర్తయై సృష్టి చేయును "ఓమ్" నాదార్థమిట్లెఱుగదగు. అని యజుర్వేదము, ఋగ్వేదము, సామవేదము ఒకదానినొకటి బలపరచుచూ చెప్పుచున్నవి." అని హరిబ్రహ్మ లెఱిగి మహాదేవుని ధ్యానించిరి.

అంత పరమాత్ముడు అక్షరాత్మక రూపము నొంది, నవ్వుచు వారి యెదుట గోచరించెను అకారాది (హక్ష) కారాంతమగు నేబది వర్ణంబులాదివ్య మూర్తికి సర్వావయవములై యొప్పుచుండె

అంత వారిరువురు మహేశునిపైన గాంచగ, మృత్యుంజయ మంత్రమును, శివ పంచాక్షర మంత్రమును, దక్షిణామూర్తి మంత్రంబును, వారిద్దఱామంత్రములను జపింపగ, నంత ఈశానుండును వేదస్వరూపుండును, పురుషుండును, పురాతనుండును, అఘోర హృదయుండును, సుందరుండును, లలిత సాదుండును, విశ్వతోక్షికరుండును, వరదుండునీశ్వరుండగు మహాదేవుంగాంచిరి. బహు విధముల స్తుతించిరి.

సువర్ణ మొక్కటియేయైనను దానితో వివిధములగు భూషణములు సిద్ధమై, శోభిల్లుచుండునట్లును, మన్ను ఒక్కటేయయ్యు కుండ, బాన, మూకుడు మొదలగు రూపములొంది తనరునట్లు, మహాప్రకాశమగు నా తేజము మూడు రూపులై లోకవ్యవహారమున ప్రసిద్ధమగును. భిన్నరూపములుగ నజ్ఞులకు దోచునేకాని పదార్థ మొకటియేయని జ్ఞాను లెఱుంగుదురు. "పద్మజా! నేను నీ ఫాలంబున నుద్భవింతును నాకు రుద్రుడని నామమిడుము. ఆ పేరుతో భద్రాత్మకుడనై యొప్పుదును నా యీ చిద్రూపము (జ్ఞానస్వరూపము) నకును ఆలసద్రూపము (ప్రకాశమాన రూపము) నకును నెట్టిభేదము నుండదు. మీ రిరువురు నా మహాతేజమేయైనను, మీరు మాయకు వశులైయుందురు. కాని రుద్రుడు నా పూర్ణావతారమగుటచే నాతడు స్వతంత్రుడై మాయను తన వశమున నుంచుకొనును. కావున నాకును రుద్రునకును (శివునకు) భేదము కల్పింపకుడు. శుభములు గాంచుడు. నేనే యా శివుడు. ఆ శివుడే నేను. అగ్ని జలము బొందినను, తాకనీయదు అట్లే నేనును, (శివునిగ) గుణముల నొందినను, నాకు బంధము కలుగదు. విధాతా! నీవు రజోగుణంబున లోకములను సృజింపుము. నాదు శక్తి నీకు సరస్వతి (భారతి) యనుపేర సతియై నిన్ను సదా సేవించును. హరీ! నీవు సత్వగుణాశ్రయుడవై లోకములను పాలింపుము. నా శక్తి (శ్రీ) లక్ష్మీరూపమున నీకు భార్యయై నిన్ను సదా కొల్చును. ఇక రుద్రుడు తామస గుణమునొంది సర్వలోకములను సంహారమొనర్చును. నా శక్తి కాళి యనుపేర నాతనికి భార్యయై యొప్పును.

హరి బ్రహ్మలారా! నేను సర్వవిధముల మీకు సహాయము చేయుచుందును. మీరు నిరంతరము నన్ను సేవించుచు శుభము లందుడు. కమలాక్షా! నీకును నాకును నెప్పుడు నెట్టి భేదభావము గల్గదు. నేను నీవే నేను రుద్రుడనై జగములందు నీవేయమ్ముగానిపింతును. బ్రహ్మకు మించిన దివిజశత్రువులను నీవు వివిధావతారములెత్తి, వధించుచు జగములేలుచుండుము. నీ శక్తికి మించిన రాక్షస వరులను నేనే సంహరింతును. నీకు సంకటములు గల్గినపుడు నన్ను దలంచుచో, నేను రుద్రుడనై వచ్చి కాపాడెదను.

హరీ! నీకును నాకును భేదము లేకున్నను నెవరైన నజ్ఞాన వశంబున భేదభావమొందినచో, నాతడు నరకము నొందును. నన్ను బూజించి నిన్ను

సువర్ణ మొక్కటియేయైనను దానితో వివిధములగు భూషణములు సిద్ధమై, శోభిల్లుచుండునట్లును, మన్ను ఒక్కటేయయ్యు కుండ, బాన, మూకుడు మొదలగు రూపములొంది తనరునట్లు, మహాప్రకాశమగు నా తేజము మూడు రూపులై లోకవ్యవహారమున ప్రసిద్ధమగును. భిన్నరూపములుగ నజ్ఞులకు దోచునేకాని పదార్థ మొకటియేయని జ్ఞాను లెఱుంగుదురు. "పద్మజా! నేను నీ ఫాలంబున నుద్భవింతును నాకు రుద్రుడని నామమిడుము. ఆ పేరుతో భద్రాత్మకుడనై యొప్పుదును నా యీ చిద్రూపము (జ్ఞానస్వరూపము) నకును ఆలసద్రూపము (ప్రకాశమాన రూపము) నకును నెట్టిభేదము నుండదు. మీ రిరువురు నా మహాతేజమేయైనను, మీరు మాయకు వశులైయుందురు. కాని రుద్రుడు నా పూర్ణావతారమగుటచే నాతడు స్వతంత్రుడై మాయను తన వశమున నుంచుకొనును. కావున నాకును రుద్రునకును (శివునకు) భేదము కల్పింపకుడు. శుభములు గాంచుడు. నేనే యా శివుడు. ఆ శివుడే నేను. అగ్ని జలము బొందినను, తాకనీయదు అట్లే నేనును, (శివునిగ) గుణముల నొందినను, నాకు బంధము కలుగదు. విధాతా! నీవు రజోగుణంబున లోకములను సృజింపుము. నాదు శక్తి నీకు సరస్వతి (భారతి) యనుపేర సతియై నిన్ను సదా సేవించును. హరీ! నీవు సత్వగుణాశ్రయుడవై లోకములను పాలింపుము. నా శక్తి (శ్రీ) లక్ష్మీరూపమున నీకు భార్యయై నిన్ను సదా కొల్చును. ఇక రుద్రుడు తామస గుణమునొంది సర్వలోకములను సంహార మొనర్చును. నా శక్తి కాళి యనుపేర నాతనికి భార్యయై యొప్పును.

హరి బ్రహ్మలారా! నేను సర్వవిధముల మీకు సహాయము చేయుచుందును. మీరు నిరంతరము నన్ను సేవించుచు శుభము లందుడు. కమలాక్షా! నీకును నాకును నెప్పుడు నెట్టి భేదభావము గల్గదు. నేను నీవే నేను రుద్రుడనై జగములందు నీవేయనుగానిపింతును. బ్రహ్మకు మించిన దివిజశత్రువులను నీవు వివిధావతారములెత్తి, వధించుచు, జగములేలుచుండుము. నీ శక్తికి మించిన రాక్షస వరులను నేనే సంహరింతును. నీకు సంకటములు గల్గినపుడు నన్ను దలంచుచో, నేను రుద్రుడనై వచ్చి కాపాడెదను.

హరీ! నీకును నాకును భేదము లేకున్నను నెవరైన నజ్ఞాన వశంబున భేదభావమొందినచో, నాతడు నరకము నొందును. నన్ను బూజించి నిన్ను

రమునేనొల్లను. నీవే నాదురక్షకుడ''వనెను. ఇంకొకతె "నిన్నాసించి వచ్చితి" ననెను. వేఱొకతె "నీవే నా ప్రాణంబులు. నినువీడజాలను నేను." "ఆపన్నురాలినేలిన బుణ్య''మనెను నింకొకయువతి. "నీవు సర్వజ్ఞుడవుకదా! నా తాపము తెలిసికొనలేవా''యని వేఱొకనాతి పలికె ఇంకొకనాతి, "నను వీడిపోయినచో ప్రాణములు వీడుదు"ననెను నెఱజాణలు కొందరాతనిని బెక్కు విధముల భ్రమింపజేసిరి పెక్కుమంది యువతులు బిడ్డపాపల నింటవిడిచివేసి, వచ్చి యా కపటభిక్షుని చుట్టుముాగిరి.

అంతమంది యన్నివిధముల కామసుఖాపేక్షలై పలువిధముల తొందర పెట్టుచున్నను, నా భిక్షుకుడు కొంచమును వికారము నొందక, "పడతులార! మీ మగలుండగ మీ రిట్లన్యపురుషుని గూడ గోరదగునా? మహాపాపము గదా!'' యని వారికి హితము చెప్పెను. కాని కామపీడితులగు వారు "దోషమైనను మేము నిను గూడ గోరుదుము" అని తెంపున బల్కిరి. అంత నా మాయాభిక్షుకుడు వారి ప్రయత్నమును మాన్పలేక యా స్త్రీల సర్వేంద్రియాత్మలకు దన తలపుననే మహానందము చేకూర్చెను. అంత వారు బ్రహ్మానందమొంది యా శివునకు బెక్కు సపర్యలొనర్చుచుండిరి. తన్మహాసేవా నిమగ్నులై యా మునిభామలు మహానంద పారవశ్యులై ప్రపంచంబును మఱచియుండిరి.

అట్టి సమయంబున వనంబునకేగిన యా పడుతుల పతులగు మునీంద్రులు శిష్య పుత్రసమేతులై మఱలివచ్చిరి. ఆ భిక్షుకుని గూడిన తమ ధర్మపత్నుల శీలభంగము గాంచిరి ఆశ్చర్యపడిరి. మతిభ్రష్టులైరి. తల వంచుకొనిరి. చివరకు మహాక్రోధావేశులై 'ఓయీ! నీవెవడవు? క్రొవ్వి మా యాశ్రమంబు జేరి, మా వనితల నీవిధమున వశీభూతలజేసికొని, వారిశీలము జెరచితివి. నిన్నీ వనమున బూడ్చిపెట్టుదుము. నీకు దిక్కెవ్వరో చూతుము'' అని బెదిరించిరి. కాని యా కపటభిక్షకుడు సుంతయైనను జలింపడయ్యె. అంత నా మునులు మఱింత కృద్ధులై యావేశముతో గూడి, రాళ్ళతో, కఱ్ఱలతో నాతనిని గొట్టిరి. కాని యాతడా దెబ్బలను దప్పించుకొనెను.

అంత వారు మహాకోపావేశమున, 'నీ లింగము ధరపై గూలుగాక' యని

శపించిరి. అంత నా భిక్షకుడు రవంతయు గోపమునొందక, తన లింగము నూడబెఱికి, భూమిపై బడవేసి. వారు చూచుచుండగనే యటనుండి యదృశ్యు డయ్యెను.

అంత నా లింగ మతిశయించి, భయంకరమయ్యెను. దానినుండి మెండుగ నగ్నిజ్వాలలా మునులను జుట్టుముట్టి ఆకాశమునకు ఎగసెను. అంత నా మునులు భయమొంది, స్వర్గము మొదలగుచోట్లకు భీతులై పాఱిపోవగ, నా యగ్ని జ్వాలల లింగము వారిని వెంబడించి బాధించుచుండెను. అంతట వారు బ్రహ్మ లోకమునకేగి బ్రహ్మకు మొఱపెట్టుకొనిరి. అంత బ్రహ్మ సర్వము నెఱిగి 'మూర్ఖులారా! మిమ్మనుగ్రహించుటకు శివుడు మీ గృహములకే రాగా మీరు గ్రహింపలేక, యా లోకనాథుని నిందించి, కీడొనరించితిరికాన నిక మరెవ్వరు రక్షింపగలరు? మిట్టమధ్యాహ్న సమయమున నెట్టిదుష్టుడైన నింటికివచ్చినచో, నాతని కాతిథ్య మీయవలసియుండగా, సర్వేశ్వరుడే మీ ఇండ్లకు రాగ, మీరు ఆతిథ్యమీయక సరికదా! హానిచేసి, వెడల నడిపితిరి. మిమ్మెవ్వరు బ్రోవ గలరు'' అని మందలించెను.

అంత నా మునులా వహ్నిజ్వాలలచే బ్రాణభయ శంకచే మఱల మఱల వేడుకొనిరి. అంత నద్దేవుడు వారిభయము మాన్పి, మునులారా! మీరిపుడుపోయి పరమేశ్వరిని బ్రార్థింపుడు ఆమె దయతో నద్దానిని గుహ్యరూపమున ధరింప గలదు. మీ బాధ నివారణమగును అంతవఱకు నొక యష్టదళ పద్మమున నొక కుంభమునుంచి అందు పంచపల్లవములు, దూర్వాంకురములను జేర్చి, గంగోద కములతో నింపి, వేదమంత్రములతో నభిమంత్రించి, నమస్కరించి, శతరుద్రీ యము (నమకచమకములు) పఠించుచు నా జలముతో నీ లింగమును స్నానము చేయింపుడు (అభిషేకింపుడు). అప్పుడీ లింగము శాంతించును. తరువాత మీరు పరమేశ్వరీ పరమేశ్వరులను సేవించి వారి యనుగ్రహము నొంది, యీ లింగ బాధా విముక్తులగుదురు' అని హితోపదేశము గావించెను.

అంత నా మునులు బ్రహ్మను పురస్కరించుకొని పోయి మహేశ్వరీ మహేశ్వరుల నర్చించిరి పరమేశ్వరి యోనిరూపము నొంది, యా శివలింగము నాకర్షింపగ, నది యందుజేరి, స్థిరముగ నుండి శాంతించె.

అంత నా మునులా లింగమును బెక్కువిధముల స్తుతింపగ, నా పురాణ

దంపతు లనుగ్రహించి, వారల కభయమిచ్చి యంతర్థాన మొందిరి. దేవతలంద ఱా లింగమును నర్చించిరి. ఆ యుమామహేశ్వరాత్మక లింగము హాటకేశ లింగ మని పేరొందె. పద్మజుడును, దివిజులును నిజనివాసంబుల కేగిరి. ఇదియే లింగోత్పత్తికి గారణంబు. నాటినుండి యీ లింగమును నెల్లలోకంబులవారును పూజలు జరుపుచుండిరి. అని కొందఱు చెప్పుదురు. మఱికొందఱు మహావిజ్ఞులు ఆ లింగముయొక్క మొదలు తుది గనుగొనలేక దానిని ప్రకృతిగా సేవింతురు.

పూర్వము హరి బ్రహ్మలకు మహాయుద్ధము జరుగగ, శివుడు లింగరూప మున వారిమధ్య జనించి వారి పోరు మాన్పెనని తెలుసుకొంటిమి. ఇట్లు లింగో ద్భవంబు మొదలుకొని సర్వలోకములవారు లింగము నర్చింతురు అని సూతుడు శౌనకాది మహామునులకు లింగావిర్భావంబును లింగ లీలలు దెల్పి. లోకముల నెవరైనను నీ శివలింగ లీలను వినినను, చదివినను, వ్రాసినను సర్వసుఖము లంది శివసాయుజ్య మందుదురు" అని చెప్పెను.

—: ఓం తత్సత్ :—



# లింగము

లింగము కరచరణాద్యవయవరహితమైన స్థూలాకారమున దేవాలయము లందు నిర్మింపబడుచున్నది. ఇయ్యది యోంకార స్వరూపము, పంచసూత్ర ఘటితము, స్త్రీ పురుషభేద రహితము.

లోకకారణమగు పరమేశ్వర స్వరూపము స్త్రీ పురుషాది భేద రహితము, అట్టి పరమేశ్వరుని చిహ్నము గావున లింగముకూడ నట్లే నిర్మింపబడినది.

సమస్త జీవులును జన్మమున కాది యందు బిందు రూపము నుండి తరువాత, పాదము, హృదయము, శిరము భాగములుగా నవయవములేర్పడి క్రమ క్రమాభివృద్ధి నొంది కడకు నవయవములు నశించి లయము నొంది బిందు రూపము నొందుచున్నది.

ఆద్యంతములందు గల యీ బిందురూపమునందలి సృష్టివైచిత్ర్యే మెల్లరకు సుబోధమగుటకై బిందురూపముననగా నోంకార ప్రణవ స్వరూపమున శివాలయములలో గనపడు లింగమూర్తి ప్రతిష్ఠింపబడుచున్నవి.

'ల'కారము లయత్వమును, 'గ'కారము గమ్యత్వమును దెలియజేయు చున్నవి లకార గకార విశిష్టమై 'లింగ'మను శబ్దమేర్పడినది ఈ లింగము జూచుటకు, బద్మాసనాసీనుడై యోగనిష్ఠయందు ధ్యానించుచున్న యొక మానవుని బాహ్యాకృతిని బోలియుండును. పరమేశ్వరుని నిర్గుణ రూపము జూచుట తోడనే తెలియగలందులకు వేదవిదులగు పండితులు త్రిపీఠయుక్తముగ ప్రణవ లింగరూపమును నిర్మించియున్నారు. ఇందు మూలము, మధ్యము, ఊర్ధ్వము అను మూడు భాగములు కాన్పించుచున్నవి.

శ్రీ శివుడు, బ్రహ్మ, విష్ణు, రుద్రులకు మూలము

—: వేదవిదులు పల్కిన పల్కులు :—

ఊర్ధ్వము :- శిరము - రుద్రుడు - రుద్రపీఠమని (లయము) యందురు.
మధ్యము :- హృదయము - విష్ణు - విష్ణుపీఠమని (స్థితి) యందురు.
మూలము :- పాదాది నాభి పర్యంతము - బ్రహ్మపీఠమని (సృష్టి) యందురు.

—: లింగమూర్తి పంచభూతాత్మకము :—

శివుని తత్త్వము :—

1) ఆకాశము — నాదరూపము
2) వహ్ని — తేజోరూపము
3) వాయువు — జలరూపము
4) జలము — ప్రవాహరూపము
5) సూర్యచంద్రులు — జీవాధారమగు నుష్ణకాంతి.
తాపశమన మొనర్చు శీతలకాంతిరూపము.

శివుని యైదులీలలు :—

బ్రహ్మ — సృష్టికర్త, విష్ణు — పోషణకర్త, రుద్రుడు — లయకర్త, ఈశ్వరుడు — తిరోధానము. సదాశివుడు — అనుగ్రహము,

ఇట్టి పంచమూర్తులు పంచకృత్యములు చేయుచుందురు. ఈ పంచమూర్తులే సద్యోజాతాది పంచబ్రహ్మలే పంచభూతములకు అధిపతులు. అవే పరమేశ్వరునకు పంచముఖములగును. అవే పంచవర్ణములు అవే పంచాక్షరములుగా గుర్తింపబడుచున్నవి స్త్రీ పురుషభేద రహితమగు శివమూర్తిని దెలియజేయు నా పంచాక్షరములే 'నమశ్శివాయ' అను మంత్రమయ్యెను.

1. సదాశివుడు — అర్ధనారీ రూపముగను
2. ఈశ్వరుడు — స్త్రీ పురుష భేద రూపముగను
3. రుద్రుడు (తమోగుణము) — రౌద్రాణిగను
4. విష్ణువు (సత్వగుణము) — వైష్ణవిగను
5. బ్రహ్మ (రజోగుణము) — బ్రాహ్మిగను

ఈ పంచ మూర్తులు వెలయుదురు.

ఈ పంచమూర్తులనుండి యిరువదియయిదు మూర్తు లుదయించి నిగ్రహానుగ్రహములచే దుష్టుల శిక్షించుచు శిష్టుల రక్షించుచు సమస్త జీవులను గాపాడుచుండును

ఓంకార స్వరూపమైన లింగమూర్తి ప్రభావము గుఱించి యిపుడు మీకు బాగుగా దెలుపబడియున్నది. శివలింగాకారమునుబట్టి పరమేశ్వరుని స్త్రీపురుషాది భేదరాహిత్యమును కరచరణాద్యవయవ విహీనత్వమును సర్వభూతాంతర్యామిత్వమును, సర్వవ్యాపిత్వమును వెల్లడియైనది. మఱియు నయ్యీశ్వరుడు నిరాకారుడనియు, నిర్గుణుడనియు, నిరంజనుడనియు మనము గ్రహించుచున్నాము. అట్టి శివలింగమూర్తిని హృదయమున నిలుపుకొని తదేకనిష్ఠతో నమ్మూర్తిపై మనోదృష్టిని గేంద్రీకరించి యర్చించువారలు నిర్గుణోపాసకు లనబడుచున్నారు. ముమ్మూరు మూర్తుల కవ్వలనుండెడి మాయ యను చీకటికి వెలపలనుండు పరంజ్యోతి స్వరూపుడైన పరమశివుని నేకాంతముగా మనోనేత్రమున జూడ వీలగును.

నిర్గుణోపాసనకు మూలమగు నీ మానసిక ధ్యానమువలన గరచరణాద్యవయములు గలది, స్త్రీ పురుషాది భేదము గలది యగు నొక మానవాకృతిగల విగ్రహము గోచరింపక యోంకారస్వరూపము, తేజోమయము, నిరాకారము అగు మూర్తిమాత్రమే సర్వదా మనోదృష్టికి గోచరించును. ఇట్టి యుపాసనము

వలన మనోబలము, ఇంద్రియనిగ్రహము, ఆత్మశక్తి మున్నగునవి పెంపొంద గలవు. కారణమేమన శివలింగాకారమును యోంకారస్వరూపమైన జ్యోతి యొకటి మానవుని సహస్రారమున గలదు. అదియే జీవాత్మకు నిలయము. ఆ జీవజ్యోతి దేహమునుండి విముక్తిపొందుటయే మనము మృత్యువని వ్యవహరించుచున్నాము.

మానవుని బుద్ధివిశేషమునకు గారణమైనదియు, ప్రణవస్వరూపమైన శివ లింగమునకును నిశ్చలధ్యానముచే బరస్పర సంబంధ మేర్పడుచున్నది వాని యన్యోన్యాకర్షణశక్తి క్రమక్రమాభివృద్ధినొంది మానవునకు దన్మూలమున దూరశ్రవణము, దూరదర్శనము మున్నగు శక్తుల బ్రసాదించుచున్నదని భారతము వేనోళ్ళ జాటుచున్నది.

పై జెప్పిన విషయములవలన నవయవములతో గూడుకొన్నదియును, స్త్రీ పురుష భేదమును దెలియజేయునదియునగు శివుని విగ్రహరూపమునకును గల భేదము స్పష్టపరుపబడినది.

ఓం తత్సత్.



# లింగార్చన మహిమ - పూజ

పూజ - లింగార్చనలో 1) స్థావర పూజ, 2) పీఠ పూజ, 3) కర పూజ.

1) స్థావర పూజయన :- దేవాలయములందు ప్రతిష్ఠింపబడిన మూర్తుల నర్చించుట.

2) పీఠ పూజయన:- గృహములయందు పీఠముపైనుంచి యర్చించుట.

3) కర పూజయన:- మృణ్మయముననో, బాణముననో, స్ఫటికముననో, రత్నముననో పంచసూత్ర ఘటిత త్రిపీఠయుక్తముగ నిర్మించి కరమునందుంచి యర్చించుట.

ఈ పూజయందు రెండు విధములు గలవు. కొందరామూర్తిని జలము నందో గూటియందో పెట్టెయందో ఉంచెదరు కొందఱు హృదయమున ధరింతురు. హృదయమున ధరించుట విశేషాచారము. తదితరములు సామాన్యాచారములు. హృదయమునందు శివమూర్తిని "అమృతస్యదేవధారణోభూయాసమ్" అను శృతి ప్రమాణములననుసరించి యర్చించుదురు.

ఈ ధారణ చేసికొనెడు మూర్తులు నియమప్రకారము చిత్రింపబడినవి. 1) నిరీక్షణ సేయదగు స్థానము తిలమాత్ర ప్రమాణము గలదియై యుండును. కనుజూపుచే నాసాగ్రముగుండ చూచునపుడు దృష్టిపాతమును స్థిరీకరించుటకు వీలగునదియై కాననగుచున్నది. ఈ నిరీక్షణము పది విధములై యొప్పుచున్నది 2) దృగవధానములు; 3) త్వగవధానములు; అయిదు మానసికావధానములు ఈ యవధానములచే నష్టసిద్ధులు సంపాదించుశక్తిని గ్రహించగలము.

శివుని విగ్రహరూపము నర్చించుటకంటె లింగరూపము నర్చించిన ఘనతరమగు ప్రభావము గలదని భారతమునందు గూడగలదు.

పరమేశ్వరారాధనము నెట్లు జేసినను ధర్మార్థకామమోక్షంబులొసంగును కాని విగ్రహార్చనకంటే లింగార్చన మధికప్రభావం బొసంగును.

ఉదా॥ లింగార్చన మహిమ నారాయణాంశ సంభూతులైన కృష్ణార్జునులును ద్రోణనందుడైన అశ్వత్థామయు (భారతము – ద్రోణపర్వము – లింగార్చనము) బరమేశ్వరుని అర్చించిన మహదేవ వరప్రభావంబున యనన్యసామాన్య సామర్థ్యంబు లభ్యము జేసికొనిరి. అయినను నరనారాయణులకును అశ్వత్థామకును వ్యత్యాసము గలదు. శివార్చనాప్రభావముచే నరనారాయణులు కరచరణాద్యవయవరహితమైన లింగము నందు శంకరు నావహించి యతులిత శక్తింగొలిచిన నజేయులై నీ జగములందు శిష్టరక్షణ దుష్టశిక్షణార్థమై యప్పుడప్పుడవతరించి ధర్మ సంస్థాపన జేయుదురు. అశ్వత్థామ, మృత్తికతో శివుని విగ్రహమును ప్రతిష్టించి దానియందు పరశివతత్వము నావహింపజేసి మిక్కిలినిష్ఠతో నర్చించెను.



# శ్రీ లింగాష్టకమ్

బ్రహ్మ మురారి సురార్చిత లింగం । నిర్మలభాసిత శోభిత లింగం ॥
జన్మ దుఃఖవినాశక లింగం । తత్ప్రణమామిసదాశివ లింగం ॥ (పల్లవి)
దేవముని ప్రవరార్చిత లింగం । కామదహన కరుణాకర లింగం ।
రావణదర్ప వినాశక లింగం । తత్ప్రణమామి సదాశివ లింగం ॥
సర్వసుగంధసులేపిత లింగం । బుద్ధి వివర్ధనకారణలింగం ।
సిద్ధ సురాసుర వందిత లింగం । తత్ప్రణమామి సదాశివ లింగం ॥
కనకమహామణి భూషితలింగం । ఫణిపతి వేష్టితశోభిత లింగం ।
దక్షసుయజ్ఞ వినాశన లింగం । తత్ప్రణమామిసదాశివ లింగం ॥
కుంకుమ చందనలేపిత లింగం । పంకజహారసుశోభిత లింగం ।
సంచిత పాపవినాశన లింగం । తత్ప్రణమామిసదాశివ లింగం ॥
దేవగణార్చిత సేవితలింగం । భావైర్భక్తిభిరేవచ లింగం ।
దినకర కోటి ప్రభాకర లింగం । తత్ప్రణమామిసదాశివ లింగం ॥
అష్టదళో పరివేష్టిత లింగం । సర్వ సముద్భవ కారణలింగం ।
అష్టదరిద్ర వినాశన లింగం । తత్ప్రణమామి సదాశివలింగం ॥
సురగురు సురవర పూజిత లింగం । సురవన పుష్ప సదార్చిత లింగం ।
పరమ పరంపరమాత్మక లింగం తత్ప్రణమామి సదాశివలింగం ॥

శ్లో॥ లింగాష్టక మిదం పుణ్యం । యః పఠేచ్ఛివ సన్నిధౌ ।
శివలోక మవాప్నోతి । శివేన సహమోదతే ॥

ఓం తత్సత్



# శ్రీ శివలీలావతారములు

పంచావతారములు:- 1. శ్రీ సద్యోజాతావతారము 2. శ్రీ వామదేవావతారము 3. తత్పురుషావతారము 4. అఘోరావతారము 5. ఈశానావతారము. అష్టమూర్తులు:- 6. శర్వ 7. భవ 8. రుద్ర 9. ఉగ్ర 10. భీమ 11. పశుపతి 12. ఈశాన 13. మహాదేవులు - 14. శ్రీ అర్ధనారీశ్వరావతారము - శ్రీ శివ యోగీశ్వరావతారములు (ఇరువది యెనిమిది) :- 15. శ్రీ శ్వేతమున్యవతారము 16. శ్రీ సుతారావతారము 17. శ్రీ దమనావతారము 18. శ్రీ సుహోత్రావతారము 19. శ్రీ కంకావతారము 20. శ్రీ లోకాక్ష్యవతారము 21. జైగీషవ్యావతారము 22. శ్రీ దధివాహనావతారము 23 శ్రీ ఋషభావతారము 24 శ్రీ భృగు లింగావతారము 25. శ్రీ తపావతారము 26. శ్రీ అత్ర్యవతారము 27. శ్రీ మహాముని బల్యవతారము 28 శ్రీ గౌతమావతారము 29. శ్రీ వేదశిరోవతారము 30. శ్రీ గోకర్ణావతారము 31. శ్రీ గుహావాస్యవతారము 32. శ్రీ శిఖండ్యవతారము 33. శ్రీ మాల్యావతారము 34 శ్రీ అట్టహాసావతారము 35. శ్రీ దారుకావతారము 36. శ్రీ లాంగలీ భీమావతారము 37. శ్రీ శ్వేతావతారము 38. శ్రీ శూల్యవతారము 39 శ్రీ ముండీశ్వరావతారము 40. శ్రీ సహిష్ణ్వవతారము 41. శ్రీ సోమేశర్మావతారము 42. శ్రీ లకుల్యవతారము - దశావతారములు:- 43. శ్రీ మహాకాలావతారము 44. శ్రీ తారావతారము 45. శ్రీ బాల భువనేశ్వరావతారము 46. శ్రీ షోడశ శ్రీ విద్యేశ్వరావతారము 47. శ్రీ భైరవావతారము 48. శ్రీ చిన్నమస్తకావతారము 49. శ్రీ ధూమవంతావతారము 50. శ్రీ బగలముఖావతారము 51. శ్రీ మాతంగావతారము 52. శ్రీ కమలావతారము - శ్రీ శివుని ఏకాదశావతారములు (కామధేనువు గర్భమున పదునొకండు మూర్తులుగ నవతరించెను) :- 53. శ్రీ కపాలి 54. శ్రీ పింగళ 55. భీమ 56. విరూపాక్ష 57. విలోహిత 58. శస్తా 59. శ్రీ అజపాద 60 శ్రీ అహిర్బుధ్న్య 61. శ్రీ శంభు 62. శ్రీ చండ 63 శ్రీ భవులు - 64. శ్రీ గృహపత్యవతారలీల 65. శ్రీ అవధూతేశ్వరావతారము 66. శ్రీ వృద్ధయత్యవతారము 67. శ్రీ నర్తకావతారము 68. శ్రీ వైష్ణవద్విజావతారము

69. శ్రీ నందికేశ్వరావతారము 70. శ్రీ భైరవలీలావతారము -వీరినే సురభి పుత్రులందురు వీరు కశ్యప పుత్రులు. వీరికి పై నామములు నామకరణము జేసెను. వీరిని మహారుద్రులందురు - 71. శ్రీ శరభావతారము 72. శ్రీ పిప్పలాదమున్యవతారము 73. శ్రీ యతినాథావతారము 74. శ్రీ కలహంసావతారము 75. శ్రీ యక్షేశ్వరావతారము 76 శ్రీ దుర్వాసోమున్యవతారము 77. శ్రీ హనుమదవతారము 78. శ్రీ సురేశ్వరావతారము 79. శ్రీ వృషభేశ్వరావతారము 80. శ్రీ భేతాళావతారము 81. శ్రీ భిక్షుకవర్యావతారము 82. శ్రీ మాయాశార్దూలావతారము 83. శ్రీ ద్విజేశ్వరావతారము 84 శ్రీ అశ్వత్థామావతారము 85. భూతాకృతి లీలావతారము 86. శ్రీ కిరాతేశ్వరావతారము 87. శ్రీ వైశ్యపతి లీలావతారము 88. శ్రీకృష్ణదర్శన లీలావతారము 89. శ్రీ సోమనాథ లింగావతారము 90 శ్రీ మల్లికార్జున లింగావతారము 91. శ్రీ మహాకాల లింగావతారము 92. శ్రీ ఓంకార లింగావతారము (అమలేశ్వర) 93 శ్రీ కేదార లింగావతారము 94. శ్రీ భీమశంకర లింగావతారము 95. శ్రీ విశ్వేశ్వర లింగావతారము 96. శ్రీ త్ర్యంబక లింగావతారము 97. శ్రీ వైద్యనాథ లింగావతారము 98. శ్రీ నాగేశ్వర లింగావతారము 99. శ్రీ రామేశ్వర లింగావతారము 100. శ్రీ ఘుశ్మేశ్వర లింగావతారము 101. శ్రీ మహాబలేశ్వర లింగావతారము.

శ్రీ సూత మునీంద్రులవారు శ్రీ శౌనకాది మునీంద్రులకు "బ్రహ్మ మానస పుత్రుడగు శ్రీ సనత్కుమారునకు శ్రీ నందీశ్వరుడు శ్రీ శివలీలావతారములను దెలియజెప్పెనని వారికి జెప్పెను.

సూచన :- 6-13 శ్రీ శివుని అష్టమూర్తి వివరణము
15-42 శ్రీ శివయోగీశ్వరావతారముము
43-52 శ్రీ శివుని దశావతారములు
53-63 శ్రీ శివుని ఏకాదశావతారములు
89-100 శ్రీ శివుని ద్వాదశజ్యోతిర్లింగావతారములు

ఓం తత్సత్





# శ్రీ హనుమదవతారము

త్రేతాయుగంబున నొకప్పుడు పరమేశ్వరుండు పార్వతీదేవితో గూడి వినోదమునకై భరతఖండమున విహరించుచు, శ్రీ శేషాచల క్షేత్రమునకు విచ్చేసెను. అది వసంతకాల మగుటచే ప్రకృతి సౌందర్యాతిశయమున నొప్పుచుండెను. అట్టి సమయమున పార్వతీపరమేశ్వరులట నన్యోన్య మనురాగమున గనుంగొనుచు, ప్రేమసాగరమున మునిగితేలుచుండిరి.

అంత నట నొక వానర మిధునము సంగమ మొనర్చుచుండుట జూచి, వినోదముగ నప్పురాణదంపతులును మర్కటములై, సంభోగసుఖ మనుభవింప సాగిరి. తుదకు శివవీర్యమును పార్వతి ధరింపలేకపోయినందున, నామహేశ్వరు డద్దానిని నా పర్వత తలమున విడిచెను. అప్పుడా పర్వత మా మహావీర్యమును **ధరింపజాలకపోవుటచే, శివు డద్దానిని నగ్నియందుంచెను.** అగ్నిహోత్రుడును

నవ్వీర్యమును ధరింపలేకపోవుటచే నంత నద్దేవదేవుండు దానిని వాయుదేవునందు నిలిపియుంచెను. అద్దేవు డమ్మహావీర్యమును వేయి సంవత్సరములు మోసెను.

ఇట్లుండగ బూర్వము కేసరియను మహాబలశాలియగు వానరోత్తము డొకడుండెను. అతడు పదివేల వానరములకు నాథుడై యుండెను. బ్రహ్మచర్య వ్రతము ననుసరించి పెద్దకాలము నియమముతో నుండెను. ప్రభాసతీర్థమున శంఖము, శబలము అను నేనుగులు మునులను బాధించుచుండగ, నతడు వానిని సంహరించి, వారికి మోద మొనగూర్చెను. అందు భరద్వాజ మునీంద్రు డాతనిని మిగుల మెచ్చుకొని, మత్తగజములను సంహరించెనుగాన నాతనికి కేసరియను నామముంచెను. అమ్మునీంద్రు డాతనిని వరము కోరుకొనుమనగా, నా కేసరి కామరూపియు, బలాఢ్యుడునగు కుమారుని గోరుకొనెను. అమ్ముని యట్లే కలుగునని వరమిచ్చెను.

తరువాత కేసరి తపంబొనరించి, సిద్ధిబొందియు బ్రహ్మచారిగనే యుండెను దేవతలు వానిని వివాహమాడుమని ప్రోత్సహించుచుండిరి. కాని యాతడు తనకు దగినయువతి లభించినపుడే వివాహము చేసుకొందుననెడివాడు. తగిన సంబంధమునకై యాతడు వేచియుండి ప్రయత్నించుచుండెను.

కుంజరుడను నొక వానరుండు సంతానము నభిలషించి శివునిగూర్చి తపంబొనర్పగ, నమ్మహాదేవుండు ప్రత్యక్షమై యాతని కొక కన్య లభించునట్లు వరమిచ్చి యదృశ్యుండయ్యెను. ఆ విషయమెఱిగి, గౌతమముని తన కుమార్తెయు శాపవశమున గోతియైయున్నట్టియు, అంజన యనుదానిని బుత్రికగా బెంచుకొనుమని, కుంజరున కొసంగెను. కుంజరుండు మహామోదంబున నా కన్యను దీసికొని బెంచుకొనుచుండెను.

అంజన వివాహవయస్కయైనంత గుంజరుండు తగిన వరునకై వెదకి వెదకి తుదకు కేసరియను వానరేంద్రుడు యోగ్యుడని దలంచి, యాతని కామె నిచ్చి వివాహమొనరించెను. వివాహమునకు గౌతమమునీంద్రుడును వచ్చి యా యనురూప దాంపత్యమునకు మహానందము నొంది, వారి కనేక శుభాశీర్వాదము లొసంగి నిజాశ్రమమునకు మఱలిపోయెను.

కేసరి యంజనాదేవిని భాగ్యమున లక్ష్మీదేవితో సమానురాలనియు,

స్వభావగాంభీర్యములందు సింహమును బోలియున్నదనియు, ధర్మములందును, యోగములందును దనకు సమానురాలై యున్నదనియు, తన వంశమును వన్నె కెక్కునట్లు చేయునదియే యనియు, భారద్వాజమునీంద్రుడు తనకిచ్చిన వర మామెవలన ఫలించుననియు దన మనంబున నెంచి, బ్రహ్మానందమొందుచుండెను. అట్లే అంజనయు, మహాత్ముడనియు, యోగ్యుడనియు, బుద్ధిమంతుడనియు, మహాయోగియనియు గేసరిం గూర్చి భావించి యానందించుచుండెను. ఇట్లు అంజనాదేవియు, కేసరియు ననురూప భార్యాభర్తలై యొప్పిరి

అంజనాదేవి మునికాంతలకు ఫలముల నొసంగుచు, వృద్ధులను సేవించుచు, దంపతులను గౌరీశంకరులనుగా భావించి, వారిని బూజించుచు, నిఱుపేదలకు శక్తికొలది నాహారమిడుచు, పెక్కువిధములగు దానధర్మములు సేయుచుండెను. ఆ దంపతులు సంతానాభిలాషతో బెక్కునియమములు పాటించిరి. పెక్కు వ్రతములు, పూజలు సల్పిరి. మునులను సేవించి, వారి దీవనలు పొందుచుండిరి. ఎన్నియో పాట్లు పడుచుండిరి.

ఆ యోగ్యదంపతులయెడ బ్రీతితో ధర్మదేవత యొకనాడు ఎఱుకల సానియై వచ్చి, యంజనాదేవికి, "నీ కడుపున శివుండు కొడుకై త్వరలో పుట్టును. రాక్షసులను జంపును, శ్రీరామునకు భక్తుడగును. నీవు నీ మగని యిష్టప్రకారము తపము చేయుము నీ బాధలన్నియు దొలగిపోయి, నీకు మేలు కల్గు"నని యెఱుక చెప్పి యదృశ్యమయ్యెను.

అంజనాదేవి మగనితో నా వృత్తాంతమును దెలుపగ, నాతడు పూర్వము ప్రభాసతీర్థమున భారద్వాజమునీంద్రుడు దనకు గేసరియను పేరుపెట్టి, సుపుత్రుడు గల్గునట్లు వరమిచ్చిన వృత్తాంతము నామెకు నామూలాగ్రముగ దెల్పి, "యీ యెఱుకలసాని చెప్పిన యెఱుక సత్యమేయగునట్లున్నది. కాన ప్రేయసీ! పుంజక స్థలమను క్షేత్రము పూర్ణతపః ఫలదాయి. కాన నీవచటికేగి జగత్ప్రాణుడు గంధవహుడును నగు సమీరదైవమునుగూర్చి తపమొనరింపుము, నీకు వలసిన సౌకర్యముల నే నొనగూర్తు" నని ముదంబున బల్కెను.

పతి యనుజ్ఞతో నంజనాదేవి పుంజకస్థలక్షేత్రమునకేగి వాయుదేవుని గూర్చి తపము సేయసాగెను. ప్రతిదినమును వాయుదేవుని కరుణావిశేషముచే నామె నొకఫల మాహారమునకై లభించుచుండెను. తత్ఫలాహారమున నామె

నియమమున దపంబొనరించుచుండెను. అట్లు కొంతకాలమేగిన పిమ్మట వాయు దేవుడు తాను వేంకటాచల క్షేత్రమున వేయి సంవత్సరముల క్రిందట శివ వీర్యమును ధరించి నాటి దనుకదద్వీర్యమును వహించి యున్నాడు గాన, నొకనాడావీర్యము నొక ఫలముగ నొనరించి యాతడామెకు లభింపజేసెను. నిత్యమును లభించుపండువంటిదే యా పండును అని తలంచి భక్షించెను. వెంటనే యామె గర్భవతియయ్యెను. ఆమె నియమము మాని, యబ్బురపడు చుండెను.

కొలది దినములేగినంత, నంజనాదేవికి "పక్షుచదనములోనున్న యాడుది పెనిమిటి దగ్గఱలేనపుడు గర్భమెట్లు ధరించె?" అని లోకులు తన్ను నిందింతురే, యని భయమొదవ ఆమె విచారించుచుడెను. అంతనాకాశవాణి, "అంజనా! నీవు విచారింపకుము శివుండుమున్ను వానరరూపుడయి వానర రూపముతోనున్న పార్వతితో గూడినప్పుడు తద్వీర్యమునామె ధరింపలేక పోయెను. శివుడావీర్యమును భూమిపైనిడగ, పుడమియు, ననంతరము అగ్ని దేవుడును నా వీర్యమును ధరింపలేకపోవుటచే తుదకు దానిని వాయుదేవుని యందుంచెను."

నీవు వాయుదేవునిగూర్చి తపమొనరించితివి కాన నద్దేవుడు నీ తపము నకు మెచ్చి, నీ యందు పరిపూర్ణానుగ్రహముతో దనయందు నిక్షిప్తమైన యా మహాశివ వీర్యమును ఫలరూపమున నీ కొసంగెను. నీవా ఫలము భక్షించి, గర్భమును ధరించితివి. కాన నీకు శివాంశసంభూతుడైన నొక సుపుత్రుడు జనించును. ఆ వీర్యము వాయువుద్వారా నీకు లభించెను. గాన నీ పుత్రుడు వాయుపుత్రుడని లోకమున ప్రసిద్ధినొందును." "నీకు జనించిన బాలుడు లోకములకు మిగులనుపకారమొనరించినవాడగును. సూర్యవంశ రాజశేఖరుడగు శ్రీరామచంద్రుని యందపరిమిత భక్తి గలవాడగును." అని పల్కెను. అంతలో వాయుదేవుడు ప్రత్యక్షమై "అంజనా! నీవు భయమునొందకు ఆశరీరవాణి పల్కినదంతయు సత్యము. ఈ విషయమునంతను నీ భర్తయగు కేసరికి దెలుపుము" అని పలికి యంతర్హితుడయ్యెను. అంజనాదేవి మహదా నందమున నిజనివాసమునకేగి, నిజనాధునకు సర్వ వృత్తాంతము నా మూలా గ్రముగ తెలుపగ, నక్కేసరి ప్రహర్షమునొందెను.

అంజనాదేవికి నెలలు నిండినంతనే వైశాఖ మాసమున బహుళదశమి

తిథియందు శనివారమున పూర్వాభాద్రానక్షత్రమున వైధృతి యోగమున నభిజిల్లగ్నమున నొక సుపుత్రుడు జనించెను. ఆ శిశువు మహాబలుడు, మహా సత్త్వుడు, విష్ణుభక్తి పరాయణుడు, సర్వదేవమయుడు, వీరుడు, బ్రహ్మ, విష్ణు శివాత్మకుడు, వేదవేదాంగతత్త్వవేత్త. సర్వ విద్యావిశారదుడు సర్వ బ్రహ్మ విద్వద్వర్యుడు సర్వదర్శన సమ్మతుడు మాణిక్యకుండలధరుడు దివ్య పట్టాంబరావృతుడు. కనకాచల సంకాశుడు. పింగాక్షుడు. హేమమాలి. స్వర్ణ యజ్ఞోపవీతుడు. మణీనూపురశోభితుడు. ధ్వజవజ్రాంకుశచ్ఛత్ర పద్మ రేఖాంఘ్రిసంయుతుడు. దీర్ఘలాంగూలయుక్తుడు. దీర్ఘకాయుడు, మహాహనుడు. సర్వశుభలక్షణ సంపన్నుడు. కిరీటకనకాంగదుడు. అమితకాంతితోగూడి విష్ణువే యట్లవతరించినట్లుండెను. అటనుండి శేషాద్రికి "అంజనాద్రి"యను నామము కలిగినది.

[సర్వపాపములను దహించునటువంటి పుణ్యక్షేత్రమగుటచే కలియుగ మున "వేంకటాద్రి" యనియు, "వేంకటాచల"మనియు ఈ పర్వతమునకు సప్త నామములు కలిగియున్నవి. భక్తాదులు వారివారి కోరికలు యీ క్షేత్ర మందు నెరవేర్చుకొనుటచే ఈ పర్వతము అనేక నామములచే కొనియాడి యున్నారు.

కృతయుగ, త్రేతాయుగ, ద్వాపరయుగ, కలియుగములందు ఈ క్రింది విధముగ సప్తనామములు కలిగియున్నవి.

కృతయుగము: ఆదిశేష రూపమున నుండుటచే (1) "శేషాచల" మనియు, వేదములచే నిండియున్నందున (2) "వేదాచల"మనియు, గరుత్మంతునిచే భూలోకమునకు తేబడినందున (3) "గరుడాచల" మనియు, వృషభాసురుడను రాక్షసుని సంహరించి మోక్షమిచ్చుటచే (4) "వృషభాద్రి" యనియు కృతయుగమున పిలువబడెను.

త్రేతాయుగము: అంజనాదేవి తపస్సుగావించి వాయుసమాన బలుడును, పరమభక్తుడైన ఆంజనేయుని పుత్రునిగా బడయుటచే (5) "అంజనాద్రి" యని పిలువబడెను.

ద్వాపరయుగము: ఆదిశేషుని, వాయుదేవుని పురిగొల్పిఆనందుని యిచ్చటకు తెచ్చుటవలన ఈ క్షేత్రమునకు (6) "ఆనందాద్రి" యని పేరుగలిగెను.

కలియుగము: మహాచండాలత్వము బొందిన మాధవునకు శ్రీనివాసుడు ప్రత్యక్షమై వాని పాపముల పోగొట్టినందున (7) "వేంకటాచల" మనియు ఈ పర్వతమునకు సప్తనామంబులు కలిగియున్నవి.]

ఆ సమయమున పుష్పవృష్టి కురిసెను. దేవదుందుభులు మ్రోగెను. దేవ గంధర్వసిద్ధులు తుష్టినొందిరి. వాయువులు వీచెను. నదులు నిర్మలోదకములు కలవై ప్రవహించెను.

కేసరి భార్యయగు నంజనాదేవి కపిసార్వభౌముడగు హనుమంతుని బ్రసవించినపుడు మునీంద్రులు హోమాగ్నిత్రయము ప్రదక్షిణము చేసినప్పటి వలె ప్రజ్వలించెను.

ఆ సమయమున సురేతరులగు దానవాదుల యొక్క కిరీటము లందలి రత్నములు హేతువులేకయే జలజలరాలి పడిపోయెను. దానవాదులు స్త్రీలకు గర్భములు భేదిల్లునంతటి మహాభీతియు గలిగెను.

సత్పురుషులు మహానందము నొందిరి. దేవమునీంద్రాదులమిత సంతోష, సుఖములందిరి. పతివ్రతలు పొంగిపోయిరి. వృక్షములు పుష్పించెను. ఫలించెను. జంతువులు అమితానందమునొందెను. శిలలు ద్రవించెను.

కేసరి యానందముచే మిగుల పొంగిపోయెను. అంజన యుబ్బిపోయెను గౌతమమునీంద్రుదెంతసంతసించెనో? శిలయై పడియుండిన యహల్య యెంత మహదానందము నొందెనో? నిరంతరము శాశ్వత బ్రహ్మానందమందు వారు గూడ నొందిన సంతోషమపరిమితముగదా!

అంజనాదేవి రాత్రింబవళ్ళు తన పుత్రునకు మేలు లొనరించును. సంధ్య లందు రక్షాకృత్యములొనరించును. ఆమె జోలలుపాడి యా శిశువేడువకుండ లాలించును. ఆ శిశువును మాటిమాటికి ముద్దిడుకొని యానందించును. సమస్త శైశవోపచారములు మహానందమున నొనరించును. తనకట్టి మహాభాగ్యము గల్గించినందులకు పరమశివుని మనంబున మననంబు చేయును.

పిమ్మట నాలుగైదు దినములు గడిచినంతనబ్బాలుడు అమావాస్యరోజున నుదయకాలమున దనజననిం గాంచి, నాహారము గోరెను. వాని తీరు పరికించి,

యామె యెచ్చటికైనను బోయి, తీసుకొనుమనెను. వెంటనే యా హనుమంతుడు తూర్పుదిక్కున గానుపించు సూర్యబింబము గాంచి, యది చక్కగ పండిన యొక పండని తలంచి, హుమ్మని యాకాశమునకెగిరి దివ్యకాంతులతో బోయి బాలభానుని పట్టుకొనెను.

అప్పుడు సముద్రములు ఘూర్ణిల్లెను. దిగ్గజంబులు మూర్ఛనందెను. గగనంబున గగ్గోలు బయలుదేరెను. బ్రహ్మదేవుని మానసము క్షోభిల్లెను. ఆ శిశు పాదహతిచే సముద్రోదకము చిందులాడెను. ఆతని యూరువుల ఘట్టనలచే వైమానికుల విమానములు గూలిపోవుచుండె ఆతడు వాలము నాడించుటచే నక్షత్రములు రాలుచుండెను

తన జనన హేతుభూతుడగు వాయుదేవుడు చల్లగ వీచుచు దనవెంట వచ్చుచుండగా, హనుమంతుడు లక్షయోజనములు గడచి, సూర్యమండలంబున బ్రవేశింపగనే, యచటి ద్వారములచెంత నుండువారు "రక్షింపుడు, రక్షింపుడు'' అని మొఱలిడుచుండిరి భయముచే శరీరము కంపింపగ, జపమాలికలు వదలి, "ప్రళయకాల రుద్రుడిదె వచ్చుచున్నాడు. మమ్ము దయజూడుము. వాని కాంతులతో మా కన్నులు మిఱుమిట్లుగొన్నవి వాని కేకలతో మా చెవులు చిల్లులు పడినవి మహాభీకులగు మాకు నన్యధా శరణములేదు. దేవా! భాస్కరా! మమ్ము రక్షింపవే" యని ప్రార్థించుచుండిరి.

అంత సూర్యుండు, ''ఈతడు ప్రళయకాల రుద్రుడుకాడు. శివవీర్య సముద్భవుడు. మహాశౌర్యవంతుడు. సర్వలోక పాలనచతురుడు. బాల్యచాపల మున నన్నొక ఫలమని భ్రాంతియై దినుటకు వచ్చినాడు. భయపడకుడు'' అని పల్కెను.

అంతలో సూర్యుని కబళించుటకు సిద్ధుండై మహాభయంకరముగ కేక వేయగ, నాడు పర్వదినమగుడు, సూర్యుని గ్రహింపసిద్ధుడైయున్న రాహు గ్రహము మహాభీతినొంది, స్వర్గమునకు బాఱిపోయెను. "దేవేంద్రా! నేడు పర్వమగుటచే నేను సూర్యగ్రహణమునకు రాగ, నాకంటె ముందె యొక విచిత్ర రాహుగ్రహము వచ్చి, సూర్యగ్రహణము సేయ సిద్ధపడినాడు'' అని మొఱపెట్టికొనెను.

అప్పలుకులు విని, దేవేంద్రుడు మండిపడి లేచి, "ఓయీ ! ఏల భయ మందుదువు ? ఇదిగో వృతాసురాది దుర్మార్గుల వధించిన యీ యాయుధముచే నద్దురాత్మునిగూడ వధింతును రమ్ము" అని యైరావతారూఢుడై వజ్రాయుధము చేతధరించి, యటకేగెను. అంత నాంజనేయుండు "ఓహో! మంచి తెల్లని పండు వచ్చినదే. ఇది మఱింత రుచిగనుండు" నని తలంచి, యైరావతమును బట్టు కొననుండ దేవేంద్రుడు మహాకోపంబున నబ్బాలునిపై నకఠోర వజ్రాయుధము ప్రయోగించెను. వెంటనే హనుమంతుని పైదవడలు, చెక్కిళ్ళు పగులుటచే నాతడు వివశుడై యుదయగిరిపై బడిపోయెను.

అంత సుతుని దురవస్థగాంచి, వాయుదేవుడు నబాహ్యాంతర సంచారము మాని, చింతించుచుండెను. ఇంట నంజనాదేవి కుమారునకై వివిధ రుచ్యఫలం బుల నేఱికొని తెచ్చి, కుమారు డెంతకును రానందులకు దుఃఖింపుచుండె. మహా తపస్వియగు కేసరి హనుమంతుని వృత్తాంతమంతయు దివ్యజ్ఞానమున దెలిసి కొని భార్యకు దెలిపి. "మన సుతునకు నుపకారములు జరుగును" అని తెల్పెను. అప్పలుకులు విని, చింత యొకవంకను, హర్షము మఱియొకవంకను గల్గు చుండగ, నంజనాదేవి నిర్మల నిశ్చల హృదయముతో పరమశివుని, వాయు దేవుని ధ్యానించుచుండెను.

వాయుసంచారము లేకపోవుటచే సర్వజీవకోటి యటమటించుచు ప్రాణ సందేహావస్థలో నుండుటగాంచి, యమరులేగి, కమలాసనునకు నివేదించిరి. ఆ యార్తి నివారింపుమని ప్రార్థించిరి. అంత బ్రహ్మ "నేనిదే పోయి, హను మంతుని తెప్పరిల్లజేసి, వాయుదేవునకు సంతసమొనగూర్తును. అంత మీ యార్తి పాయును. భయమందకుడు" అని పంకజాసనుడు వాయుదేవునికడ కేగెను. అంత, బ్రహ్మ "ఓ వాయుదేవా! నీ సహాయము నర్థించివచ్చితిమి. నీకు ప్రత్యుప కారము తప్పక చేయుదుము. నీవు సర్వజీవులకు నాధారమయినవాడవు. సర్వ జీవాంతర్వర్తినివి. సర్వలోక ముఖ్యప్రాణుడవు. నీవిట్లు కోపము నొంద దగునా ?" యనెను. అప్పుడు వాయుదేవుడు తన దుఃఖమును మాని దేవేంద్ర వజ్రాహతిచే మూర్ఛనొందియున్న హనుమంతుని బ్రహ్మ పదకమలములపై నుంచి, నమస్కరించెను. అంత నా విధాత నబ్బాలుని స్పృశించగనే హను మంతుడు తెప్పరిల్లి లేచి మహోత్సాహముతో గంతులు వేయుచుండెను.

అంత పద్మసంభవుడు "ఆంజనేయా! నీవు పండనుకొని, సూర్య భగవానుని మ్రింగబోయితివి." అని దగ్గరకు బోయి వానినెత్తుకొని, ముద్దాడి, యాదరము జూపుచుండెను. వాయుదేవుడు ప్రహర్షమొంది, నమస్కరించి పితామహునాజ్ఞచే సర్వలోకములందును యథాపూర్వముగ బాహ్యాంతరముల సంచరించి సర్వ ప్రాణులకు పరమానందమొనగూర్చె.

అప్పుడు బ్రహ్మ మహానందమొంది, "దిక్పాలకులారా! శంకరుడే యీ రూపమున జనించినాడు. ఈ హనుమంతుడు వాయునందనుడని లోకమున ప్రసిద్ధుడయి త్రిలోకములకు మోదమును గల్గించుటకు సదాయత్నించును కావున మనమీతనికి దగిన వరములనిత్తమురండు. అవసరమగుచో నితడు మనకు బ్రత్యుపకారము చేయగల మహాత్ముడు" అని పలుకగా సర్వదేవతలు మహానందమొందిరి.

అంతట ధరణీదేవి హనుమంతునకు వేదశాస్త్రములు తమకుదామే లభించునట్లు వరమిచ్చెను, వరుణుండు తన పాశమువలన భయము లేకుండునట్లును, యముండు కాలదండ, మృత్యురోగబాధ లేకుండునట్లును వరములిచ్చిరి, ఈశానుండు తనచేతను దనయాయుధము చేతను భయము సంభవింపని వరమొసంగె. కుబేరుండు యుద్ధవిజయమును, గదాభయరాహిత్యమను సుఖజీవనమును, ధనప్రాప్తిని ననుగ్రహించె విశ్వకర్మ స్వనిర్మిత శస్త్రాస్త్ర భయము లేకుండునట్లు వరమిచ్చె. కనక కుండలములగూడ నొసంగె. దేవేంద్రుడు తన వజ్రాయుధ ప్రహారంబున పెదవులు దవుడలు చెక్కిళ్ళు బగిలియు, నొకింతయు జలింపని వాడగుటచే, నాతనికి హనుమంతుడని నామకరణంబొనర్చెను. ఆటుమీద తన వజ్రాయుధ భయము లేకుండునట్లు వరము దయచేసె. బ్రహ్మ శాశ్వత దీర్ఘాయువును, మునిశాప భయరాహిత్యమును, బ్రహ్మాస్త్రమునకు నాదర పూర్వకముగ నేడు ఘడియలు కట్టుబడియుండునట్లును వరమిచ్చెను. అగ్ని హోత్రాదులు విశేషవరములను బ్రసాదించిరి. ఇట్లు హనుమంతునకు ననేక వరంబులు లభించెను.

పిమ్మట బ్రహ్మ వాయుదేవునకు బ్రియముగ "జగత్ప్రాణా! నీ కుమారుడు విమలయశశ్శోభితుడగును. ఇతరులచే పరాజయము నొందడు ఏక వీరుడు, అద్రిధీరుడు, అఖిలజగములందు ఉదారుడు, ఆత్మతత్త్వవిచారుడు. అంతః శత్రువిజయుడునై మహా ప్రసిద్ధుడగును."

ఈతడణి మాద్యష్టసిద్ధులకు వశుడుగాక, వానిని తన వశమున నుంచు కొని, యితరులకు వానిననుగ్రహించును. మనోజవము కలవాడయి, నీతో సమానవేగము కలవాడయి, సకల బ్రహ్మాండమున సంచరించుచు సత్త్వసంప న్నుండయియుండును. కామరూపముకల్గి, వైరాగ్యనిష్కామములచే నొప్పును. అనివార్య శౌర్య, ధైర్య, దయాది సద్గుణంబులకు నితడు నెలవగు విచిత్ర క్రియల నొనర్చును తన మహిమచే ఘటనాఘటన సమర్థుండగు స్వామిభక్తి పరాయణుడయి• శ్రీరామ కార్యార్థమై పూనుకొని, రాక్షస సమూహంబును హతంబొనరించి• తన ప్రభువునకు మేలొనగూర్చును. ఇతని చిత్రవిచిత్ర వృత్తాంతములు ముందుముందు నీవే తెలిసికొనగలవు'' అని చెప్పి నిజధామం బున కేగెను.

అనంతరము వాయుదేవుడు హనుమంతుని నిజభక్తురాలగు నంజనాదేవికి నప్పగించి, యాతనికి బ్రహ్మాదులొసంగిన వరవృత్తాంతము దెల్పి ముదమొద వించి, నిజకార్యాసక్తుడయి వెడలిపోయెను.

హనుమంతుడు వేదాది విద్యలను నేర్చికొనుటకు గుతూహలము కలవాడయి త్రిమూర్తి స్వరూపుడగు సూర్యునికడకేగెను. కాని సూర్యుడు• "మహావీరా! నేనెచ్చోటను విశ్రమింపక నిరంతరము నభోమార్గంబున సంచ రింతునుగదా! నిలకడగానుండని నాకడ నీవెట్లు విద్యలధ్యయనమొనరింతువు?" అని ప్రశ్నించెను. అందులకు సమాధానముగ, నాంజనేయుడు విశ్వరూపము ధరించి, యుదయాద్రిపై నొకకాలును, నస్తాద్రిపై నొకకాలును నుంచి నిలువ బడెను• ఆతని శక్తికి మిగులనబ్బురపడి, సూర్యుడాతనికి విద్యనేర్పుటకు సమ్మ తించెను. హనుమంతుడు సర్వవిద్యాగ్రహణాభిలాషియై, సూర్యుని పురోభాగ మున నడుచుచు, శ్రమించి సర్వవిద్యల నేర్చుకొనియె. ఈ మహాత్ముడు నవ వ్యాకరణవేత్త, పలుకుటలో శబ్ద ప్రయోగమున నిరుపమానుడు. ఈ మహా పండితుడు సంగీతము నేర్చుకొని సంగీత శాస్త్రకర్తయయ్యెను. సర్వజ్ఞు వంశమున జనించినందున సర్వజ్ఞుడేయయ్యెను.

పిమ్మట హనుమంతుడు కిష్కింధకు రాజగు వాలి తమ్ముడగు సుగ్రీవు డగు వానరోత్తమునకు మంత్రియై యుండెను. వాలి సుగ్రీవుని భార్యను జెబట్టి, యాతనిని గిష్కింధనుండి వెడలిగొట్టినపుడును హనుమంతుడు విపద్దశనొందిన

తన రాజును విడిచిపోవక, యతని వెంటనే యుండెను. వాలికి దుర్గమమైన మతంగ పర్వతముపై సుగ్రీవునితో సీతకునుండి, వానితోబాటు కష్టములందు చుండెను. తన రాజునకు నాశ్వాసము గల్గించుచుండెను.

మాయాహరణ మిషచే లంకేశ్వరుడగు రావణుడు పర్ణశాలయందు నొంటరిగనున్న సీతను, బిక్షకుని రూపమున మోసగించి యపహరించి, లంకకు గొనిపోయెను. అందువలన శ్రీరాముడు సోదరుడగు లక్ష్మణునితో గూడి విల పించుచు నరణ్యమునబడి సీతనన్వేషించుచు గ్రుమ్మరుచుండెను. వారినిజూచి, సుగ్రీవుడు వారి జాడ దెలిసికొనుటకు మహాధీశాలియగు హనుమంతుని వారి కడకు బంపెను.

అంత హనుమంతుడు శ్రీరామలక్ష్మణులకడకేగి సమస్కరించి, వారు అయోధ్యాపతియగు దశరథ రాజకుమారులు శ్రీరామలక్ష్మణులని తెలిసికొనెను. తాను అంజనాతనయుడగు హనుమంతుడని తెలిపి, వారిరువురులకు తనరాజగు సుగ్రీవునితో మైత్రి యొనర్చుటకు వారిని గౌరవపురస్సరముగ మతంగ పర్వతమునకు దీసికొనిపోయి, తన రాజతో వారికి మైత్రి యొనగూర్చెను. శ్రీరాముడనిన నమితభక్తిభావము గల్గియుండెను. ఆతని శక్తిని శ్రీరాము డెఱిగెను.

అంత సుగ్రీవుడు శ్రీరామలక్ష్మణుల వృత్తాంతమును వారు సీతాన్వేష ణమునకై వనమున గ్రుమ్మరుచుండుటవిని, తనకు తన సోదరునివలన భార్యాపహరణము జరిగినట్లు వారికి తెల్పెను. శ్రీరాముని బలమును బరీక్షించెను. తమ భార్యలను తమకు గూర్చు విషయమున వారు పరస్పరము సహాయము జేసి కొనుటకు సమయమునేర్పరచుకొనిరి. శ్రీరాముడు నేర్పుగా వాలిని సంహ రించి, సుగ్రీవుని భార్యను నతనికి గూర్చి, యతనిని గిష్కింధకు రాజుగజేసి, వాలికుమారుడగు నంగదుని యువరాజుగ జేసెను.

సుగ్రీవుడు సీతను వెదకుటకై కపిసేనలను నలుదిక్కులకుబంపెను. అపుడు ఆనవాలుగ సీతకు జూపుటకు శ్రీరాముడు తన యుంగరమును హనుమంతునకిచ్చెను. తక్కిన దిశలకు బోయిన వానరులు సీతజాడ తెలియక, మఱలివచ్చిరి, కాని దక్షిణదిశకేగిన అంగద, జాంబవంత, హనుమదాదులు

మాత్రము సీతజాడ దెలియక, సుగ్రీవునకు వెఱచి, మఱలిరాక, దక్షిణ సముద్రతీరమున ప్రాయోపవేశులై యుండిరి.

అంతలో వారి సంభాషణములు విని సంపాతియనెడు జటాయువు అన్న వచ్చి, వారివలన జటాయువు మరణవార్తను, శ్రీరాముడతని కగ్నిసంస్కారము చేయుటయు నెఱింగెను. వారాతనిని బర్వతాగ్రమునకు దీసికొనిపోవగ, నాతడటనుండి చూచి సీతరావణుని లంకలో నశోకవనమున నున్నట్లు తెలిపెను. సముద్రమును లంఘించి లంక జేరుటకు హనుమంతుడే శక్తుడని జాంబవంతుడు తెల్పెను.

అపుడు హనుమంతుడు తన శక్తి సామర్థ్యములనెఱిగి శ్రీరాముని మనంబున ధ్యానించి, రివ్వున నెగిరి, సముద్రము దాటుచుండెను. హిమవంతుని పుత్రుడు మైనాకుడు దేవేంద్రునకు వెఱచి, సముద్ర గర్భమున దాగియున్న హనుమంతు డప్పర్వతముమీద నించుకసేపు విశ్రమించెను అటనుండి బయలు దేరి వెడలుచుండగ, సురసయను నామె హనుమంతుని కెదురుగావచ్చి, తన శరీరమును బెంచి, హనుమంతునకు బోవమార్గము లేకుండజేసెను. అప్పు డాంజనేయుడు సూక్ష్మరూపమునొంది, యామె శరీరమునజొచ్చి, బైటకు వచ్చి తన మార్గమున బోవుచుండెను

అంతలో ఛాయాగ్రహమొకటి యడ్డగింపగ, హనుమంతుడు దానిని సంహరించి, లంకాపట్టణము జేరెను లంక ద్వారము రక్షణకైయున్న లంకిణి (లంక) యను రాక్షసి యాంజనేయుని లంకానగరములోనికి బోనీయక, యడ్డగించెను. అంతనాతడామెతో బోరి, యామెను గొట్టి, లంకలో బ్రవేశించెను అతడు సీతకై లంకాపట్టణమంతయు గాలించిచూచెను. తుదకు అశోకవనమున రాక్షసస్త్రీ పరివేష్టితయై దుఃఖించుచున్న జానకిని గాంచెను.

హనుమంతుడు సీతకు గాపున్న రాక్షసస్త్రీలందఱు వెడలిపోయిన తఱు వాత, తానున్న వృక్షమునుండి సీతను సమీపించి, తాను శ్రీరాముని భటు డనియు, శ్రీరాముడు సేమమేయనియు ఆమెను వెదకుటకు దన్ను బంపెననియు. త్వరలో నామహావీరుడు వచ్చి యామెను గొంపోవుననియు, నామెకు దెల్పెను. తనమాటల యందామెకు విశ్వాసము గల్గించుటకై శ్రీరాముడు తనచేతి కాన

వాలుగ నిచ్చిన శ్రీరాముని నామాక్షరము గల ముద్రిక (ఉంగరము)ను సీత కొసంగెను.

సీత యపుడు హనుమంతుని నమ్మి శ్రీరాముని కుశలమడిగి, తన కష్టములను దెల్పి, త్వరలోవచ్చి తన్ను తీసుకొనివెళ్ళునట్లు శ్రీరామునితో జెప్పునట్లును, అట్లు రానిచో తాను దేహము వీడునట్లు తెలుపుమని హనుమంతునితో జెప్పి తన యానవాలుగ తన శిరోమణిని హనుమంతున కిచ్చి పంపెను.

అంత హనుమంతుడు బయలుదేరి వెడలుచు రావణుని యెడ గల యలక్ష్యభావముచే నతడు అశోకవనమును ధ్వంసము చేసెను. అది విని, రావణుడాతని శిక్షించుటకు తన భటులను వానిపైకి బంపగ, నా మహావీరుడు వారలను సంహరించెను. అదివిని రాక్షసేశ్వరుడు వానితో యుద్ధము చేసి వానినిసంహరించుటకు జంబుమాలిని, అక్షయకుమారుని బంపెను. హనుమంతుడు వారిరువురను జంపివేసెను.

పిమ్మట రావణాసురుని రెండవ కుమారుడగు నింద్రజిత్తు హనుమంతునితో యుద్ధమునకు వచ్చి యాతనిపై బ్రహ్మాస్త్రము బ్రయోగించె. అతడ మ్మహాస్త్రమునకు బద్ధుడగుటచే వానిని నింద్రజిత్తు బంధించి, రావణుని కడకు దీసికొనిపోయెను. ఆ వానరుని పరాక్రమమునకు నా లంకేశ్వరు డబ్బురపడి వానితో సంభాషించెను. బ్రహ్మను బ్రార్థించి, యాతడు ఏడు గడియల తరు వాత విముక్తినొందెను. హనుమంతుడు రావణుని ధిక్కరించి, సీతను దొంగ తనముగ తెచ్చినందులకతనిని దూషించెను. దూతగా వచ్చిన వానిని జంప రాదని నిర్ణయించి, క్రుద్ధుడగు రావణుడు వానికి బ్రియమగు వాలమునకు వస్త్రములు చుట్టి నిప్పంటించునట్లు తన భటులకాజ్ఞ యిచ్చెను.

రావణుని భటులు హనుమంతునకాశిక్ష నొసంగిరి. అంత నా శివాంశ భవుడు వాయ్వగ్ని దేవులను బ్రార్థించి, సీతయున్న, యశోకవనమును, రావణుని సోదరుడును యోగ్యుడునగు విభీషణుని గృహమును విడిచి, లంక నంతను కాల్చివేసెను. సీతను జూచిరమ్మని పంపగ హనుమంతుడట్లు లంకను గాల్చివేసెను. పిమ్మట నతడు మరల సీతాదేవిని సందర్శించి యామెకడ

సెలవు దీసికొని సాగరమున వాలమును జల్లార్చుకొని సాగరమును దాటి, కిష్కింధకు వచ్చెను సీతా వియోగదుఃఖమును మిక్కుటముగ నందుచున్న శ్రీరాముని గాంచి యానవ వ్యాకరణవేత్త "కంటిని సీతను" అని పల్కి యతని ప్రాణములు నిల్పి, పరమానందము గూర్చెను. సీత శిరోమణి గూడ నొసంగి, శ్రీరాముని గాఢ పరిష్వంగ భాగ్యమునందెను.

అంత సుగ్రీవుడు మహావానర భల్లూక సైన్యమును సమీకరింపగ, నా సేనతో శ్రీరామ లక్ష్మణులును, సుగ్రీవుడును లంకపై దండయాత్రకు బయలుదేరిరి. శ్రీరాముడు దక్షిణ సముద్రతీరమును జేరి యా సాగర మా సేనతో దాటుట యెట్లాయిని యోచించెను. ఇంతలో రావణునిచే వెడలగొట్టబడిన విభీషణుడు వచ్చి శరణమొందె. ఆతడు చెప్పినట్లు శ్రీరాముడు సాగరుని ప్రార్థించెను. కాని యాతడు లెక్కచేయనందున, శ్రీరాముడు సముద్రునిపై విల్లెక్కిడగా సాగరుడు భయభక్తులతో ప్రత్యక్షమై సముద్రమునకు సేతువు కట్టు నుపాయమును దెల్పి. తాను సహాయపడునట్లు తెల్పి, యదృశ్యుడయ్యెను.

అంత శ్రీరాముడు వానరులలోని నలుడు మున్నగు నిపుణుల సాయమున నా సాగరమునకు సేతువు నిర్మించెను తత్సమయమున హనుమంతుడు పెక్కు బండలను, కొండలను దెచ్చి సముద్రమున బడవేసి ఆశ్చర్యము కల్గించెను. దాని మూలమున శ్రీరాముడు సోదర సుగ్రీవులతోను, బ్రహ్మాండమగు వానరసేనతోను సాగరమును దాటి, లంకలో ప్రవేశించెను. హనుమంతుడు శ్రీరామునకు వాహనమయ్యెను. శ్రీరాముడు విజయము నందుటకై, యాదిత్య హృదయమును బఠించెను.

రామ రావణ యుద్ధము మహా ఘోరముగనుండెను. పెక్కుమంది రాక్షస సైనికులును, వారి నాయకులు హతులగుచుండిరి. రావణుని సోదరుడు కుంభకర్ణుడు ఘోరయుద్ధముజేసి రామునిచే హతుడయ్యెను. అంత నింద్రజిత్తు పాతాళమున నొక ఘోర హోమమొనరించుచుండ నంగదుడు దానిని భంగమొనర్చెను. ఇంద్రజిత్తు హోమ కుండము నుండి లభించిన బంగారు రథము నెక్కి వచ్చి, రామ లక్ష్మణులతో బోరసాగెను. ఆతడు వారిపై నాగాస్త్రమును ప్రయోగింప వారు మూర్ఛనొందిరి. రాముడు మూర్ఛనొందిన కొలది సేపటికే తెప్పరిల్లి లేచెను. కాని లక్ష్మణుడెంత సేపటికిని తెప్పరిల్లనందున రాముడు

పరితపించి, నారదుని సూచన ప్రకారము గరుడుని ప్రార్థించెను. గరుడుని దయచే లక్ష్మణుడు తెప్పరిల్లి లేచెను. హనుమంతుడు పెక్కు రక్కసుల గూల్చుచుండెను.

అంత రావణుడే యుద్ధరంగమునకు వచ్చెను. రామరావణులకు మహా ఘోరయుద్ధము జరుగుచుండెను. అసదృసమైన యా యుద్ధమున పెక్కుమంది వానరులును రాక్షసులును మరణించిరి. కాని రాముని వానరసైనికులు అమృత సేవనమున బ్రదికిరి. రావణుడు మహాక్రుద్ధుడై శ్రీరామలక్ష్మణులపై క్రూర నారాచములు ప్రయోగించెను. రాముడు వానిని ఖండించి నిల్చెను. కాని లక్ష్మణుడు మూర్ఛనొందెను. రాముడు మిగుల విలపించుచుండెను.

అంత హనుమంతుడు సంజీవి దెచ్చుటకు ద్రోణగిరి కేగుచుండగ, రావణుని పంపున కాలనేమియను రక్కసుడు హనుమంతుని కంటె ముందు యేగి, మాయముని వేషము ధరించి, ద్రోణాచల సమీపమున కపట తప మొనరించుచుండెను. ఆతడు హనుమంతుని గాంచి తాను రామ భక్తుడేయని తెల్పి, పిపాస తీరుటకై యాతనిని సమీపమునందలి యొక కొలను నందలి జలమును ద్రాగుమనెను. ఆ మడువున హనుమంతుడు జలపానార్థమై దిగి నంతనే యందలి యొక క్రూరమకరము ఆతనిని బట్టికొనగ, ఆతడు దానిని సంహరింపగా, నది శాపవిమోచనమొంది, ధాన్యమాలియను దివ్యాంగనయై లేచి, తన వృత్తాంత మెరింగించి కాలనేమి మోసము దెల్పి, దేవలోకమున కేగెను.

అటు పిమ్మట హనుమంతుడు కాలనేమి కడకుబోయి వానిని సంహరించెను. పిమ్మట సంజీవిని దెచ్చుటకు బోవగ, నటకాపున్న గంధర్వులు వానిని నడ్డగించిరి. కాని హనుమంతుడు వారితోబోరి, వారినోడించె. ద్రోణగిరిపైనుండు సంజీవినీ యోషధులను నతడు గుర్తింపలేక, యాలోచించి, యా ద్రోణగిరినే పెకిలించి తీసుకొని వచ్చుచుండెను.

అంత రావణుడెఱిగి హనుమంతుని నడ్డగించుటకు మాల్యవంతుడను తన వృద్ధ మంత్రిని బంపెను. సపరివారముగ ఆతడు పోయి హనుమంతు నెదిరించెను. హనుమంతు డొకచేత ద్రోణగిరిని ధరించియే, యాతనితో బోరి,

ససైన్యముగ నాతని నోడించి, పాలఁద్రోలి ద్రోణ పర్వతమును దెచ్చి రాముని ముందుంచెను. రాముడు అందలి సంజీవిని యోషధుల మూలమున లక్ష్మణుని దెప్పరిల్ల జేసి, యానందించెను. హనుమంతుని మహోపకారమునకు నాతనిని నాదరించెను.

పిమ్మట లీలాశివుడగు హనుమంతుడు ఖడ్గవీరాదులగు పెక్కు రక్కసులతో బోరి, వారిని యమసదనమున కంపెను. పిమ్మట రావణుని శిరముల ఖండించినను, నవి మఱల మొలచుచుండుట జూచి, విభీషణుడు రావణుని నాభి స్థానమందలి యమృత కలశమును ఛేదింపుమని రామునకు దెల్పెను. రాముడట్లే యొనర్చి, రావణుని సంహరించెను. ఈ శుభవార్తను హనుమంతుడే సంతోషమున వేగముగ బోయి, జానకికి దెల్పి, యామె మనస్తాపము నడంచి, మోదమందజేసెను. ఆ తరువాత హనుమంతుడు శ్రీరాముని పంపున శీఘ్రగమనమున శృంగిబేరిపురమునకేగి, శ్రీరామ భక్తావతంసుడగు గుహునకు విజయుడై సీతా సమేతుడుగ విమానమున వచ్చుచున్నాడని తెల్పి, యాతని కానందము గల్గించెను.

శ్రీరాముని రాకకై యా పదునాల్గు సంవత్సరములు గడిచిన మఱునాడు శ్రీరాముడు మఱలిరానిచో, నగ్నిముఖమున దేహత్యాగము జేయ నందిగ్రామమున సిద్ధముగనున్న శ్రీరామ పాదభక్తవరేణ్యుడగు భరతునకు శ్రీరాముని శుభాగమన వార్తను దెల్పి, యాతని మహానందమొనగూర్చి, యతని యసువుల నిల్పెను.

అంతలో శ్రీరాముడు సీతాలక్ష్మణ సుగ్రీవ జాంబవద్విభీషణాది సమేతుడై నందిగ్రామము వచ్చి, భరతున కానందమొనగూర్చెను. అయోధ్యకేగి, పట్టాభిషేకము నొంది, వంశ పరంపరగా జ్యేష్ఠానుక్రమమున వచ్చుచున్న కోసలరాజ్య భారమును వహించె.

శ్రీరాముని పట్టాభిషేక మహోత్సవము బ్రహ్మానందముగ జరిగెను. శ్రీరాముడు మునివరులకు, బ్రాహ్మణోత్తములకు, సుగ్రీవజాంబవతాదులకు సువర్ణ మణిభూషణాంబరములు నొసంగి గౌరవించి వారిని సాగనంపెను. కాని తనకు బెక్కు ప్రాణసంకట సమయములందు మహోపకారమొనర్చిన

వాడును, తన పాదసమాశ్రితుడైయున్న దాసాంజనేయునకు మాత్రము ఆ సంతోష సమయమున శ్రీరాముడెట్టి పారితోషిక మీయకుండెను.

సీతాదేవి యా విషయము నెఱింగి శ్రీరాముని జూచి, "నాథా! మీరు అందరికి నన్ని విధములకు పారితోషికముల నొసంగియున్నారు. కాని మన యాప్త బంధువుడగు నీ సేవక హనుమంతునకెట్టి పురస్కారము నీయకుంటిరి. కారణమేమియో దయతో సెలవిత్తురా?" యని ప్రశ్నించెను. అందులకు శ్రీరాముడు "ప్రేయసీ! యీతడు మర్కటము గదా! వానరస్వభావముచే నేవస్తువునైనను నీతడు బ్రద్ధలుగొట్టి పాడుచేయును గదా! అట్టిచో నీతనికేమి పారితోషిక మొసంగిన ప్రయోజనమేమి యని యీతనికి నేనెట్టి పారితోషిక మీయకుంటినేగాని, వేఱుకారణ మెద్దియు లేదు" అని సమాధాన మిచ్చెను.

కాని సీతాదేవి యా సమాధానము నంగీకరింపక, యీతడు తమ కత్యంత ప్రియభక్తుడు గాన, నాతనికి దగిన పారితోషికము నిచ్చితీరవలెనని పట్టుబట్టగ, సర్వజ్ఞుడగు శ్రీరాముడొక యమూల్య నవరత్నహారము నాతని మెడయందువేసి మందహాసమొనరించెను.

కాని హనుమంతుడాహారమును దీసి, యందలి ప్రతి రత్నమును దీసి, యొక శిలతో బగులగొట్టి పరీక్షించి చూచి, యావల పారవేయుచుండెను. అది చూచి శ్రీరాముడు సీతాదేవిని చూచి, "ప్రేయసీ! చూచితివా? నేను జెప్పి నట్లే చేసినాడు. నీవీతనికి పారితోషిక మిచ్చుదాక నన్ను బాధించితివి. ఏమి ప్రయోజనము?" అని పల్కెను.

అప్పుడమ్మహాదేవి హనుమంతుంజూచి. "ఆంజనేయా! ఏమిది? ఇట్లొనర్చితివి. నా మాట దక్కింపక, శ్రీరాములు పల్కినట్లే నీ సహజ చాపల్యమున నీ నవరత్నహారమును బాడుచేసితివే" యని పల్కెను. అంత హనుమంతు డామెంగాంచి, "అమ్మా! నాకు బహూకరించిన రత్నహారము నందలి యే మణియందైనను శ్రీరామతారకనామము గాని, మఱియే పర మార్థత్వముగాని, యుండునేమోయని నేనత్యంతాశక్తితో బ్రతిరత్నమును బగులగొట్టి, పరిశీలించితిని గాని నాకు దేనియందును నవి గనుపించనందున, నవి నాకు నిరుపయోగములని పారవేసితిని క్షమింపుడు" అని భక్తి వినయము లతో సమాధానమిచ్చెను.

అంత నమ్మహాదేవి శ్రీరాములగాంచి, "నాథా! ఈ భక్తశ్రేష్ఠునకు మీరట్టి హారము నిచ్చితిరేల!" అని యడిగెను. శ్రీరామచంద్రుండంత మంద స్మిత వదనారవిందుండై, కొంత తడవు మౌనముగ నూరకుండెను. అంత నమ్మహానుభావుడు చతుర్వేదోపనిషణ్మహావాక్య రత్నావళియను నొక హారంబు మరల నాతని కంఠాభరణంబుగ జేసె (ఉపదేశించెను.)

హనుమంతుడు వెనుకటివలెనే యప్పుడును తనకు శ్రీరామ ప్రభువు బహూకరించిన యానూతన హారము దీసి, యందలి ప్రతిమహావాక్యరత్న మను దీసి, భేదించిచూడగ, ప్రతి రత్నమందును తత్త్వమస్యాది మహా వాక్యలక్షితుడైన పరమాత్మని తత్త్వమును, అచ్చటచ్చట శ్రీరాముని తారక నామమును గానిపించెను. అప్పుడా లీలాశివుడాహారమును మహానందముతో గంఠమును ధరించి, "ధన్యుడనైతి"నని పొంగిపోయెను. (అనగా నమ్మహా వాక్యసహాయమున నా హనుమంతుడు పరమాత్మను సంధానము చేసి, సాక్షా త్పరబ్రహ్మ స్వరూపుడయ్యెను. ఆ విషయమున సీతారాములొనర్చిన బోధయు నమ్మహాత్మునకు మిగుల నుపకరించెను )

హనుమంతుడు చిరంజీవియై శ్రీరామావతార సమాప్త్యనంతరము గూడ నుండెను. నేటికిని నా లీలాశివుడు శ్రీరామ కీర్తనము జరుపబడు ప్రదేశమున ("శ్రీరామ! జయరామ! జయ! జయ! రామ!" యని సంకీర్తనము చేయ బడుచోట) శిరమున నంజలి ఘటించి, యానందాశ్రువులనించుచు, పరవశుడై జన మధ్యమున నొక వృద్ధుని రూపము నుండి, యా సంకీర్తనము ముగియ బోవు ముందు అటనుండి, నిష్క్రమించి, యదృశ్యుడగునట.

ద్వాపర యుగమున పాండవులు వనవాస దీక్ష గడుపుచున్న సమయ మున వాయుపుత్రుడగు భీముడు ద్రౌపది కోరిక దీర్చుటకు మహా పరిమళ యుక్తమగు సౌగంధిక పుష్పమును దెచ్చుటకు, నప్పుష్పములుండు కొలనున కేగుచుండగా నాతని బలము బరీక్షించుటకు వాయుపుత్రుడా వాయుపుత్రుని మార్గమున కడ్డముగ తన వాలమును చాపుకొని కూర్చుండెను. భీముడు వాలమును దీసి తనకు మార్గమిమ్మని యీ లీలాశివుడగు హనుమంతుని కోరెను. అందులకితడు "నాయనా! నేను వృద్ధుడను. నీవే నాతోకను ప్రక్కకు దీసి, వెళ్ళుము" అని చెప్పెను. అతడు లీలాశివుడని తెలియక, యాతడు

సామాన్య వానరమనియే భావించి, తన యెడమచేతిలో నావాలమును దొలగింప జూచెను కాని యది కదలనందున దన రెండు చేతులతో యావచ్ఛక్తినుపయోగించి, ప్రయత్నించి చూచెను అయినను నా వాలమును భీముడు కదిలింపలేక పోయి యాశ్చర్యపడి, యప్పుడవ్వానరము వాయుపుత్రుడగు శివవీర్య సముద్భవుడు నగు హనుమంతుడని తెలిసికొని, యమ్మహాత్మునకు నమస్కరించెను. తన యపరాధమునకు క్షమింపుమని వేడికొనెను.

అంత హనుమంతుడు ప్రసన్నుడయ్యెను. తన పూర్వరూపమాతనికి జూపెను. ఆతని నాదరమున గౌగిలించుకొని యాశీర్వదించెను. సౌగంధికమును గ్రహించి ద్రౌపదికి నొసంగి, సంతుష్టగనొచెచ్చెను.

ఇట్లు "లీలాశివుడగు హనుమానుని గూర్చి యెంతయైన చెప్పవచ్చు" నని సూతుండు శౌనకాది మహామునులకు శ్రవణానందకరముగ శివుని హనుమదవతార లీలను వర్ణించి "యీ హనుమద్వృత్తాంతమును వినినను, చదివినను, వ్రాసినను సకలకార్యసిద్ధియు, సర్వ సుఖప్రాప్తియు దీర్ఘాయురారోగ్యము, బ్రహ్మజ్ఞానము నొంది జనులు శివలోకమున కేగుదురు" అని చెప్పెను.

[పూర్వము గార్దభనిస్వనుడు అనుదైత్య శేఖరుడుండెను. ఆతడు మహా బలశాలి భయంకరుడు. లోకకంటకుడు కాని మహా శివభక్తుడు. ఆతని బాధ పడలేక దేవతలు బ్రహ్మ, విష్ణువులను దీసికొని, శంకరుని కడకేగిరి. ఆ రాక్షసుని సంహరించి జగత్తునకు హితము చేయుమని విష్ణువు శివుని నడుగగ, తన భక్తుడగు నాతని దాను సంహరింపననియు, నితరులు నాతనిని జంపలేరనియు నమ్మహేశుడు పలికెను.

అంత విష్ణువు తానే యా రక్కసుని సంహరింతుననెను. అట్లు విష్ణువారక్కసుని చంపగల్గుచో తానా దేవునకు దాస్యము చేయునట్లు శివుడును, తానా గార్దభనిస్వనుని జంపలేకపోయినచో, దాను శివునకు దాసుడగునట్లు విష్ణువును ప్రతిజ్ఞలు చేసికొనిరి.

అనంతరము విష్ణువు తానొక మహాసుందరీ రూపమును ధరించి, యా రాక్షసుని నాకర్షించెను. అంత నాతడామాయాసుందరిం జేరి, యామె యిచ్చిన

మధువును గ్రోలి దేహస్మృతి లేనివాడై నేలబడి దొర్లుచుండెను. అంత విష్ణువు ఆ సుందరీరూపము వీడి యొక పెద్ద తోడేలు రూపమును ధరించి, యాదను జవరుని జంపి మ్రింగి, నిజరూపము ధరించెను. అప్పుడు మహాదేవుడు వచ్చి విష్ణువునకు దాను దాసుడై యుండునట్లు తెల్పెను

అందులకు విష్ణువు ''దేవదేవా! బ్రహ్మాదులమగు మేమందఱము నీ యంశవలనే జనించితిమి. మాకు నీవే యధిపతివి గదా! నీచే నేనెట్లు సేవల గొందు''నని పల్కి, ''నేను రావణాసుర సంహారమునకై శ్రీరామావతారము ధరించినపుడు నీవు కోరినట్లు, హనుమద్రూపమున నాకు సఖుడవై, సేవకుడవై, సహాయమొనరింపుము. అందువలన నీ ప్రతినయు నెఱవేరును. నాకు కార్య సిద్ధియు గల్గుననెను.

అందులకు శివుడంగీకరించెను.

తత్కారణముననే శివుడు హనుమంతుని రూపమెత్తి శ్రీరామునకు దాసుడయ్యెనని యొక పురాణగాథ గలదు]

ఈ శివాంశజుడగు హనుమంతుడే పాండుపుత్రుడగు అర్జునుని పతాకముపై వెలసియుండెను.

ఓం తత్సత్





# లింగములు - వాని వివరములు - మహిమలు

శ్రీ మహాదేవుని లింగములు పెక్కులుగ విలసిల్లెను. అందు భూలోకంబున భారతదేశంబున జ్యోతిర్లింగములు, ఉపజ్యోతిర్లింగములు, పూర్వదిగ్లింగములు, దక్షిణ దిగ్లింగములు, పశ్చిమ దిగ్లింగములు, ఉత్తర దిగ్లింగములు, పంచభూత లింగములు, పంచారామ లింగములు, ప్రతీచీ దిగ్లింగములు, ఉదీచీ దిగ్లింగములుగ వెలసి యర్చింపబడుచున్నవి.

వివరములు :—జ్యోతిర్లింగములు పండ్రెండు. వీనిని ద్వాదశ జ్యోతిర్లింగము లందురు. అవి :—

1) శ్రీ సోమనాథ లింగము:- సౌరాష్ట్ర దేశమున ప్రభాస క్షేత్రమునందు కలదు.

2) శ్రీ మల్లికార్జున లింగము:- ఆంధ్ర రాష్ట్రమున కృష్ణానదీ తీరమున కలదు. అది శ్రీగిరియను మహాపర్వతమధ్య నున్నది. దీనిని దక్షిణ కైలాసమని ప్రశస్తి.

3) శ్రీ మహాకాల లింగము:- మాల్వా ప్రదేశమున శిప్రానదీ తీరమున ఉజ్జయనీ నగరమందు గలదు.

4) శ్రీ ఓంకార లింగము:- మాల్వా ప్రాంతమున నర్మదానదీ తీరమున కలదు.

5) శ్రీ వైద్యనాథ లింగము:- హైదరాబాదుకు పడమరదిశగా పోవు రైలుమార్గమున చివరనున్న పరలీ స్టేషనుకు కొద్ది దూరమునగల పరలీ గ్రామ సమీపమందు గలదు.

6) శ్రీ భీమశంకర లింగము:- సహ్యపర్వతముపై భీమానదీ తీరమున గలదు.

7) శ్రీ రామేశ్వర లింగము:- తమిళనాడులోని రామనాధ్ జిల్లాకు చెందిన రామేశ్వరమను క్షేత్రమున సముద్రతీరమున విరాజిల్లుచున్నది.

8) శ్రీ నాగేశ్వర లింగము:- బరోడా ప్రాంతమున గోమతీ ద్వారక సమీపమున గలదు.

9) శ్రీ విశ్వేశ్వర లింగము:- కాశికాపురియందు శోభిల్లుచున్నది.

10) శ్రీ త్ర్యంబక లింగము:- బొంబాయి రాష్ట్రములోని నాసిక్ జిల్లాయందు బ్రహ్మగిరికి సమీపమున గోదావరీ నదీతీరమున గలదు.

11) శ్రీ కేదార లింగము:- హిమాలయముపై కేదార శిఖరముపై విరాజిల్లుచున్నది.

12) శ్రీఘుశ్మేశ లింగము:- దౌలతాబాదు స్టేషనునుండి 12 మైళ్ళ దూరమున బేరూల్ గ్రామ సమీపమున గలదు. శ్రీ ఘుశ్మేశ్వరునే ఘుసుణేశ్వరుడనియు, ఘుష్ణేశ్వరుడనియు పిలుచుచున్నారు.

ఉపజ్యోతిర్లింగములు-9 :

ఉపజ్యోతిర్లింగములను నవ ఉపజ్యోతిర్లింగములని పిలుతురు

1) శ్రీ అంతకేశ లింగము:- సోమనాధ లింగమునకు ఉపజ్యోతిర్లింగము-వసుమతీ సాగరసంగమందు గలదు

2) శ్రీ రుద్రేశ్వర లింగము:- మల్లికార్జున లింగమునకు ఉపజ్యోతిర్లింగము-భృగుకక్షయందు గలదు.

3) శ్రీ దుగ్గేశ లింగము:- మహాకాల లింగమునకు ఉపజ్యోతిర్లింగము-నర్మదా నదీతీరమున గలదు.

4) శ్రీ కర్దమేశ లింగము:- ఓంకార లింగమునకు ఉపజ్యోతిర్లింగము-బిందుసరంబందు యొప్పుచున్నది.

5) శ్రీ భూతేశ లింగము:- కేదార లింగమునకు ఉపజ్యోతిర్లింగమై యమునాతీరమున గలదు.

6) శ్రీ భీమేశ్వర లింగము:- భీమశంకర లింగమునకు ఉపజ్యోతిర్లింగమై మల్లికా సరస్వతీ తీరమున వెలయుచున్నది.

7) శ్రీ పూతేశ్వర లింగము:- నాగేశ్వర లింగమునకు ఉపజ్యోతిర్లింగమై మల్లికా సరస్వతీ తీరమున వెలయుచున్నది.

8) శ్రీ వ్యాఘ్రేశ్వర లింగము:- ఘుశ్మేశ లింగమునకు ఉపజ్యోతిర్లింగమై యొప్పుచున్నది.

9) గుహేశ్వర లింగము:- శ్రీ రామేశ్వర లింగమునకు జాతమగు ఉప జ్యోతిర్లింగమై ప్రశస్తి నొందుచున్నది.

పంచభూత లింగములు :

1) పృథ్వీ లింగము :- కంచియందలి ఏకామ్రేశ్వర లింగము.

2) జల లింగము:- జంబుకేశ్వర క్షేత్రములోని జంబుకేశ్వర లింగము.

3) తేజోలింగము :- తిరువణ్ణామలలోని అరుణాచలేశ్వర లింగము.

4) వాయులింగము :- శ్రీ కాళహస్తి క్షేత్రములోని శ్రీకాళహస్తీశ్వర లింగము.

5) ఆకాశలింగము :- చిదంబరములోని నటరాజస్వామి. (ఇచట లింగము కన్పింపదు)

పంచారామలింగములు :

1) ద్రాక్షారామమున భీమేశ్వరలింగము ఆయనదేవి మాణిక్యాంబ. ఆ లింగసమీపమున రామేశ్వర, అగస్త్యేశ్వర, గణేశ్వర, భైరవేశ్వర, నాకులేశ్వరములనెడు లింగంబులుండును

2) కుమారారామము (సామర్లకోట)న కుమార ప్రతిష్ఠిత కుమార భీమేశ్వర లింగము.

3) సోమరామమున సోమప్రతిష్ఠి సోమలింగము.

4) క్షీరారామము (పాలకొల్లు)న శ్రీరామ ప్రతిష్ఠిత శ్రీరామలింగము.

5) అమరారామము (కృష్ణాతీరము)న (అమరావతి) అమరేంద్ర స్థాపిత అమరేశ్వర లింగము.

పూర్వదిగ్లింగములు :

సంగమేశలింగము :- గంగానదీ సాగరమున సంగమించుచోట నున్నది.

నాగేశ్వరలింగము :- కౌశికీనదీతీరమున నొప్పియున్నది. సిద్ధనాథ లింగము.

ప్రభులింగము :- గండకీతీరమున గలదు.

భర్గలింగము :- ఫల్గునీ నదీతీరమున గలదు

కుమారేశ్వరలింగము :- తప్తా నదీతీరమున గలదు.

బ్రహ్మలింగము :- మాధవేశ్వరతో ప్రయాగక్షేత్రమున నొప్పియుండునది.

నాగేశ్వర లింగము :- అయోధ్యయందు; కపాలేశలింగము సింధు (సముద్ర)తీరమందు గలదు; వక్త్రేశ్వరలింగము, ధౌతపాపేశ్వరలింగము; భీమేశ్వరు; శ్రీ చంద్రకేశలింగము, సిద్ధేశ్వరలింగము; ఓంకారేశ్వరలింగము; జప్యేశ్వర లింగము; దూరేశ్వరలింగము; పూర్ణలింగము (పూర్ణయందు) భరద్వాజలింగము; అభకేశలింగము; శృంగారేశ్వర, సెరేశ్వర, గోపీశ్వర, వక్త్రేశ్వర, వైద్యనాథేశ్వర, వైద్యనాథేశ వామేశ్వ కామేశ్వర, విమలేశ్వర, వ్యాపేశ్వర, ఖాండేశ్వర, కేశేశ్వర, భూతేశ, శుక్లేశ్వర, సూర్యేశ్వర, సంగమేశ్వర, సులోచనేశ్వర, సిద్ధేశ్వర, నందికేశ, పుంజేశ, రామేశ, కుంభేశ, సోమేశ్వర, శూలటంకేశ్వర, సూపవేశ్వర [illegible]కేశ, గంగేశ, వటేశ, నందీశ్వర, విమలేశ్వర, కంటకేశ్వర, శరణేశ్వర కర్దమేశ్వర, అచలేశ్వర, అనంతేశ్వర, యోగీశ్వర మున్నగు లింగములు భారతదేశమున తూర్పు దిశయందు గలవు.

దక్షిణ దిగ్లింగంబులు :-

నీలగిరీశ్వరుడు - కాలంజరీ పర్వతమున, నర్మదానదీతీరస్థ పాషాణంబులన్నియు, యందు ప్రధానములు - ఆర్తేశ్వర, పరమేశ్వర, సిలహేశ్వర, శర్వేశ్వర, కుమారేశ్వర, పుండరీకేశ్వర, మండపేశ్వర, తీక్ష్ణేశ్వర, దుంధురేశ్వర, శూలేశ్వర, కుంభేశ్వర, కుబేరేశ్వర, సోమేశ్వర, మంగలేశ్వర, హనుమదేశ్వర లింగంబులు సర్వకామదంబులు మత్తహస్తిలింగము (చిత్రకూటమున), కోటీశ (దానికి తూర్పున) పశుపతీశ్వర (గోదావరీనదికి అపరదిశకు), అత్రీశ్వర, భువనేశ్వర, మఖలింగము (వంశధారా ప్రాంతమున), కుక్కుటేశ్వర రాజరాజేశ్వరి (పిఠాపురమున), మార్కండేశ్వర (రాజమహేంద్ర పురమున - గోదావరీ తీరమున), అగస్త్యేశ్వర (ధవళేశ్వరమున),

భీమేశ్వర (ద్రాక్షారామమున), కుమార భీమేశ్వర (సామర్లకోట), సోమ లింగము (గూనిపూడి) శ్రీరామ లింగము (పాలకొల్లు). అమరేశ్వర (అమరా వతి-కృష్ణాతీరం), సోమేశ్వరలింగము(కోటిపల్లి) వ్యాఘ్రేశ్వర (వ్యాఘ్రపురము) లింగము, వీరభద్ర (పట్టిసము), రాజరాజేశ్వర (వేములవాడ) లింగములు, కాలేశ్వర (కాళేశ్వరమున), మల్లికార్జున (విజయవాటికా-కృష్ణాతీరము), మహాకాల (హేలాపుర), అగస్త్యేశ (పెదన) నాగేశ్వర (కళ్ళేపల్లి - కృష్ణా సాగర సంగ మమున), బలేశ్వర (ముక్తేశ్వరపురి - కృష్ణాగర్భమున), అగస్త్యేశ్వర (ఈవని), కోటీశ్వర (ఎల్లమలిద), సాగరేశ (మాదల), ధవళేశ్వర (ధవళపురము), కపోతేశ్వర (చేజెర్ల) ఇష్టకామేశ్వర (మాచర్ల) త్రిపురాంతక, మహానందికేశ్వర, ఓంకారేశ్వ (ఓంకారమున), బ్రహ్మేశ్వర (అలకపురి నవబ్రహ్మలింగములు.)

అగస్త్యేశ్వర (సంగమేశ్వర) - (వాడపల్లి - కృష్ణా ఉత్తరతీరము), ఏలేశ్వర (శ్రీశైల ఉత్తరద్వారము), పాలంకేశ్వర (పాలంకలో), వీరభద్ర (ముదిగొండ), మహాలింగ (నిడదవెల్లివాగు), హరిహరేశ్వర (నెల్లూరు-పెన్న), శ్రీ కాళహస్తీశ్వర (వాయులింగము), త్యాగరాజ పరమేశ్వర (తిరువత్తూరు), కపాలేశ్వర (మైలాపూర్ - మద్రాసు), వేదగిరీశ్వర (వేదగిరి), ఏకామ్రేశ్వర (కంచి కామాక్షి), సిరిమాయూరేశ్వర (మాయూరము) లింగములు ; మహా లింగము (మధ్యార్జునము), ఉమామహేశ్వర (చియ్యాళికొండ), బ్రహ్మపురీశ్వర (చియ్యాలి కొండ దిగువ ; కంపహారేశ్వర ధర్మసుందరీనాధ (శరభావతార - త్రిభువనము), మార్గబంధీశ్వర (విరించిపురం), బిల్వేశ్వర (తిరువళ), వైద్యేశ్వర (వైద్యనాథము), అరుణాచలేశ్వర (అరుణాచలం), నటేశ్వర (చిదంబరము), కుంభేశ్వర (కుంభకోణము), (అచటనే బృహిద్మిఖుడు నాగ లింగం సోమేశ్వరుడు మొదలగు లింగములు గలవు.) జంబుకేశ్వర (జంబుకేశ్వర క్షేత్రము,) మాతృభూతేశ్వర (తిరుచునాపల్లి), పంచనాదేశ్వర (తిరువైయూరు), సుందరేశ్వర (మధుర), అరుణజటేశ్వర (తిరువణందారు), మంగళేశ్వర (ఉత్తరకోశము), విశ్వేశ (రామేశ్వరం), మార్కండేయేశ్వర (కడలూరు) లింగములు. దక్షిణ భారతమున గలవు.

ప్రతీచిదిగ్లింగములు :- నంజుండేశ (మైసూరున). విరూపాక్షేశ్వర (పంపాసరస్సుకడ) మహాబలుడు (పడమటి సముద్రతీరమున ఉడిపికి 125మైళ్ళ

దూరమున కల గోకర్ణమున), మహాదేవ (ద్వారకా), కాలరామనాథ (కపలా నగరము) మహాసిద్ధేశ (పడమర సముద్రతీరము), వాలుకేశ (మహామాయనగరి) (సముద్రతీరము కొండపై మఱొక లింగము); బాబుల్‌నాథ (కొండమీద), పాండురంగేశ్వర (పండరి) లింగములును పశ్చిమ భారతమున గలవు.

ఉదీచీదిగ్లింగములు :— పంచవక్త్రేశ్వరుడు హరిద్వారమున విరాజిల్లును.— దక్షేశ్వర లింగము అచటికి కొలది దూరమున ఉత్తరమున కనఖిలమున నుండును. వైద్యేశ్వరము అపరగోకర్ణేశ్వరమనబడును. మహావనమున రావణ ప్రతిష్ఠమైనొప్పును. ఇది ద్వాదశ జ్యోతిర్లింగములలో నొకటి (చంద్రఫాల నాథ).

దాధీచి శివలింగము మిశ్రఋష్టివర తీర్థమందురాజిల్లును. ఋషీశలింగము నైమిశారణ్యమున శోభిల్లును. సత్యద్యుతి శివలింగము నైమిశారణ్యముననే విరాజిల్లును. లలితేశ్వర లింగము దేవప్రయోగతీర్థమున నొప్పును. పశుపతీశ్వర లింగము నేపాలులో శోభిల్లును. ఇచట శిరస్సు కనబడును. — కేదారేశ లింగము పూర్వకాయము కేదారవనమున నగుపించును.

ముక్తినాథలింగము గండకితీరమున శోభిల్లును. అమరనాథలింగము. — కాశ్మీరమునకు తూర్పున నొప్పును.

తారకేశ్వరుడు వంగదేశ సమీపమున విరాజిల్లును, అని సూతపౌరాణికుడు చెప్పగవిని శౌనికాది మహర్షులు సంతసించిరి. ఈ లింగశ్రీ వివరములు వినినవారు, చదివినవారు, వ్రాసినవారు ఇహపరసుఖములంది శివలోకమున నానందింతురు.

ఓం తత్సత్





### శ్రీ శంకరాచార్య కృత

# ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రము

### మరియు

# జ్యోతిర్లింగాని (ద్వాదశ) మహిమలు

1) సౌరాష్ట్రదేశే విశదేఽతిరమ్యే । జ్యోతిర్మయం చంద్రకళావతంసమ్,
భక్తిప్రదానాయ కృపావతీర్ణం । తం సోమనాథం శరణం ప్రపద్యే ॥

2) శ్రీశైలసంగే విబుధాతిసంగే । తులాద్రితుంగేఽతి ముదావసంతమ్,
తమర్జునం మల్లికపూర్వమేకం । నమామి సంసార సముద్ర సేతుమ్ ॥

3) అవంతికాయాం విహితావతారం । ముక్తి ప్రదానాయచ సజ్జనానామ్,
అకాలమృత్యోః పరిరక్షణార్థం । వందే మహాకాళ మహామరేశమ్ ॥

4) కావేరికా నర్మదయోః పవిత్రే । రమాగమే సజ్జన కారణాయ,
సదైవమాంధాతృ పురేవసంత । మోంకారమీశం శివమేకమీడే ॥

5) మహాద్రిపార్శ్వేచ తటేరమంతం । సంపూజ్యమానం సతతంమునీంద్రైః,
సురాసురైర్యక్ష మహోరగాద్యైః । కేదారమీశం శివమీశమీడే ॥

6) యోడాకినీశాకినికా సమాజైః । నిషేవ్యమాణః పిశితాశవైశ్చ,
సదైవభీమాది పదప్రసిద్ధం । తం శంకరం భక్తహితం నమామి ॥

7) సానందమానంద వనేవసంత । మానందకందం హతపాపబృందమ్,
వారాణసీనాథ మనాథనాథం । శ్రీ విశ్వనాథం శరణం ప్రపద్యే ॥

8) సహ్యాద్రిశీర్షే విమలే వసన్తం । గోదావరీతీర పవిత్రదేశే,
యద్దర్శనాత్పాతక మాశు నాశం । ప్రయాతితం త్ర్యంబకమీశమీడే ॥

9) పూర్వోత్తరే ప్రజ్వలికానిధానే । సదా వసంతం గిరిజాసమేతమ్,
సురాసురా రాధితపాదపద్మం । శ్రీ వైద్యనాథం తమహం నమామి ॥

10) యామ్యేసదంగే నగరేఽతి రమ్యే । విభూషితాంగం వివిధైశ్చభోగైః,
సద్భక్తిముక్తి ప్రదమీశ మేకం । శ్రీ నాగనాథం శరణం ప్రపద్యే ॥

11) సుతామ్రపర్ణీ జలరాశియోగే । నిబధ్య సేతుం విశిఖైరసంఖ్యైః,
శ్రీరామచంద్రేణ నమర్పితం తం । రామేశ్వరాఖ్యం నియతం నమామి ॥

12) ఇలాపురే రమ్య విశాలకేఽస్మిన్ । సముల్లసంతంచ జగద్వరేణ్యమ్,
వందే మహోదారతర స్వభావం । ఘుశ్మేశరాఖ్యం శరణం ప్రపద్యే ॥

జ్యోతిర్మయ ద్వాదశ లింగకానాం । శివాత్మనాం ప్రోక్తమిదం వరేణ ॥

ఫలశ్రుతి :- "ఇది పవిత్రమైన స్తోత్రము. జ్యోతిర్మయములైన పరమ శివ స్వరూపములైన ద్వాదశ లింగముల స్తోత్రము ఏ మానవుడైనను దీనిని పరమభక్తియుతుడై పఠించినచో ద్వాదశ జ్యోతిర్లింగ క్షేత్రములను సందర్శించుటచేత కలుగు మహాఫలము ప్రాప్తించును

ఓం తత్సత్.

ప్రాతఃకాలమున ద్వాదశ (12) జ్యోతిర్లింగములను ఒకమారు స్మరించినంతనే సప్తజన్మ కృతమైన పాపము నశించునని శివపురాణము ఇట్లు వక్కాణించుచున్నది. (రుద్రసంహిత)

## —: ద్వాదశ జ్యోతిర్లింగస్తోత్ర మణిమంజరి :—

శ్లో॥ 1. సౌరాష్ట్రే సోమనాథంచ, 2. శ్రీశైలే మల్లికార్జునమ్ ।
3. ఉజ్జయిన్యాంమహాకాల, 4. మోంకారేపరమేశ్వరమ్ ॥

శ్లో॥ 5. కేదారం హిమవత్పృష్ఠే, 6. ఢాకిన్యాం భీమశంకరమ్ ।
7. వారణస్యాంచవిశ్వేశం, 8. త్రంబకం గౌతమీతటే ॥

శ్లో॥ 9. వైద్యనాథంచితాభూమౌ, 10. నాగేశందారుకావనే।
11. సేతుబంధేచ రామేశం, 12. ఘుశ్మేశంచ శివాలయే ॥

శ్లో॥ ద్వాదశైతాని నామాని ప్రాత రుత్థాయ యఃపఠేత్।
సప్తజన్మ కృతం పాపం స్మరణేన వినశ్యతి ॥

ఈ క్రింది క్రమమున ప్రదక్షిణము గావించినచో అనగా నీ పంన్రెండు క్షేత్రములను సేవించినచో భారతదేశ పరిక్రమణము పూర్తియగును.

1. శ్రీశైలము, 2. ఘుశ్మేశ్వరము, 3. భీమశంకరము, 4. త్ర్యంబకము, 5. ఓంకారేశ్వరము 6. సోమనాథము, 7 నాగనాథము, 8. ఉజ్జయిని, 9. కేదారము, 10 కాశి, 11. వైద్యనాథము, 12. రామేశ్వరము

1. 'సౌరాష్ట్రే సోమనాథంచ'— పరమేశ్వరుని జ్యోతిర్లింగములలో మొట్టమొదటిది శ్రీ సోమనాథజ్యోతిర్లింగము. ఈ జ్యోతిర్మూర్తి సౌరాష్ట్ర దేశములో పరమపవిత్రమైన ప్రభాస క్షేత్రమున వెలుగొందుచున్నది. ప్రభాస క్షేత్రమహిమ మహాభారతమునంగు ననేకవిధముల నత్యద్భుతముగ నభివర్ణింపబడియున్నది. శాపగ్రస్తుడై-మృతతుల్యుడైన చంద్రుడు పరమశివుని వర ప్రభావమున కళానిధియై-కళాప్రపూర్ణుడై, కళకళలాడెను. సోముని సుధాకిరణములచే సర్వప్రపంచము సజీవమై-సర్వాంగసుందరమై ప్రకాశించెను.

2. 'శ్రీశైలేమల్లికార్జునమ్'— ఆంధ్రప్రదేశములో పవిత్ర కృష్ణానదీతీరమున శ్రీశైలక్షేత్రమున్నది. కైలాస పర్వతముతో సమాన మానమైన గౌరవౌన్నత్యములు కలిగి, సర్వదా దేవబృంద సంసేవ్యమానమగుటచే శ్రీశైలమునకు 'దక్షిణ కైలాస'మని ప్రసిద్ధి వచ్చినది.

మహాభారతమునందును, శివపురాణమందునను శ్రీశైల ప్రసక్తిగలదు శ్రీశైల క్షేత్రమునకేగి మల్లికార్జునుని సేవించిన వారికి అశ్వమేధయాగఫలము ప్రాప్తించునని భారత ప్రమాణము. సందర్శన మాత్రముననే సకలపాపములను వికలము చేసి అఖండ మోక్ష లక్ష్మీప్రసాదము ననుగ్రహించు పుణ్య క్షేత్రమిది.

"శ్రీశైలం శిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే"
అని పురాణములు ఘోషించుచున్నవి

3. 'ఉజ్జయిన్యాం మహాకాళమ్'— మాలవ దేశాంతరతమైన ఉజ్జయిని పట్టణములో శిప్రానదీతీరమున శ్రీ మహాకాళేశ్వర జ్యోతిర్లింగము నెలకొని యున్నది. ఉజ్జయినీ నగరమును 'అవంతిక' అనియు నందురు. భారతదేశములోని మోక్షదాయకములైన సప్తపురములలోని అవంతిక యొకటి.

సప్తపురములు :— 1. 'అయోధ్యా, 2. మధురా, 3. మాయా, 4. కాశీ, 5. కాంచీ, 6. అవంతికాపురీ, 7. ద్వారవతీ చైవ సప్తైతే మోక్షదాయకః'

స్కందమహాపురాణములోని ఆవంత్య ఖండములో ఈ నగర వైశిష్ట్యము వైభవోపేతముగా వర్ణింపబడియున్నది. మహాభారతములోను, శివపురాణములోను ఉజ్జయిని మహిమ కొనియాడబడియున్నది. శిప్రానదిలో స్నానము చేసినవారి సర్వపాపములు పటాపంచలగును. సర్వ దారిద్ర్యములు దూరమైపోవును. మహా తపోనిధియైన సాందీపని ఆశ్రమమున శ్రీకృష్ణ బలరాములు విద్యాభ్యాసమొనర్చిన పవిత్రస్థలమిది. మహాపరాక్రమోపేతుడైన విక్రమాదిత్యుని రాజధానీ నగరమిదియే. ఇచ్చటనే కాళిదాసాది మహాకవులు నవరత్నములై ప్రకాశించిరి.

4. 'ఓంకారే పరమేశ్వరమ్'— మాలవ ప్రాంతములో నర్మదా నదీతీరమున ఓంకారక్షేత్రమున్నది. ఇక్కడ నర్మదానది రెండు పాయలుగా ప్రవహించును. ఒకపాయ నర్మద. మఱొకటి కావేరిక. ఒకపాయ ఉత్తరముగాను. మఱొకపాయ దక్షిణముగాను ప్రవహించుచుండును. రెండిటి నడుమ ఒక పెద్దకొండ చట్టు ఏర్పడినది. దీనిని 'శివపురి' లేదా 'మాంధాతపురి'యని పిలుతురు.— మాంధాత సుప్రసిద్ధుడైన సూర్యవంశపురాజు ఆయన మహాభక్తుడు, మహా పురుష మహాతపస్వి. పుణ్యమూర్తి యగు మాంధాత చక్రవర్తి. ఈ పర్వశిఖరముపై అనేక వత్సరములు ఘోరతపస్సు చేసి పరమేశ్వరుని ప్రసన్నుని కావించుకొని, స్వామికి దేవాలయము నిర్మించెను. అందుచే దీనికి 'మాంధాతపురి' యని ప్రఖ్యాతి వచ్చినది.

మాంధాతా పర్వతము మీద చాల దేవాలయములున్నవి అవన్నియు ప్రణవాకారమున నుండును. ఓంకారేశ్వర దేవాలయము పర్వతము మీది బాలచంద్రునివలె ప్రకాశించుచుండును. ఓంకారేశ్వరుని సన్నిధికి వెళ్ళు మార్గమున 'విష్ణుపురి' యను మరి రెండు చిన్నచిన్న కొండగుట్టలున్నవి. ఈ రెండింటి మధ్య 'గోకపిలధార' యను నది ప్రవహించి, నర్మదానదిలో సంగమించును. ఓంకారేశ్వర దర్శనమునకు నర్మదా నదిపై నౌకాయానము చేయవలెను. శివపురాణములో నీక్షేత్రమహిమ వ్యాపకముగ నభివర్ణింపబడి యున్నది.

5. 'కేదారం హిమవత్ పృష్ఠే'— కేదారనాథ జ్యోతిర్లింగము ద్వాదశ జ్యోతిర్లింగములలో నైదవది. దర్శనమాత్రముననే సమస్తదోషములు పోగొట్టు నీ మహాశివలింగము హిమాలయమునందలి కేదార శిఖరమునకు పశ్చిమ దిశయందు 'మందాకిని'యు, తూరు దిక్కున 'అలకనంద'యు ప్రవహించుచుండును. మందాకినీ తీరమునం కేదారనాథస్వామియు, అలకనందాతీరమున బదరీనారాయణస్వామియు వెలసియున్నారు. అలకనందా, మందాకినీ నదులు 'రుద్రప్రయాగ'లో కలిసికొని కొంత దూరము ప్రవహించి 'దేవప్రయాగ' దగ్గర 'భాగీరథి'లో సంగమించుచున్నవి. అందునే గంగాస్నానము చేయు భక్తులు శ్రీ కేదారనాథ, బదరీనాథ చరణ కమలోదకములలో మునుగుచున్నట్లే భావింతురు. స్కంద పురాణమునందలి కేదారఖండమున శ్రీ కేదారేశ్వర జ్యోతిర్లింగ మహిమాతిశయము మనోహరముగ వర్ణింపబడియున్నది. ఏ యాత్రికుడైనను కేదారనాథుని సందర్శింపకయే బదరి యాత్ర చేసినచో వాని యాత్ర నిష్ఫలమని వాకొనబడినది.

"అకృత్వా దర్శనం వైశ్య కేదారస్యాఘనాశినః
యోగచ్ఛేద్ బదరీం తస్య యాత్రా నిష్ఫలతాం వ్రజేత్ ॥

కేదారేశ్వర సహితముగ నరనారాయణులను సందర్శించినవారికి సమస్త పాపములు పరాభూతములై జీవన్ముక్తి ప్రాప్తించునని నొక్కి వక్కాణింప బడినది.

"దృష్ట్వా రూపం నరస్యైవ తథా నారాయణ స్యచ
కేదారేశ్వర నామ్నశ్చ ముక్తి భాగీ నసంశయః
కేదారేశస్య భక్తా యే మార్గస్థాసస్య వైమృతాః
తేఽపి ముక్తా భవంత్యేవ నాత్రకార్యా విచారణా."

(స్కంద పురాణము)

కేదార యాత్రకై బయలుదేరిన ప్రాణి మధ్యేమార్గమున మరణించినను వానికి పుణ్యలోకములు కరతలామలకములని పురాణము లుగ్గడించుచున్నవి. కేదార క్షేత్రము హరిద్వారమునకు 160 మైళ్ళ దూరమున, హృషికేశమునకు 182 మైళ్ళ దూరమున నున్నది.

6. 'డాకిన్యాం భీమశంకరమ్'— సహ్య పర్వత శిఖరములలో నొకదాని పేరు 'డాకిని'. ఆ శిఖరాగమున పరమేశ్వరుడు భీమశంకర జ్యోతి ర్లింగ రూపముతో లోకానుగ్రహార్థము అవతరించియున్నాడు భీమానది యిచ్చ టనే జన్మించినది. ఉద్గమస్థానమున శివలింగము ప్రక్కనుండి జలము కొంచము కొంచముగా ప్రవహించుచుండును సకలజన శుభంకరుడు భీమశంక రుడై శాకినీ డాకినీ రక్షసమూహములు పరివేష్టించి సేవించుచుండ నిచ్చట సన్నిధిచేసి యున్నాడు.

7. 'వారాణస్యాంతు విశ్వేశ్వమ్'— సకల సౌభాగ్యరాశియైన కాశియందు విశ్వేశ్వర జ్యోతిర్లింగము విరాజమానమైయున్నది. కాశీక్షేత్రమునకు 'వారణాసి, వారాణసి, అవిముక్తము, ఆనందకాననము, మహాశ్మశానము, రుద్రావాసము, కాశిక, తపఃస్థలి, ముక్తిభూమి, క్షేత్రపురి, శివపురి, త్రిపురారి రాజనగరి' యను నామములు ప్రసిద్ధములు. 'వరణ', 'అసి' అను నదీ ద్వయ మిరువంకల ప్రవహించుటచే 'వారణాసి' యను నామము కాశీక్షేత్రమున కన్వర్థమగుచున్నది.

మోక్షదాయకములగు సప్తక్షేత్రములలో కాశీ ఖ్యాతిగాంచినది. వేద పురాణములలో కాశీ మహిమ వివిధరీతుల నభివర్ణితమైనది.

"అప ఇవ కాశినా సంగృహీతాః (ఋగ్వేదము) మఘవన్ కాశిరిత్తే (ఋచ్చేదము) యజ్ఞః కాశీనాం భరతః సాత్వతామివ" (శతపథ బ్రాహ్మణము).

"సాకాశీ త్రిపురారి రాజనగరీ పాయా దపాయాజ్జగత్"(కాశీఖండము).

ప్రళయకాలమున పరమేశ్వరుడు తన త్రిశూలాగ్రమున నీ నగరము నుద్ధరించునని యభిజ్ఞవచనము కాశీ క్షేత్రమున మరణించినవారికి ముక్తి కరత లామలకమని "కాశ్యాంతుమరణాన్ముక్తిః" అను సూక్తి వ్యక్తీకరించుచున్నది. ఇచ్చట మరణించు ప్రతి జీవికి విశ్వనాథుడు దక్షిణ కర్ణమున తారకమంత్రోప దేశ మొనర్చునని పురాణ ప్రమాణము

"కదా కాశీం గమిష్యామి కదా ద్రక్ష్యామి శంకరమ్
ఇతి బ్రువాణస్సతతం కాశీవాస ఫలం లభేత్."

"ఎప్పుడు కాశికి వెళ్ళుదును: ఎప్పుడు విశ్వనాథుని సందర్శింతును:" అని యెల్లప్పుడు పలుకుచున్న మాత్రముననే కాశీవాస మహాఫలము మానవునకు సంప్రాప్తించును.

"కాశి కళ్యాణముల కాదికారణంబు। కాశియణి మాదిసిద్ధుల కాటపట్టు,
కాశి జనలోక సంకల్ప కల్పవల్లి। కలుషపిశితంబు మెసవురాకాశి కాశి॥"

అని కవిసార్వభౌములు కాశిని కొనియాడినారు. కలి ప్రవేశింప దానంద కాననమున "శ్రీనివాసంబు వారణాసి పురంబు", "ముక్తి సంధాయకం బవిముక్తికంబు" అని కాశీనగరము కవుల కైవారము లందుకొన్నది. "వేద పురాణ శాస్త్ర పదవీ నదవీయసియైన పెద్దముత్తైదువ" అన్నపూర్ణా భవాని ఆకొన్నవారికి అమృతపాయసాన్నములు వారణాసీ నగరమున వడ్డించునట: కాశీక్షేత్రమున నసంఖ్యాకములగు పుణ్యతీర్థములున్నవి. వానిలో

"విశ్వేశం మాధవమ్ ఢుంఢిం దండపాణించభైరవమ్,
వందేకాశిం గుహాం గంగాం భవానీం మణికర్ణికామ్."

శ్రీ విశ్వనాథ జ్యోతిర్లింగము, బిందుమాధవుడు, కాలభైరవుడు, కుమారస్వామి, గంగ, అన్నపూర్ణాభవాని మణికర్ణిక విశేష సందర్శ నీయములు — సమారాధనీయములు.

8. "త్ర్యంబకం గౌతమీతటే" జగత్ప్రసిద్ధమైన త్ర్యంబకేశ్వర జ్యోతిర్లింగము నాసిక మండలమున సహ్యగిరి శిఖరాగ్రమున వెలసియున్నది.

తత్పరిసరమునందే పంచవటియున్నది. ఈ స్థానముననే లక్ష్మణుడు శూర్పణఖ నాసికాకర్ణములను గోసినాడట! సీతాపహరణమిచ్చోటనే జరిగినది. ఇచ్చటికి కొలది దూరమున బ్రహ్మగిరిపై గోదావరి ప్రభవించినది.

ఉత్తరభారతములో గంగానదివలె దక్షిణ భారతములో గోదావరీ స్రవంతి 'పాపవిమోచన'గా ప్రసిద్ధిగాంచినది. భగీరథుని తపఃఫలముగా భాగీరథి యవతరించినట్లే - గౌతమ మహామునిచే గొనిరాబడుటచే గోదావరికి గౌతమీ సమాఖ్య సంపన్నమైనది.

గోదావరీ గౌతమ మునీంద్రుల ప్రార్థన మన్నించి భక్తవత్సలుడైన పరమశివుండు త్ర్యంబకేశ్వరరూపములో నిచ్చట విచ్చేసియున్నాడు. త్ర్యంబకేశ్వర దేవాలయములో మూడు చిన్నచిన్న లింగాకృతులున్నవి. వీనిని బ్రహ్మ విష్ణు మహేశ్వరాత్మకములుగ భక్తులు భావింతురు త్ర్యంబకేశ్వర సందర్శన సంపూజనములవలన నైహికాముష్మిక ఫలములు ప్రాప్తించునని ప్రాజ్ఞవచనము బ్రహ్మగిరిపైనున్న 'రామకుండము' లక్ష్మణకుండము' దర్శనీయములు. దురిత పరిహారకములు. సహ్యగిరి నెక్కుటకు సువిశాలమగు నేడువందల సోపానములున్నవి. పైకెక్కినవెంటనే గోముఖ సముద్గత గోదావరి కన్నుల పండువుగా కనిపించును.

9. 'వైద్యనాథంచితాభూమౌ':— సురాసుర సమారాధిత చరణ ద్వయుడైన మృత్యుంజయుడు వైద్యనాథజ్యోతిర్లింగ రూపములో ఉత్తర భారతము నందు 'చితాభూమి' అను ప్రదేశములో సుప్రతిష్ఠితుడైయున్నాడు. సందర్శన మాత్రముననే సర్వపాపములను పరిహరించుచు స్వామి విరాజిల్లుచున్నాడు. సమస్త శారీరక మానసిక వ్యాధులను పరిమార్చు ప్రభువగుటవలన స్వామికి 'వైద్యనాథు'డను నామధేయము వచ్చినది.

10. 'నాగేశందారుకావనే' — శ్రీ నాగేశ్వర జ్యోతిర్లింగము దారుకావనములో గోమతీ ద్వారక సమీపమున వెలసియున్నది. స్వామిని దర్శించి సేవించిన వారికి శాశ్వతమైన పుణ్యలోకములు సంప్రాప్తించును. స్వామియావిర్భావకథను వినిన మాత్రముననే సకల పాతకములు శమించును. సర్వార్థములు సమకూరును.

'ఏతద్యశ్శ్రయాన్నిత్యం నాగేశోద్భవ పాదరాత్
సర్వాన్కామానియాద్ధీమాన్ మహాపాతక నాశనాత్'
(శివపురాణం)

11. 'సేతుబంధేచ రామేశమ్' — శ్రీ రామేశ్వర జ్యోతిర్లింగము దక్షిణ సముద్రతీరమున ధనుష్కోటి సమీపమున విరాజిల్లుచున్నది. రామేశ్వర మహాక్షేత్రము భారత భూమి యందలి పుణ్యక్షేత్రములలో నగ్రగణ్యము. ఈ క్షేత్రము మహిమ స్కాందపురాణములో నీక్రింది విధముగ వర్ణితమైనది.

"అస్తిరామేశ్వరం నామ రామ సేతౌప్రతిష్ఠితమ్
క్షేత్రాణామపిసర్వేషాం తీర్థానామపిచోత్తమమ్,
సేతు రామేశ్వరంలింగం గంధమాదన పర్వతమ్
చింతయన్ మనుజస్సత్యం సర్వపాపైః ప్రముచ్యతే॥"

రామేశ్వర శివలింగము ద్వాదశ జ్యోతిర్లింగములలో పదునొకండవది. ఈ శివలింగము సీతా మనోహరుడైన శ్రీరామచంద్రుని కరకమలములచే సుప్రతిష్ఠితమైనది. రామేశ్వర స్వామి దేవాలయము వెయ్యి యడుగుల పొడవును, ఆరువందల యేబది యడుగుల వెడల్పును, నూట యేబది యడుగుల యెత్తును గలిగి యనల్ప శిల్పకళాలక్ష్మీకాలవాలమై యలరారును ఇందలి నందీశ్వరుడు, రజితరథము, సర్వగోపురములు దర్శనీయములు రామతీర్థము, సేతు మాధవతీర్థము, అమృత వాటిక హనుమత్కుండము మొదలగునవి సమస్త దోషహారములు. గంగాజలములతో రామేశ్వరములో శివలింగము నభిషేకించినవారు జీవన్ముక్తులగుదురని పురాణప్రమాణము.

12. "ఘుశ్మేశంచశివాలయే":— దక్షిణ భారతమున ఘుశ్మేశ్వర జ్యోతిర్లింగము సువిరాజమానమైయున్నది. దీనికి సమీపమునందే, ప్రపంచ ప్రసిద్ధిగాంచిన 'ఎల్లోరా' గుహలున్నవి. ఇందలి కైలాసమందిర సౌందర్యము నయనానంద సంధాయకము. అనల్ప శిల్ప సంశోభితము ఘుశ్మేశ్వరుని సేవించినవారికి పునర్జన్మము లేదు. సకల సౌభాగ్యములు సంప్రాప్తించును.

సౌరాష్ట్రమున సోమనాథుడై, శ్రీశైలమున మల్లికార్జునుడై, ఉజ్జయినిని మహాకాళుడై, ఓంకారమున పరమేశ్వరుడై, హిమాచలమున కేదారనాథుడై,

డాకినిని భీమేశ్వరుడయి, వారణాసిని విశ్వేశ్వరుడయి, చితాభూమిని వైద్య నాథుడయి, సేతుబంధమున రామేశ్వరుడయి, శివాలయమున ఘుశ్మేశ్వరుడయి, శంకరుడు విజయం చేసియున్నాడు. పరమ శివసన్నిధానములను ఈ పండ్రెండు క్షేత్రములును, ద్వాదశ జ్యోతిర్లింగ క్షేత్రములుగా యుగయుగములనుండి ప్రసిద్ధిగాంచినవి.

> "ద్వాదశైతాని నామాని ప్రాతరుత్థాయ యఃపఠేత్
> సప్తజన్మ కృతం పాపం స్మరణేనవినశ్యతి॥"

అను శ్లోకమును బట్టి ఎవడు ప్రాతఃకాలమున లేచి, పై వివరింపబడిన ద్వాదశ నామములను స్మరించునో ఆతనికి శివానుగ్రహము కలిగి, సప్తజన్మ కృతపాపము నశించునని బోధపడుచున్నది.





## మంగళాచరణము

శ్లో॥ మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వం యువానం,
వరిష్ఠాన్తే వసదృషి గణైరావృతం బ్రహ్మనిష్ఠైః ।
ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్ర మానందరూపం
స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తిమీడే ॥

# శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము

శ్లో॥ విశ్వం దర్పణ దృశ్యమాన నగరీతుల్యం నిజాంతర్గతం
పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథానిద్రయా ।
యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మానమేవాద్వయం
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥ 1

శ్లో॥ బీజస్యాంతరివాంకురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పునః
మాయాకల్పిత దేశకాలకలనా వైచిత్ర్య చిత్రీకృతమ్ ।
మాయావీవ విజృంభయత్యపి మహాయోగీవయ స్స్వేచ్ఛయా
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥ 2

శ్లో॥ యస్యైవస్ఫురణం సదాత్మకమసత్కల్పార్థగం భాసతే
సాక్షాత్తత్త్వమసీతి వేదవచసా యోబోధయత్యాశ్రితాన్
యత్సాక్షాత్కరణాద్భవేన్న పునరావృత్తి ర్భవాంభోనిధౌ
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥ 3

శ్లో॥ నానాచ్ఛిద్రఘటోదరస్థిత మహాదీపప్రభా భాస్వరం
జ్ఞానంయస్యతు చక్షురాది కరణద్వారా బహిస్స్పందతే।
జానామీతి యమేవ భాన్తమనుభాత్యే తత్సమస్తంజగత్
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥ 4

శ్లో॥ దేహం ప్రాణమపీంద్రియాణ్యపి చలాం బుద్ధిం చ శూన్యం విదుః
స్త్రీ బాలాంధ జడోపమాస్త్వహ మితి భ్రాన్తా భృశం వాదినః।
మాయాశక్తి విలాస కల్పిత మహావ్యామోహ సంహారిణే
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥ 5

శ్లో॥ రాహుగ్రస్తదివాకరేందు సదృశో మాయాసమాచ్ఛాదనాత్
సన్మాత్రః కరణోపసంహరణతో యోభూత్సుషుప్తః పుమాన్।
ప్రాగస్వాప్సమితి ప్రబోధసమయే యఃప్రత్యభిజ్ఞాయతే
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥ 6

శ్లో॥ బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థాస్వపి
వ్యావృత్తాస్వను వర్తమాన మహమిత్యంతః స్ఫురంతం సదా।
స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యోభద్రయా ముద్రయా
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥ 7

శ్లో॥ విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామి సంబంధతః।
శిష్యాచార్యతయా తథైవ పితృపుత్రాద్యాత్మనా భేదతః
స్వప్నే జాగ్రతివా య ఏష పురుషో మాయా పరిభ్రామితః
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥ 8

శ్లో॥ భూరంభాంస్యనలోఽనిలోఽంబర మహర్నాథో హిమాంశుః పుమాన్
ఇత్యాభాతి చరాచరాత్మకమిదం యస్యైవ మూర్త్యష్టకమ్ ।
నాన్యత్కించన విద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్విభోః
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥ 9

## ఫలశృతి

శ్లో॥ సర్వాత్మత్వమితి స్ఫుటీకృతమిదం యస్మాదముష్మిం స్తవే
తేనాస్య శ్రవణాత్తదర్థమననాద్ధ్యానాచ్చ సంకీర్తనాత్ ।
సర్వాత్మత్వ మహావిభూతిసహితం స్యాదీశ్వరత్వం తతః
సిద్ధ్యేత్ తత్పునరష్టధాపరిణతంచైశ్వర్యమవ్యాహతమ్ ॥

"ఇందుగల విషయము శుద్ధ బ్రహ్మజ్ఞానము. స్వస్వరూప విచారము అజ్ఞాన నిరసనము. మాయానాశము. సత్యప్రతిపాదనము దీని ప్రయోజనమో, అనాదియగు అజ్ఞాన నాశనము. పునర్జన్మరహిత మోక్ష ప్రాప్తి సంబంధము ఆది గురువగు శ్రీ దక్షిణామూర్తి బ్రహ్మనిష్ఠా [illegible] సనకాదులకు బోధించిన జ్ఞానధనము. శ్రీ శంకరులు తన శిష్య పరంపర తరించుటకై ఆ రహస్యసంపదను వ్యాఖ్యానము చేసి తెలిపియున్నాడు

మంగళాచరణము :— ప్రతి శుభకార్యమునకుపక్రమించు నపుడు ప్రకృతిని అనేక విధముల మనము ఉపయోగించుచున్నాము. కనుక ప్రకృతికి ప్రభువగు పరమాత్మను స్మరించి. ఆతని అనుజ్ఞ బడసి ప్రకృతిని వాడుకొనుట ఉచితము మంగళాచరణము వలన మూడు ఫలములు గలవు. 1. సాంప్రదాయ రక్షణ 2. నిర్విఘ్న సమాప్తి 3. అంతఃకరణ శుద్ధి.

భగవంతుని స్మరించుట వలన విఘ్నములెల్ల తొలగి, ప్రకృతి అనుకూల పడుచున్నది. ప్రయత్నము శుభము నొసగుచున్నది. పరమాత్మ స్మరణ వలన శ్రోతల అంతఃకరణములందలి మల, ఆవరణ, విక్షేపములు తొలగి ఏకాగ్రత కూడుచున్నది. పరిశ్రమ సద్వినియోగమగుచున్నది. ఇందుగల

మంగళాచరణ శ్లోకము నందు సగుణబ్రహ్మ నిర్గుణబ్రహ్మ నిర్దేశములు కాననగుచున్నది. నిర్గుణబ్రహ్మమగు ఆత్మారాముని, సగుణబ్రహ్మమగు శ్రీ దక్షిణామూర్తిగ నిరూపింపబడుచున్నది.

ఈ స్తోత్రరాజము యొక్క సారము సర్వము బ్రహ్మమయమని తెలియందగును. ముముక్షువుల యెడ గురుదేవునికి గల అవ్యాజ కరుణా ప్రవాహము వలన, ఈ భావమిందు స్పష్టముగ తెలుపబడి యున్నది. కనుక ఇందలి భావములను మరల మరల గురుముఖేన శ్రవణము చేయుట వలన, శ్రవణించినది మననము చేయుటవలన, సర్వాత్మాభావమనబడు మహావిభూతి అప్రయత్నముగ చేకూరుచున్నది. ఇహ పర సౌఖ్యములు చేకూర్చుచున్నవి. శాశ్వత బ్రహ్మపదవి లభించుచున్నది.

ఓం తత్సత్





# శ్రీ శివతత్త్వ రహస్యము



శ్రీ శివుడు బ్రహ్మానంద స్వరూపుడై, నిర్వికారుడయి శమించి యుండును. ఎందున పక్షపాతము లేకుండ సమత్వమును కలిగియుండును. స్వయంప్రకాశము గలవాడు. సుఖమును, పరమానందమును, అమృతత్త్వ శక్తిని కలిగించు పురుషుడు.

శుభములనిచ్చువాడు. కర్మముల కాపాడువాడు. తన నామమును నిరంతరము వచించువానికి పతితత్వము తొలగించి శుభమును కలిగించువాడు.

అన్ని లోకములను లయింపజేసి సృజించును. సృజించి లయింప జేయును. అంతేకాక తానే అందు వసించును సకలైశ్వర్యము కలిగించువాడు సర్వాంతర్యామి.

భక్తులకు సులభసాధ్యుడు - ప్రళయమందు భూతమును హింసించు వాడయి కల్పితమైన యీ జగత్తును హింసించి తన స్వరూపమాత్రము చేత నిలుచును.

సాంసారిక దుఃఖములను పోగొట్టును. వేదాంత వాక్యములను పలికి శివజ్ఞానోపదేశము చేయును అశుభములను నిర్మూలించి తల ఎత్తుకొనకుండ జేయును. దయానిధియయ్యు అంతమున అన్నింటిని హింసించువాడు సంసార రోగమును శమింపజేసి సుఖమును ప్రసాదించును. గర్భజన్మమును, ముసలి తనమును, మరణమును జెంది వచ్చుచు పోవుచు శ్రమచే భిన్నులైయున్న జంత్వాదులకు విశ్రాంతికై మహాప్రళయమును, తమస్సును స్వీకరించును. క్షణమున అవిద్యామోహితులను, సుచిరనిద్రను, సుఖములను అనుభవించు నట్లు చేయును. వైద్యునివలె శస్త్రచికిత్సచేయును సర్వవ్యాపియై వృక్షము వలె స్తబ్ధత్వము వహించి దివి వఱకు వ్యాపించి పూర్ణపురుషుడయి యుండును.

అమృతత్త్వము గలవాడు. దిశలను ఛేదించుకొని అన్ని లోకములను వ్యాపించి యుండును. పితలను పుట్టించును. తానే విష్ణువు, తానే బ్రహ్మ, అణువు మొదలుకొని అన్నింటియందును నుండి అంతుపొంతులను తెలిసికొనును. అన్నింటికి హేతుభూతుడయి యత్నములేకయే అన్నింటిని తెలిసికొని యుండు వాడు. సర్వజ్ఞుడు. సర్వదేవతలకు పరముడు. స్థితి, జీవన, శ్వాసావకాశాది కములగు ఉపకారముచేత అన్నింటికి ఆధారభూతుడయియుండి భరించువాడు సూర్యాదులు మొదలుకొని అందరి తేజములను తనయందిముడ్చుకొనువాడు. తననారాధించేవారికి శ్రేష్ఠమైన కళత్ర పుత్ర మిత్ర సర్వాది మంగళములు లభింపజేయువాడు బ్రహ్మచే దివ్యసుఖమును పొందింపజేయువాడు. బ్రహ్మచే సృష్టింపజేయబడిన బ్రహ్మాండములనన్నింటిని కుమ్మరివలె ఏకత్వముజేసి కలిపివేయగల విద్యను ఎఱిగినట్టి బుద్ధిగల సమర్థుడయిన పండితుడు. ఈ అనేక కోటి బ్రహ్మాండములను భోగార్థము సృష్టించి తన బుద్ధి సంపత్తిని ప్రదర్శించి ఆత్మైకాత్మ బోధనకై తత్త్వమును నిర్మాలించి జగద్భ్రాంతిని పోగొట్టువాడు. అందరికిని ఐహికాముష్మిక సుఖములను ఇచ్చునది సర్మ మంగళాదేవి. పార్వతీదేవి భోగములను, మోక్షములను, సుఖమును దయ చేయును. అట్టి శివశక్తిచే అలంకరింపపడుచుండునట్టి సర్వమంగళాలంకృతా కృతి గలవాడయి సర్వమంగళములను పొందింపజేయువాడు.

ఆత్మరూపమై ఎల్లప్పుడు సమన్వయింపబడు పరమాత్ముడు. ఇంద్రి యములను మనస్సును బుద్ధిని హిరణ్య గర్భాఖ్యతత్త్వమును మించి ఉత్త రోత్తరమైన పరమును కూడ పరమై శ్రేష్టమై సూక్ష్మరూపియైన పరాత్పరుడు.

జనన మరణరహితుడు. ఆది అంతము లేనివాడు. అనాదినిధనుడని పేరుగలవాడు. జనన మరణాదుల నుండి రక్షింపగల శక్తిమంతుడు. ఆది గురువు, సత్యము జ్ఞానము, ఆనందము గల లక్షణములు గలవాడు. ప్రళయ కాలమున బ్రహ్మ, విష్ణులను లయింపజేయువాడు. ప్రళయావసానమున రుద్ర విష్ణు బ్రహ్మలను సృజించువాడు. వేదాంతవేద్యుడు. అనగా వేదాంత మహా వాక్య విచారము చేత పొందతగి తెలియదగిన మహనీయుడు. కాలమును ఆత్మగా గల్గినవాడు. అనగా కాలాత్ముడు. విచిత్రమైన బహువిధశక్తులచే శోభిల్లువాడు. తన శక్తిచేతనే సర్వజగత్తంత్రమును ప్రారంభించువాడు. పాశత్రయ బద్ధులైన ద్విపాదులు, చతుష్పాదులు అయిన సర్వజంతువులకును

పతియై పశుపతి యని పిలువబడువాడు. సర్వతత్త్వ ప్రబోధకుడై శ్రీ దక్షిణా మూర్తి స్వరూపుడై, ఆదిగురువై, ఈశానుడై సర్వవిద్యా గురువైనాడు. గౌరీ దేవిని వామభాగమున ఉంచుకొని అర్ధనారీశ్వరుడైనాడు. వేదాగమాదులందు ప్రతిపాద్య ప్రతిపాదన సంబంధముచేత వానిని పీఠముగా గలవాడు. వైదికాగమ పీఠస్థుడు. శివస్థలవాసియైన పరమపాపికైనను, ప్రణవ, పంచాక్షరీ శ్రీ రుద్ర జప లింగారాధనాది మహాపుణ్యవంతులకును అవసానమున తారకము నుపదే శించువాడు.

శాంభవమైన తేజస్సుచే లింగాకారమున నుండువాడు. సర్వవిద్యా నిల యుడు వేదాదికములను సృజించిన మహనీయుడు. సర్వవిద్యాధిపతి. పర విద్యచే తత్త్వోపదేశముచే జన్మించిన శివజ్ఞానమున ముముక్షువులను కాపాడు వాడు. భర్గుడై పాపాదులను మాడ్చివేయువాడు. కామకలాదులను, కాలపాకము నొందించువాడు. గాయత్రిమంత్ర ప్రతిపాద్యుడైన దేవుడు. వాయుసూర్యాది దైవత కులమును తమతమ కార్యములందు ప్రవిష్టులగునట్లు శాసించి ప్రేరే పించువాడు. తన కఠిన శాసనముచేతనే సర్వ చరాచర జగత్తు అంతయును నియమము తప్పక వర్తింపజేయువాడు సన్మార్గమున మనలను నడుపువాడు. శ్రీ భ్రమరాంబా సమేతుడైన మల్లికార్జున నామధేయంబున స్వయంజ్యోతియై దిక్కులకు వెలుగు కలిగించు స్వయంప్రభువు - స్వప్రభచే వెలుంగువాడు.

ఓం తత్సత్ - ఇతిశమ్.





# శ్రీ శివరాత్రి మహిమ



శివరాత్రి : మాఘమాసీయ కృష్ణ చతుర్దశినాడు విజ్ఞానమయ పురుషుడై సర్వభూత మహేశ్వరుని శివుని బూజించు నాచారము మన భారతదేశమందు గలదు. ఇది అనాదిగ వచ్చుచున్నది. ఈ శివ చతుర్థశీ తిథికి 'శివరాత్రి' యన బడును.

ఈ పూజ రాత్రి నాలుగు జాములందు నాలుగుసారులు జరుపుదురు ఇక దీని ఉద్దేశ్యము కృష్ణ చతుర్థశీ తిథియందు జంద్రకళలు పదునాలుగు లయమయి ఒక్క కళమాత్రమే మిగిలియుండును. మనస్సున కధిపతి చంద్రుడు. బాహ్య ప్రకృతియందలి చంద్రకళా లయవికాసములను బట్టియే ఆంతర ప్రకృతి యందు మనోలయ వికాసము లుండును. కృష్ణపక్షమం దెంత మనోలయ మగు చున్నదో, శుక్లపక్షమం దెంత వికాసమగుచున్నదో యనుభవమునందు తేటతెల్ల మగుచున్నది. ప్రయోజనములేని పనులెవ్వియు మన ఋష్యాదులు మన కుపదే శింపబడలేదు. వారి ఉద్దేశ్యమును తెలుసుకొనుటకు ప్రయత్నింపని లోటు మనదే.

శివుడు మంగళస్వరూపుడు. మంగళ ప్రదాత. జ్ఞానోదయ మూలముగా మోక్షలాభముకంటె మంగళ మేమున్నది? వశియే శివుడు. వ్యాకరణాను సూత్రముచే అక్షర వ్యత్యాసముచే 'వశి' యన్నదే 'శివ'యై యింద్రియ వశీకరణ మొనర్చువాడను నర్థమిచ్చును

శివలింగము, గౌరీపీఠము ననెడి రెండింటి చేరికతో ఘటితమైన మూర్తి ఇది. శివలింగము నిల్చిన త్రికోణాకారముగల పీఠమువంటిదే గౌరీపీఠము (శక్తిపీఠము). ఈ రెండును గలసియున్న మూర్తినే ప్రాణాట్టమందురు. దీనినే మనవారు కొందఱు పానవట్టము అందురు.

ప్రాణ = చిచ్ఛక్తి; అట్టమ్ = శివుడు; ఈ రెండును జేరియున్న మూర్తియే ప్రాణాట్టము. శివుని దెలుపునదే బిందువు; అదియే అట్టమ్ అనెడి లింగము. తద్వికసిత శక్తిని దెలుపునదే త్రికోణము, అదే గౌరీపీఠము. 'జన్మాద్యస్య యతః' అనెడి బ్రహ్మలక్షణమును దెలుపునదే యీ మూర్తి. ఈ విచిత్రమయ విశ్వము దేనివలన బుట్టినదో యది సత్వరజస్తమోమయియైన అవ్యక్త ప్రకృతి యని తెలియగలదు. ఈ మూడు గుణములు గలిగిన యీ ప్రకృతియే యీ జగత్తునకు సూక్ష్మతమ కారణము. పురుషుని (చైతన్యముయొక్క) సాన్నిధ్యవశమున ప్రకృతి పరిణామశీల యగుచుండును. అందుచే నీ జగత్తు సృష్టింపబడుచున్నది. ఈ పురుష ప్రకృతి సంయోగభావ మెట్టిదో తెలియ జేయుటకే లింగపీఠాత్మకమైన యీ శివమూర్తి వెలయుచున్నది.

జీవుడు దుఃఖమయమును, పరివర్తన శీలమునైన యీ జగద్భావము పట్టునుండి తప్పుకొనగలడు. కనుక ప్రకృతి పురుషుల ప్రథమ సంయోగరూప మైన సృజనోన్ముఖావస్థను యథాసంభముగా దలంచుటకే శివలింగమనెడి ప్రతీకమును (మూర్తిని) అవలంబించి, జగత్కారణ సర్వభూత మహేశ్వరుని పూజ చేయబడుచున్నది.

సృష్టికి ప్రథమదశయందు గరచరణాదులైనయట్టి యవయవములును లేవు ఉండజాలవు కావుననే సత్వరజస్తమోమయియైన ప్రకృతికి ప్రతీకముగా త్రికోణాత్మక గౌరీపీఠమును, దానిపైని బురుషుని సాన్నిధ్యమును గుర్తించుటకే లింగమూర్తియు బతిష్ఠింపబడును.

ప్రకృతి పురుషుల ప్రథమ సంయోగమువల్లనే మహత్తత్వము (బుద్ధి తత్త్వము) తేటతెల్లమగుచున్నది. భగవద్గీతయందు గీతాచార్యుడు ఇట్లు జెప్పు చున్నాడు.

14వ అధ్యాయము - గుణత్రయ విభాగయోగము - శివ శ్లోకము.

శ్లో॥ మమయోనిర్మహద్బ్రహ్మ । తస్మిన్ గర్భందధామ్యహమ్,
సమ్భవ స్సర్వభూతానాం । తతో భవతి భారత ।

తా॥ ఓయి! (అర్జునా!) భారత! గొప్పదియగు నా ప్రకృతి ఉత్పత్తికిఁ గారణము. నేను దానియందు జగద్విస్తార హేతువగు చిదాభాసుని ఉంచుచున్నాను. అందువలన బ్రహ్మాది సర్వభూతముల యుత్పత్తియు నగుచున్నది.

తా॥ "ఓయి! భారత! (భాయాం రతః భారతః - పరమాత్మ తేజస్సును = శక్తిని ఉపాసించు నాశక్తికలవాడా!) [మహద్ = బ్రహ్మము - మహదాత్మ, మహత్తత్వము] నా యోని గర్భస్థానము, దానియందు నేను గర్భాదానము చేయుదును; అనగా జగత్ప్రకాశమునకు గారణమైన చిత్ప్రతిబింబము నుంతును దానివలననే సర్వభూత సృష్టి యగును.

శివుని యీ లింగమూర్తియందు ఎట్టి స్థూలావయవ స్థూలభావములు లేవు. చిత్ ప్రతిబింబముతో గూడిన మహత్తత్వము నెటులో తెలుపుటకే లింగమూర్తి నవలంబించి శివపూజా విధాన మేర్పడినది. శివలింగము చిదాభాస సమన్వితమైన మహత్తత్వముయొక్క స్థూలప్రతీకమే. ఇదే విశ్వముయొక్క ఆద్యవస్థ; ఇదే విశ్వమునకు బీజము. ఈ స్వరూపము నెఱుంగ గల్గినప్పుడే, సంసార భయము తొలంగిపోవును. కనుకనే శివధ్యాన మంత్రమందు "విశ్వాద్యం విశ్వబీజం నిఖిలభయహరమ్ లింగరూపం నమామి" యని వర్ణింపబడినది.

లింగ మనగా - చిహ్నము (గుఱుతు). ఏ గుఱుతువలన జగత్కారణ ప్రకృతి పురషవిషయకమైన జ్ఞానము కలుగునో యదే శివలింగము. లింగ మనగా లయస్థానము. ఈ జగత్ప్రపంచ మనెడి కార్యములనే యవ్యక్తకారణ మందు లయమందునో యదే లింగము. "లీయతే గమ్యతే యత్రజగదితి లింగమ్".

ఈ లింగమూర్తి నవలంభించియే పంచవక్త్రి, త్రినేత్ర, వ్యాఘ్రచర్మ పరిహిత, రజితగిరినిభ మున్నగు నామములతో ధ్యానము చేయబడుచున్నది.

అయిదు విధములుగా జ్ఞానము ప్రకాశించును. చక్షుకర్ణాదులైన పంచ జ్ఞానేంద్రియముల దారిని జ్ఞాన మైదువిధముల వెలయుటకు నిత్యము మనము

అనుభవించుచున్నాము ఇవే విజ్ఞానమయ పురుషుని పంచముఖములు పంచ వక్త్రుడు - అనగా విరివిగా దెఱచిన నోరుగలవాడు. వామదేవుడై జగద్వమనము (సృష్టి) చేయునపుడు పంచవక్త్రుడు. మఱి దానిని దనలో నిముడ్చుకొను నపుడును బంచవక్త్రుడే కావలయును. అనగా జగత్సృష్టి విలయముల నొనర్చు వాడు శివుడే.

త్రినేత్ర శబ్దము త్రికాల దర్శిత్వ సూచకము. భూతభవిష్యద్వర్తమాన ములనెడి కాలత్రయము నొక్కసారిగా విజ్ఞానమయ నేత్రములుగా నుద్భాసింప జేయువాడనుటయే తెలియదగును. కావున మహేశ్వరుడు త్రినేత్రుడు. మఱియు గాలసూచకులగు సూర్యచంద్రాగ్నులు శివుని నేత్ర రూపావయవములుగా జెప్ప బడుట యాతడు కాలస్వరూపుడును, గాలాతీతుడు నని బోధించుటకే యగును.

వ్యాఘ్రచర్మాంబరధారి యనుట యీ విజ్ఞానమయ పురుషుని యంగ మందే విచిత్రములైన యనాది వాసనాబీజములు సంచితములని భావము. పసుపు నలువు, ఎఱుపు, తెలుపు రంగులతో విచిత్రమైన యీ పులితోలు అనాది వాసనారాశియొక్క వైచిత్ర్యమును దెలుపును.

శుద్ధసత్వ గుణముచేతనే యీ జ్ఞానమయ పురుషుని యనుసంధానము సాధ్యము. సర్వజీవులకును జ్ఞానదాతయైన గురుడు కృపాపరవశుడై యాత్మ స్వరూప ప్రకాశము చేయునపుడే జీవుడు యధార్థ సద్గురు లాభముచే ధన్యు డగును.

ఇపుడు మనము ధ్యానమంత్రమందు వర్ణింబడిన 'చారుచంద్రావతంస, రత్నాకల్పోజ్జ్వలాంగ'యను మాటలభావమును తెలుసుకొనుటకు ప్రయ త్నించుదాము.

శివునికి దలపూవుగా మనోహరమైన చంద్రకళ శోభిల్లుచున్నది. చంద్రునకు పదునారు కళలని చెప్పుట (షోడశ కళలు) మనము విన్నవే. అందు బదునేను కళలు ప్రతిపదాదిపూర్ణి మాంత కళలుగా వెలయు చున్నవి. శేషించిన పదునారవది శివుని శిరోభూషణముగా శోభిల్లుననిరి. ఇక్కళకు 'అమా కళ' యని పేరుబెట్టిరి. తక్కిన పదునేను కళలును సూత్ర మందు మణులవలె నీయమాకళయందు ననుస్యూతనములై యున్నవి. దీనికే

మఱియొక పేరు 'మాయామాతృత్వం యాతీతిమాయా' తల్లి తనమును బొందినది కాగా మాయా. కనుక నిది మాయా. దీనినుండియే ప్రతిపదాదులైన పదునేను నిత్యకళ లేర్పడినవి. కనుక నిది మాయా, మాయా, మహావైసర్గికి యనుపేర నొప్పును అన్నిటిని విసర్జించినది, సృష్టించునది యని యర్థము. పరివర్తనము లేక సదా యుండునది. కనుక 'సాదా' యని మఱియొక పేరు. దీనికే శక్తియని పేరు. ఆ ఘటనా ఘటన పటీయసియైన మహాశక్తి స్వరూపిణి, మహామాయ ఏ శక్తి ప్రభావముచే విశుద్ధ బోధస్వరూపుడు మహేశ్వరుడు బహురూపములతో ప్రకాశింప బాధ్యుడయ్యెనో యా శక్తియే శివుని శిరోభూష ణమై యమా కళారూపముతో నున్నది. యధార్థ మేమనగా గౌరీపీఠ రూపమున ప్రకృతి రూపమున (ప్రకృష్టములైన సృష్టి, స్థితి, లయ, తిరోధానానుగ్రహము లనెడి కృతులు గలదిగాన ప్రకృతి) లింగమూర్తి శివునితో నవినాభావ సంబంధముగల యదియే పంచవక్త్రుడను, త్రినేత్రుడునైన శివుని లలాటమం దవతంసముగా నిల్చియున్నది.

శివుని వాహనము వృషభము (ఎద్దు). వృష మనగా ధర్మమని యర్థము. ధర్మమే మహేశ్వరుని వాహనము. '1ధృతి, 2క్షమ, 3దమము, 4అస్తేయము, 5శౌచము, 6ఇంద్రియ నిగ్రహము, 7ధీ, 8విద్య, 9సత్యము, 10అక్రోధము'– అనెడి పది ధర్మలక్షణములతో గూడిన జీవుడే (ధార్మిక వ్యక్తియే) మహేశ్వరుని స్వరూపము నవధరింప సమర్థుడు. అట్టి వ్యక్తికే మహేశ్వరుడు తన స్వరూపజ్ఞానము కలిగించి యాతని నాదరించును. కావున నట్టిజీవుడే శివుని వాహనమని వర్ణించిన (భావము) వుద్దేశ్యము.

శివపూజయందు శివుని యష్టమూర్తి పూజావిధాన మున్నది. '1పృథివి, 2జలము, 3అగ్ని, 4వాయువు, 5ఆకాశము, 6సూర్యుడు, 7చంద్రుడు, 8యజమానుడు (ఆత్మ) అను నెనిమిది శివుని యష్టమూర్తులు. అనగా భూత పంచము, ప్రాణ మనస్సులు (ప్రాణము = సూర్యుడు, మనస్సు = చంద్రుడు), జీవుడు అను నీ విధమున విజ్ఞానమయ పురుషుడు, మహాదేవుడు ఆత్మ ప్రకాశము చేసికొనెను "సర్వాయక్షితి మూర్తయేనమః" యనుచు శివుని బూజించు వేళ బూజకుడు, విజ్ఞానమయ పురుషుడు, మహాదేవుడే యీ స్వరూపముతో నంతట వ్యాపించి నిండియున్నాడని సులభముగా జెప్పగల్గినచో, క్షితి తత్త్వాత్మక బోధముయొక్క సర్వవ్యాపక భావమును లక్షించి, యనుభవించి, తెలిసి

పుష్పాంజలి సర్పింపగల్గినవుడే సర్వరూప క్షితిమూర్తియైన శివుని పూజ సార్థకము. ఇటులే 'భవాయజలమూర్తయేనమః' యనుచు బోధస్వరూపుని జలతత్త్వాత్మక సర్వవ్యాపితము నెఱింగికొని పుష్పాంజలిని మనఃపుష్పములతో గూర్చి యిడగల్గినపుడే భవస్వరూప జలమూర్తియైన శివుని సార్థకపూజ యైనట్లు లెన్నదగును, తక్కిన మూర్తుల సంబంధమందు నిటులే యెఱుంగునది. పరమేశ్వరుని విశ్వరూపత్వము నెఱింగి యుపాసించుట సాయుజ్య ముక్తిసాధనమని యాచార్యులవారు ప్రవచించిరి (శ్రీ శంకరాచార్యులవారు).

శ్లో॥ సాలోక్యం తవపూజనే, శివమహాదేవేతి సంకీర్తనే ।
సామీప్యం శివభక్తి ధుర్యజనతా సాంగత్య సంభాషనే ।
సారూప్యం చచరాచరాత్మక తనుధ్యానే భవానీ పతేః ।
సాయుజ్యం మమచిత్రమత్ర భవతి స్వామిన్ కృతార్థోస్మ్యహమ్ ॥

తా॥ ఆవాహనాద్యుపచారములతో బరమేశ్వరుని బూజించు భక్తుడు అతని కృపాలోకమందుండును. శివమహాదేవాది నామముల పరమార్థము నెఱింగి కీర్తించు భక్తుడు శివతత్త్వ సాధనమందు బ్రవేశింప నర్హత గడించును. అదే శివసామీప్య ముక్తి. శివభక్తి నిరతులైనవారితో గూడి నిరతము శివతత్త్వ విచార సంభాషణములు చేయు భక్తుడు పరమేశ్వర స్వరూపమైన జ్ఞానానందముల యాభాసము నొందును. ఆయస్థా విశేషమే సారూప్య ముక్తి. ఇక నాల్గవ ముక్తి 'శివోఽహ'మ్మనెడి మహావాక్యార్థ బోధము ననుభవ మనెడి యుత్తమావస్థయే సాయుజ్య ముక్తి. ఆది పరమశివుని యష్టమూర్తిత్వ జ్ఞానము కలిగి 'ఈశావాస్య మిదం సర్వమ్' అనెడి శ్రుత్యర్థము ననుభవించు భక్తునకే కలుగుననిరి. కావున శివుని యష్టమూర్తిత్వ జ్ఞానము పరమపురుషార్థ దాయకము.

శివుడు జగద్గురుడు; ఆశుతోషి; ఇంతలో సంతోషించును. ఆతని పూజకై విశేషాడంబరము లేదు అతని సామాన్యమైన మృత్తికతోనే సులభముగా నెట్టివారును లింగమూర్తిని నిర్మింపగలరు. అనాయాసముగా సంపాదింపగల జల, బిల్వదళములు నాతనే పూజయందు బ్రధానోపాదేయములు. అప్రయత్న లభ్యమైన గానవాద్యములతోనే శివుడు పరమసంతష్టుడగును. అట్టి యతి సులభసాధ్యమైన పూజాఫలముగా నతిదుర్భరమైన ముక్తి లభించును.

ఈ శివపూజవలన నాధ్యాత్మికలాభ మటుండ అది భౌతికజగత్తునందు సైతము విశేషఫలము గలదు ఇది వసంత ఋతువు ప్రారంభము. జీవజంతువులు, తరులజాతులు నన్నియు నత్యధిక రససమన్వితములై యుండును. పూర్వదినమందుజేసిన సంయమమును మఱునాటి పారణముతో, శివరాత్రి నిర్జలోపవాస పూర్వకముగా రాత్రి జాగరణమును, యథాశక్తి శివపూజయు జరుగును. రాబోవు నాదానకాలవశమున జంతు శరీరమందలి రసధాతువు క్షీణింపజొచ్చును. ఈ వ్రతఫలముగా బరమేశ్వర కృపచే వసంత రోగములు గలుగుననెడి భయము తొలగును.

బాహ్య ప్రకృతి పరివర్తనముతోనే మన యంతఃప్రకృతి. పరివర్తనము సైతము వ్యక్తి భేదమునుబట్టి యింతయో యంతయో యగుచుండును.

అమావాస్యా పూర్ణిమలయందును వాని సమీప తిథులయందును, అంతఃప్రకృతియం దింతోయంతో పరివర్తనమును గలుగును. తత్త్వములవైపు చూచుచూ బోయినను గ్రీష్మకాలమందు దేజసత్త్వముయొక్కయు, వర్షాకాలమున జలతత్త్వముయొక్కయు, శరత్కాలమున క్షితితత్త్వముయొక్కయు, శిశిరమునందు మహతత్త్వముయొక్కయు ప్రభావము వృద్ధినొందుచుండునని మనము చక్కగా దెలిసికొందము.

శివరాత్రి వచ్చు శిశిరము మహత్తత్త్వ విశిష్టము. మన పూజ్యపాదులైన ఋషులు ఏ మాసమున, ఏ పక్షమున, ఏ తిథియందు ఎట్టివేళ వెలిని లోనను (ప్రకృతియందు) స్వాభావికములైన ఎట్టి పరివర్తనములు గలుగునో దానియందు విశేష లక్ష్యముంచియే పూజాది వైధకార్యముల విధానముల నుపదేశించిరి. అట్టి నుపదేశములను బూర్తిగా విశ్వసించిన జీవనయాత్రయందు సుఖులై యుందురు మనఃప్రాణముల స్వాభావిక పరివర్తనముయొక్క యనుకూలతను గుర్తించి నడుచుచున్నచో, మన యాధ్యాత్మిక మార్గము అగ్రశ్రేణియందుండును.

పరమేశ్వరు డొక్కడె. అతనిని వేర్వేరు సమయములందు వేర్వేరు రూపములతో గాంచుచున్నాము. కారణ మేమనగా పరివర్తన ప్రియత్వమే (మార్పునందలి యిష్టమే) జీవన ప్రధానలక్షణము. మనము జీవులము. తెలిసియో

తెలియకో సదా మార్పునే కోరుచుందుము. దానిచే మన యాంతర బాహ్య ప్రకృతి సదా పరివర్తితమగును. గాన మన ప్రియతమ ప్రాణదేవత సదా యేకరూపుడే యయ్యును, మన ప్రీతికై యాతడు వేర్వేఱు సమయములందు వేర్వేఱు భావములతో నాత్మ ప్రకాశము చేయుచుండును. దీనిచే లోపలనేకాని వెలుపలనేకాని యొకవిధమైన పరివర్తన మగునపుడే యొకవిధమైన పూజావిధి ప్రవర్తిల్లునని తెలుసుకొందము.

తిథులలో నుభయపక్షములందు యష్టమినాడును దానికి దగ్గఱ తిథులందును విశేష పరివర్తనముల పరిసమాప్తి యగును. గనుకనే ఎక్కువ భాగము పూజలు ఈ తిథులయందే విహితములై యున్నవి.

పరమేశ్వరుని యైశ్వర్యమయత్వము; ఆనందమయత్వము. మున్నగు సగుణభావోపలబ్ధికై విహితములైన పూజాదులలో ఆధికభాగము శుక్లపక్షమందు పగటివేళను, బూర్ణిమాష్టములయందును దత్సమీప తిథులయందును జేయబడును.

ఇక నిర్గుణ స్వరూప పూజాదులలో నధికభాగము కృష్ణపక్షమునం దమావాస్యాష్టముల యందును దత్సమీప తిథులయందును, రాత్రివేళ జేయబడును.

ఈ సమయమందు మనస్సు స్వాభావిక నియమవశమున క్షీణతనొందును. కారణము చంద్రుని కళలు క్షీణతతోనే మనస్సు క్షీణించుట తప్పదు. దీనిచేత విషయలాలస క్షీణించును. ఇక బగటిభాగమునం దింద్రియములు సహజముగానే యంతర్ముఖము లగును. కావున పైనిజెప్పిన కాలము నిర్గుణోపలబ్ధి విషయమున విశేష సహకారి యగును.

ఇపుడీ శివరాత్రి పూజావిషయము నిర్గుణ సత్త్వోపలబ్ధికి సంబంధించినదే యగును. భక్తుని మనస్సు శివరాత్రి సమీపించుకొలది శివునివైపు బరుగెత్తుచుండును. ప్రకృతి నియమవశమున జతుర్దశినాటికి బదునాలుగు కళలు క్షీణించి యుండుటచే జాగృతిక విషయలాలస క్షీణించియుండును. ఋతుధర్మమును బట్టి యాకాశతత్త్వ విశిష్టతచే నిర్మలమగును. అట్టివేళ మాఘమాసీయ చతుర్దశి నాడు అనగా శివరాత్రినాడు పగలంతయు నుపవశించి, పార్థివాది లింగరూప శివుని బూజించి ప్రదోషకాలాదిగా భావలింగార్చనమునకు గడంగు సాధకునకు

నగమురాత్రి యగుసరికి బరమేశ్వరుని నిర్గుణోపలబ్ధి భాగ్యమబ్బి హృదయము నందు దాదాత్మ్యము నెలకొనును అదియే లింగోద్భవము ఆ కాలముననే లింగోద్భవకాల మందురు. పరమాత్మతో జీవునకు దాదాత్మ్య సిద్ధియగుటకంటె శివము (మంగళము) మఱియొకటి లేదు గనుక నిది శివరాత్రి.

ఉపవాస జాగరణ విషయములో యధార్థ భక్తుడు శివరాత్రినాడు నిరంతర శివసాన్నిధ్యము కల్పించుకొని కొంత సేపు శివమంత్ర జపముతోను, గొంత సేపు శివపూజాభిషేకములతోను, శివపురాణ పఠనాదులతోను, శివనామ సంకీర్తనలతోను గడుపునపు డాతనికి స్థూలశరీర పోషకములగు వస్తువులను గొను కోరికయే లేకుండియు, నియమితవేళకు నించుకంతయు ఆకలియైన నుండదు. ఆహారమును దీసుకొన్నచో యింద్రియములకు మనస్సు లొంగిపోయి నిష్ఠాభంగమగునని మానియు నా దినము నెట్టుటచే తన యుపవాసము సార్థక మగును.

ఇక ప్రదోషకాలాదిగా భావలింగార్చనమందే నిమగ్నుడై జ్ఞానస్వరూప శివునితో దాదాత్మ్యానందము గంటగంటకు బలపడుచుండుటచే సత్వగుణ వికా సము ప్రబలమై, తమోరూప నిద్రావస్థకు బాలుగాక జ్ఞానవిరోధియైన నిద్రను గెలిచి జడనిద్రలేని యాయాసము లేక శివరాత్రి నిట్టి జాగరణముతో కాలక్షేప మొనర్చి, శివ కరుణకు పాత్రుడై, లింగోద్భవ భాగ్యమబ్బి యానందమయుడై తరించును.

కావున భక్తులెల్లరు శివరాత్రి నామక మహాపర్వ దివారాత్రము లెట్లు గడిపి తరించవలెనో తెలిసికొని గట్టు చేరుదురుగాక !

ఇతిశమ్

## శివరాత్రి మహిమ లేక మాహాత్మ్యము

మాఘ బహుళ చతుర్దశీ రాత్రికి శివరాత్రి యనియు, పరమశివుని కత్యంత ప్రీతికరమైనదనియు తెలుసుకొంటిమి. ఆనాటి వ్రతజాగరణముల ఫలము మిక్కిలి యధికము. ఆ దినమున నుపవసించి శివార్చన మొనరించి

నాల్గుజాములయందును బిల్వదళములతో శివుని బూజించినవాడు శివునితో సమానుడగునని పురాణ ప్రవచనము.

ఇట్టి ఫలము తపస్సుచేగాని సమాధివలనగాని లభింపదు. వ్రతము లన్నిటిలో శివరాత్రివ్రత ముత్తమోత్తము.

(ప పు ) శ్లో॥ మాఘఫాల్గుణయోర్మధ్యే । కృష్ణపక్షే చతుర్థశీ ।
శివరాత్రి రితి ఖ్యాతా । సర్వయజ్ఞోత్తమోత్తమా ॥

తా॥ మాఘ ఫాల్గుణ మాసములమధ్య కృష్ణచతుర్థశి శివరాత్రి యని ప్రఖ్యాతి బొందినది. ఆ రోజున నుపవాసాదులు చేసి వ్రతముచేసిన మహాఫలము లభించును. సర్వయజ్ఞములలో నుత్తమోత్తమైనది.

(పం.పు ఉ.) శ్లో॥ దానయజ్ఞ తపస్తీర్థ వ్రతకర్మాణి యానిచ
శివరాత్ర వ్రతస్వాపికోట్యంశేనసమోచన
యైరియం కలిహస్త్రీచ కృతాంత పథనాశినీ
భుక్తిదాముక్తిదాదేవి! దివానిశము పోషితా
నతే యమపురంయాన్తి సత్యం సత్యం వరాననే॥

తా॥ అనేక దానములు యజ్ఞములు తపస్సులు తీర్థయాత్రలు వ్రతములు మొదలైనవి శివరాత్రి వ్రతములో గోటివంతుతో సమానము కావు. ఈ వ్రతము నాచరించిన గతదోషము పోయి యమలోకమునకు వెడల కుండ జేయును వ్రతము భుక్తిని ముక్తిని నిచ్చునది సత్యము.

శివరాత్రి దినమున వేకువనేలేచి కాలకృత్యముల దీర్చికొని గుర్వాజ్ఞను బడిసి స్నానమాచరించి వ్రతసంకల్ప మొనర్చి మౌనవ్రతుడై యింద్రియ నిగ్రహము గలవాడైయుండి యా దినమున నుపవసించి రాత్రి మఱల స్నాన మొనరించి గణపతి పూజ గావించి యథాశాస్త్రీయముగ. శివపూజనమును ప్రతి యామమునందును గావింపవలెను. ఈశ్వరున కభ్యంగనము నభిషేకమును ప్రతియామముననను జేయవలెను. నారికేళోదకముచే నభిషేకము బిల్వపత్రము లచే బూజయు నొనరింపవలయును. నీరాజనమిచ్చి దివ్యవస్త్రాభరణాదులను వివిధ పుష్పముల నలంకరించి, నైవేద్యము నర్పించి మంగళవాద్య వేదప్రవచ నములతో స్తోత్రపాఠ పురాణపఠన నృత్యగీతాదులతో నా రాత్రి జాగరణము జేయవలెను. మఱునాడు శివప్రీతికరముగా సకల దానములను గురుపూజనము

నొనరింపవలయును. బాలురను వృద్ధులను నార్తులను దృప్తిపరచవలెను. యోగుల కన్నదానమొనర్చి, రుద్రాక్షమాలలు, కమండలువులు, దండములు, భిక్షపాత్రములు దానమీయవలెను.

గుర్వాశీర్వాదమును బొందవలెను. వ్రతాచరణమునకు శక్తి చాలనిచో నృత్యగీత వాద్య విశేషములతో బురాణ పఠనాదికములతో జాగరమైనను జేయవలెను. శివరాత్రినాడు శివక్షేత్రమున నీ వ్రత మాచరించుట మిక్కిలి శ్రేష్ఠము. స్త్రీ పురుషాదులు, బాల బాలికలు, యెవ్వరైన నీ వ్రతము నాచరింపనగును. శివరాత్రినాటి జాగరమున కెంతయో ఫలమున్నది. అన్ని వ్రతములకంటె గోటిరెట్లధిక ఫలము నీ వ్రత మొసగునని శాస్త్ర ప్రమాణము. వేయికోట్ల జన్మములలో బుణ్యమాచరించిన నెంతఫలమో శివరాత్రి జాగరణముచేసిన నంతఫలము గలుగును. పాతకములన్నియు శివరాత్రి జాగరణమున నశించును. విచిత్రములగు మానసిక పాపములు శివరాత్రి జాగరణము చేయుటవలన నశించును.

మానవజన్మమును బొంది యెంతటి హీనుడైనను నీశ్వరలింగమును, విఘ్నేశ్వరుని, గుమారస్వామిని బూజించినవారు ముక్తులగుదురు. ననేక జన్మములో నాదరముతో శివనామమును జపించనివారును దమ పాపములను శివరాత్రి జాగరణమున బోగొట్టుకొనగలరు.

ఈ రీతిగ మహేశ్వరుడు పార్వతికి శివరాత్రి మహాత్మ్యమును దెల్పెను.

బ్రహ్మాదులు, మునీశ్వరులు, సమస్త దేవతలును శివరాత్రి వ్రతము గావించిరి. శివరాత్రి మహాత్మ్యమును వినినవారు, చదివినవారును సర్వపాపముల నుండి విముక్తులై శివలోకమున కేగుదురు. ఈ మహిమ యెక్కడ గీర్తింపబడుచుండునో యచ్చట పార్వతీపరమేశ్వరు లుందురు. దేవతలు, గంధర్వులు, నాగులు మొదలగువా రనుగ్రహించుటకొఱకై యచ్చటనే యుందురు. సర్వతీర్థయాత్రలవలనను సర్వయజ్ఞములు చేసినందునను గలుగు ఫలమునకు గోటిరెట్లధికముగా శివరాత్రినాడీ వ్రతమాహాత్మ్యమును జదివినను, విన్నను ఫలమునందును. ఈ మాహాత్మ్యమును విన్నచో నభీష్టములు నెఱవేఱును ఈ వ్రత మైహికాముష్మిక సుఖమున నిచ్చును. యమశాసనమువలని కష్టములు లేకుండ జేసి శివసాయుజ్యము నొసంగు మాహాత్మ్యము గలది. (మహత్త్వము గలది).

ఈ వ్రతమహిమను దెల్పు ననేక యుపాఖ్యానములు గలవు - గ్రంథ విస్తరణ భీతిచే నిందు పొందుపరుపబడలేదు.

ఆ యుపాఖ్యానములలో అజ్ఞానులై శివరాత్రి యనియు, తాము శివారాధ నము, నుపవాసము, జాగరణము జేయుచుంటిమని దెలియకయే చేసి ఎంతయో సుకృతమును బొందిరి. తన్మాహాత్మ్యము నెఱిగి శివరాత్రి వ్రతము నాచరించిన వారికి యెంత ఫలమో చెప్పలేము కదా॥

శ్లో॥ ఉపవాసం కరిష్యంతి జాగరేణ సమన్వితం
యథోక్త శాస్త్ర మార్గేణ తేషాం మోక్షోన సంశయః ॥

తా॥ శివరాత్రినా డెవ్వడు శాస్త్రోక్తముగా జాగరముతోగూడిన యుపవాసము జేయునో వాడు నిస్సంశయముగా మోక్షమును బొందును.

శ్లో॥ శివరాత్రి సమంనాస్తి వ్రతం పాపక్షయావహం
యత్కృత్వా సర్వపాపేభ్యో ముచ్యతే నాత్రసంశయః ॥

తా॥ సర్వపాపములను హరింపగల వ్రతములలో శివరాత్రి వ్రతముతో దుల్యమైనది లేదు. దీనిని నాచరించినవాడు నిస్సంశయముగా సర్వపాప విముక్తుడగును.

కలియుగమున మాఘకృష్ణ చతుర్దశి నిశీధకాలమున లోకసంరక్షణార్థమై మహేశ్వరుడు మహాలింగముగ నుద్భవించినాడు. విష్ణువు లింగ మధ్య స్వరూ పము. లింగమందలి బీజస్వరూపు డీశ్వరుడు. పీఠము బ్రహ్మ యోని స్వరూ పుడు విష్ణువు. సంతానము జగత్తు, ఈ యపార జలమధ్యమున నీ మహాలింగము శివనారాయణ స్వరూపమై యావిర్భవించినది. కావున శివరాత్రి వ్రతము నాచరించిన విష్ణ్వాదిదేవత లందఱు సంతసింతురు. ఇంత పవిత్రమైన వ్రత మింకొకటి లేదు. కావున ఆస్తిక మహాశయులెల్లరు ఆచరించి తరింతురు గాక॥

ఓం తత్సత్ – ఇతిశమ్ – ఇతి శివమ్.

పూజా విధానము :–

"పత్రం పుష్పం ఫలం తోయం యోమేభక్త్యా ప్రయచ్ఛతి" – గీతాచార్యుడు.

"ఏవంస్తుతా సురైర్దివ్యైః కుసుమైర్నందనోద్భవైః । అర్చితా జగతాం ధాత్రీ తథాగంధానులేపనైః । భక్త్యా సమర్పితైస్త్రిదశైర్దివ్యైర్ధూపైసుధూపితా"–చండీ పాద దుర్గా సప్తసతి.

"వైదికైస్తాన్త్రికైస్త్వైవ మంత్రైర్మామర్చయేత్సుధీః" – శ్రీకృష్ణ భగవాన్.

ఈ విధముగా స్మృతిసంహితా పురాణాదులం దెల్లెడ బూజా విధానము పలువిధములుగా వర్ణింపబడినది.



# శ్రీ శివానుగ్రహము



## లింగార్చనపరులగువారికి గలిగిన శివానుగ్రహము

1. శివానుగ్రహముచే నర్జునుడు తన ప్రతిజ్ఞ నెరవేర్చుకొనెను. [భారతము - ద్రోణ పర్వము - శాంతి పర్వము - శ్రీ వ్యాసమహర్షి మఱియు శ్రీకృష్ణ వచనము]

2. శివానుగ్రహముచే అశ్వత్థామ పాంచాలాది వీరుల వధించెను. [భారతము - సౌప్తిక పర్వము].

కృపాసముద్రుడును, నవ్యయుడును, శశిశేఖరుడును, భక్తసులభుడును నగు పరమేశ్వరుని నతులిత భక్తితో సేవించి, తద్దేవకరుణాకటాక్షప్రభావముచే అర్జునుడు తన ప్రతిజ్ఞ నెరవేర్చుకొనెను. తాను యుద్ధమునందు శత్రువులపై బాణము వేయదలంచునపుడు మహాసంరంభముతో నగ్నిదేవునివలె దీప్తి కలిగి మహాపురుష డొకడు ఆకాశమున నాతనికి ముందుగ కిరణములచే దిక్కుల ప్రకాశింపజేయు నొక గొప్ప త్రిశూలము గొని వైరుల వధించుచుండెను. తాను శరములు వదలుటచే చూపరులు తనకు ముందు నడుచు మహామహుని గనుగొనలేక పార్థు డెంతటి పరాక్రమవంతుడో యొక్క బాణమేయ యెందరో మడయుచున్నారని తన్ను స్తుతింపుచుందురు.

ఆ మహాపురుషు డెవ్వడై యుండుననియు తనకు ముందు నడచి జయము గలుగజేయుటకు కారణమేమైయుండునని శ్రీ వేదవ్యాస మహర్షులవారిని సవినయముగ దెలుపుమని ప్రార్థించెను.

క॥ అప్పురుష దెవ్వడోయని
యెప్పుడు మది దలతునతని నేర్పడనాకున్
జెప్పవలయునని యడిగిన
నప్పార్థున కిట్టులనియె నమ్ముని ప్రీతిన్ ॥

అప్పుడు నమ్ముని యిట్లు జెప్పదొడంగె. ''నీకు ముందు నడచుచు జయము కలుగజేయు మహాత్ముడు శివుడు. అతడు సర్వభావనములకు శాసన కర్త. వేదములు నిత్య మతనికి దివ్యలీలలు గొనియాడుచుండును

క॥ యోగీంద్ర చిత్త కమలా
భోగమధుప విభుడు ప్రకృతి పురుషాత్మకుడు ని
ర్భోగ స్వరూపు దవ్య
క్తాగోచరు డధికసులభు డమలాత్ములకున్ ॥

ఫాలనేత్రుడు యోగీంద్రుల చిత్తకమలముల యందలి భక్తియను మధువును గ్రోలుచుండెడివాడు, అంబికానాథుడు, నీలకంఠుడు నగు శివుడు జరా జన్మ మృత్యువు లేనివాడు. అతడజ్ఞానుల కగోచరుడు; సుజ్ఞానులకు సులభ ప్రసన్నుడు. భక్తవత్సలుండగు మహాదేవుడు స్త్రీ పురుషాత్మకుండు స్మరణ మాత్రముననే దీనులకు శుభములొసంగువాడు, శుభస్వరూపుడై యలరారువాడు. నీవు మున్నరణ్యవాసమున తపముసేయ వరదుండై వరము లొసంగి భక్త వాత్సల్యము ప్రకటింపుచు నీకు ముందు నడచి జయము కలుగచేయుచున్న వాడు. సర్వలోక శరణ్యుండగు నయ్యుమారమణుం శరణుజొచ్చిన నక్కారుణా కరుని కరుణచే శరణాగతుల కాయురారోగ్యైశ్వర్యాది సకల సౌభాగ్యంబులు నిత్యంబులగు"నని వ్యాసమునీంద్రుని వచనములు విని ఫల్గుణుడు పులకిత శరీరుండై పరమేశ్వరుని భక్తవాత్సల్యమునను పరమానందభరితుడై యనేక విధముల స్తుతించెను.

ఇదే విషయము శాంతి పర్వము (భారతము) లో షష్ఠమాశ్వాసమందున గలదు. శ్రీకృష్ణపరమాత్మ అర్జునునితో నిట్లు జెప్పెను.

కౌంతేయా ! (అర్జునా !) నీకు మునుముందుగా శూలము గొని శత్రువుల వధించువాని రుద్రునిగా నెరుగుము సకలభువనములకు శాసనకర్తయు, జనన మరణరహితుడును, శుభకరుడైన శివునిగా నెఱింగి నీవు నిరంతరము స్మరింపుము.

భారతము - ద్రోణ పర్వము :— అర్జునుడు సైంధవుని తల రేపు సూర్యు డస్తమించక పూర్వము త్రుంతునని శపథమొనర్చి యా రాత్రి శిబిరము జేరి పంతము నిర్వర్తించుకొనుటకై పరమేశ్వరుని ధ్యానింపుచు నిదురించుచుండెను. ఇంతలో నొక స్వప్నము వచ్చెను. అప్పుడు జనార్దను డాతనికి శివానుగ్రహము జ్ఞాపకముజేసి ధైర్యము కలుగజేయనెంచి, యాతని ప్రక్కజేరి, "అర్జునా! నీ వరణ్యావాసమున పరమేశ్వరానుగ్రహము పొంది చేకొనిన దివ్యసాధనమగు పాశుపతము మరల నా మహేశ్వరునివలన యుపదేశము పొందితివేని నీ ప్రతిజ్ఞ నెరవేర్చుకొనగలవు నీవీ యుదకమును స్పృశించి శుచివై మహాదేవుని మనమున నిల్పి ధ్యానింపుము" అని చెప్పగా, పార్థు డట్లొనరింప మాధవుడాతని హస్తము పట్టుకొని యాకాశమున కెగిసెను.

వారిరువురు రయంబున యుత్తరాభిముఖులై పోవుచుండ, చాలదూర మెగిసినవెనుక చారణసిద్ధ గంధర్వసేవితంబును, సరిస్సరోవర సుందరంబును, పుష్పలతా భూషితంబును రమ్యతరుసంతాన కాంతంబునునైన కైలాస పర్వతం బున మహనీయ మణిమయంబై తేజరిల్లు మందిరంబున ప్రమథగణ పరివృతుం డును, పార్వతీసహితుండును, కోటిసూర్యప్రభా సమానుండును, దివ్యముని ప్రస్తూయమానుండును, రంభోర్వశీజన సంగీత మంగళమహిత పురోభాగుం డునునై కొలువై యుండు పరమేశ్వరుని సందర్శించి ప్రణవోచ్చారణ పురస్స రంబుగ దండప్రణామము లాచరించిరి మహేశుడా నరనారాయణుల మందస్మిత సుందర విలోకనంబుల నవలోకించి, "కృష్ణార్జునులారా! మీరిరువు రర్థరాత్రం బున యిచట కేతెంచుటకు కారణమేమి? మీ కోరిక ప్రసాదించెద, వచింపు"డన విని కృష్ణార్జును లుప్పొంగ కరంబులు శిరంబుల నిడికొని, "పరమేశ్వరా! త్రిలోచనా! దానవమర్దన! భుజగభూషణ! దీనజనావనా! సకలభువనమ యాత్మక! పాపభయంకర! ఆర్తత్రాణపరాయణ! ఈ జగములన్నియు సృజిం పగ, పెంచగ, సంహరింపగ నీవె సమర్థుడవని శృతులు వచింపుచున్నవి. ప్రకృతి పురుషాత్మకుడవై, వికృతులై వెలుగుచున్న యీ జీవులన్నింటికినీ నీవె కర్తవై ప్రకాశింపుచున్నావు. మహేశా! నీ మహిమ అవాఙ్మానస గోచరమై యున్నను నిశ్చలభక్తులకు సులభముగ తెలియనగును" అని అనేకవిధములుగా స్తుతించి శ్రీకృష్ణుడు పార్థుని పాశుపతాస్త్రము ప్రార్థింపుమని నుడివెను. అర్జునుడు విశ్వేశ్వరుని గని తానా నిశాసమయంబున కృష్ణునకు పూజించిన పూజాద్రవ్యం

బులను మహేశ్వరునందు గాంచి వాసుదేవుడు శివానుగ్రహ సంపన్నుడగుటకు బ్రహ్మానందమొందుచు "దేవా! భవదీయ మహాస్త్రంబును దయచేయుము" అనిన విని భక్తవత్సలుడగు పరమేశ్వరుడు చిరునగవుతో నయ్యిరువుర నవలోకించి "వీరోత్తములారా! అట నమృతమయమగు కమలాకారమున నందు బాణాసనములు గలవు. మీ రచ్చోటికిబోయి వానిని యిచ్చటికి దోడ్కొని రండ"ని యనుగ్రహించె.. అమ్మాహాత్ములు శివాజ్ఞగొని యా సరోవరమునకు జని యందు నాలుకలు జూచుచు విషజ్వాలల నిగుడింపుచు విహరించు సర్ప ద్వయంబు గాంచి పరమేశ్వరుని మనంబుల నిల్పి శతరుద్రీయమును జపించిరి.

ఆ ధనుర్బాణములు సర్పాకారమును వదలి నిజరూపమునుదాల్చెను. వారాయస్త్రంబుల గొనితెచ్చి పరమేశ్వరుని ముందట బెట్టిరి ఆ సమయమున నీలలోహిత వర్ణుండగు బాలుండొకడు రయంబున వచ్చి శర సంధానము చేయ తెరవెరింగించెను. శ్రీ శివుడు ప్రయోగోప సంహారకరంబులగు మంత్రములను యర్జునకనుగ్రహించి "ఈ శరాసనముల గొనిపోయి మరల నా సరోవరమున బెట్టిరమ్మ"ని నియమించెను.

వారలటులొనరించి శివానుగ్రహమున కానందమందుచు, పరమేశ్వరుని యనుజ్ఞ వడసి కృష్ణార్జునులు నిజశిబిరంబులకుజనిరి. అంత తెలతెలవారెను. ఆ వృత్తాంతము సోదరులకెఱింగించి కృష్ణ సాహాయ్యమున అర్జునుడు తన పై ప్రతిజ్ఞ నెరవేర్చుకొనెను.

2) శ్రీ గురుసుతుండగు అశ్వత్థామ అమిత భుజబల పరాక్రమసంప న్నుడై పాంచాలాది మహావీరులపై పగదీర్చుకొనెను. భారతము – సౌప్తిక పర్వము (యుధిష్టర కృష్ణ సంవాదము).

## శివానుగ్రహముచే అశ్వత్థామ పాంచాలాదివీరుల వధించుట

అశ్వత్థామ యర్థరాత్రంబున నొక్కడు దృష్టద్యుమ్న పాంచాలాది మహావీరులనందరను సంహరించెనని విని ధర్మతనూభవుడు వాసుదేవునితో నిట్లుజెప్పెను.

"కం॥ తక్కనుగల పాంచాలుర।
నొక్కడ శిబిరంబునొచ్చి యుక్కడలిర్పన్
బెక్కండ్ర దునిమెనటయిది
యక్కజ మగునేమికతనయధికుండయ్యెన్-"

దేవకీ నందనా! యుద్ధము చేయగా మిగిలిన పాంచాలాది మహావీరుల నొక్కడే యర్ధరాత్రమున వధించెనని విని గడు దుఃఖించితి. ఆతని కొక్కనికి మాత్రమే యింతశక్తి గలుగుటకాశ్చర్యమందెద. దీనికి కారణము వచించి మదీయసందేహ నివృత్తిగావింపుము. అనిన నమ్మహీకాంతునకు మురాంతకు డిట్లులనియె

"ధర్మజా! కృపాసముద్రుడును, నవ్యయుడును, శశిశేఖరుడును, భక్త సులభుడునునగు పరమేశ్వరుని నతులిత భక్తిసేవించి, అద్దేవ కరుణాకటాక్ష ప్రభావముచే గురుసుతుడమిత భుజబల పరాక్రమసంపన్నుడై పాంచాలాది మహావీరులపైనిట్లు పగదీర్చుకొనెను మఱియు నో రాజేంద్రా! శంకరుడు ప్రసన్నుడైన ద్రోణనందనునకు పాంచాలాది యోధుల సంహరించుట యెంత పని! నేను మహాదేవుని గూర్చి పూర్తిగ నెఱుంగుదును. ఈ దృశ్యాదృశ్య జగములలో గల సమస్త భూతములనతడే సృజించి, పెంచి లయించు చుండును మహేశ్వరుని సంకల్పమాత్రముననే నీ భువనములెల్లవర్ధిల్లుచుండును జగత్కర్తయగు శివుడు భక్త జనములకు సులభసాధ్యుడు కావున నీవు వగవం బనిలేదు. శివానుగ్రహముననే ద్రౌణి యింతపని జేసినాడు. అని వసుదేవతనూభవుడు వచించిన యజాత శత్రుడు చింతదొలగియుండెను.

"ఓం శివశివ శివశివ నమఃశివా!

ఓం తత్సత్





శ్రీ శివకామసుందరీ సమేత శ్రీ నటరాజస్వామినేనమః

# శ్రీ నటరాజస్వామి మూర్తినిర్ణయము

## చిదంబర రహస్యము

విరాట్పురుషుని రూపములోని పంచమహాభూతములలో ప్రధాన భూతమగు ఆకాశమూర్తికి స్థలము చిదంబరము. పుష్యమీ నక్షత్రయుక్త పౌర్ణమాసీ దినమున నటరాజస్వామి శివకామసుందరీ పరాశక్తిగూడి ఆనంద తాండ

వామృతమును మహర్షులు. సిద్ధులు. గంధర్వులు, దేవతలు మున్నగు భక్త వర్యులకు ప్రసాదించును.

హృదయమే చిదాకాశము. ఇదియే చిదంబరము. ఇదియే పరమేశ్వరుని నాట్యస్థానము.

చిదాకాశ స్థానమును రహస్యమందురు. దీనినే చిదంబర రహస్య మందురు.

చిదంబరము :- 1. స్థూలరూపము. 2. సూక్ష్మరూపము.

1. ఈ నాట్యములో పరమేశ్వరుని పంచకృత్యములు నాట్యభంగిమముల వలన వ్యక్తమగుచుండును. డమరకమున్న చేతితో సృష్టి, అభయ హస్తముచే స్థితి, ఎత్తిన చేతితో సంహారము, నాట్యముచేయు పాదముచే అనుగ్రహము, మరొక పాదముచే తిరోధానమును సూచితములు. ఇది స్థూలచిదంబరము.

2. సూక్ష్మ చిదంబరము శరీరాంతర్గతమయినది. భూతాకాశము లేక యితర భూతముల స్థితి యెట్లులేదో అట్లే హృదయస్పందనము లేక మిగిలిన యవయవములు పనిచేయవు కనుక హృదయమును చిదాకాశముగా చెప్పుదురు. భగవంతుని స్థానము చిదాకాశము. భగవంతుని నటనముయొక్క ప్రతిధ్వనియే మన హృదయస్పందనము. ఇడ, సుషుమ్న, పింగల యను మూడు నాడులు మన శరీరములో గలవు. అందు సుషుమ్న మధ్యనాడి దానిలో ఆరు చక్రములు గలవు. రెండేసి చక్రములు గలసి యొక గ్రంధిగానుండును. మూలాధార చక్రము మధ్య కులకందమను బిందువును కలచి పెట్టుకొని కుండలినీశక్తి యుండును. మూలాధారము సుషుమ్నా నాడికి మూలస్థానము. నాలుగు దళములు గలది. బాహ్యప్రపంచముననిది కమలాపురము అను తిరువారూర్‌గానున్నది. స్వాధిష్ఠానము ఆరు దళములు గలది. ఇది బాహ్య ప్రపంచమున జంబుకేశ్వరముగా ప్రసిద్ధిగాంచినది. ఇది శరీరములో లింగ ప్రదేశము స్థానముగాగలది. ఈ రెంటికి పైన బ్రహ్మగ్రంధికలదు. ఈ రెండు చక్రములపైన మణిపూర చక్రముగలదు. అది పదిదళములతో విరాజిల్లును. ఇది బాహ్యప్రపంచమున అరుణాచలక్షేత్రము. మణిపూర చక్రముపైన

పంద్రెండు దళములుగల అనాహత చక్రముగలదు. ఇది శరీరములో హృదయ క్షేత్రమునగలదు. దీనిని సంవిత్కమలమనియు, పూర్ణగిరి పీఠమనియు స్తుతింతురు. దీని పంద్రెండు సూర్యులు సంపూర్ణకాంతితో ప్రకాశింపజేయుదురు ఈ చక్రము బాహ్యప్రపంచమున చిదంబరము. దీని పైగ్రంథి విష్ణుగ్రంథి; దీనికి పైన పదునారు దళములు గల విశుద్ధ చక్రము మన కంఠస్థానమున నున్నది. ఇది వాయుస్థానము. ఇది కాళహస్తిగా చెప్పబడుచున్నది. దీనిపైన ద్విదళము ఆజ్ఞాచక్రము భ్రూమధ్యమందున్నది. ఇది బాహ్యప్రపంచమున కాశీ క్షేత్రము. దీనిపైన రుద్రగ్రంధియుండును దీనిపైన సహస్రదళములు గలిగి జ్వలించు సహస్రార చక్రము గలదు. దీనికి చంద్రమండలమనియు, ద్వాద శాంతమనియు బ్రహ్మరంధ్రమనియు నామములు గలవు. దీనిని బాహ్య ప్రపంచమున కైలాసమందురు.

శరీరములో మధ్యస్థానమగు హృదయమే చిదాకాశము. చిదంబరము. ఇదియే పరమేశ్వరుని నాట్యస్థానము. దీనివలన చిదంబరము స్థూలరూపము, దహరాకాశము సూక్ష్మరూపము — అని పర్యవసానము.

ఓం తత్సత్





# శ్రీ దత్తాత్రేయ మేలుకొలుపు

పల్లవి : మేలుకో శ్రీదత్త ! మేలుకో ! మేలుకో గురుదత్త ! మేలుకో !
మేలుకో ప్రభుదత్త! మేలుకో ! మేలుకో అవధూత ! మేలుకో !

దేవదత్తుండవే స్వామి ! మేలుకో ! మేలుకో గురుదేవ ! మేలుకో !
బ్రహ్మదత్తుండవే ,, ,,
విష్ణుదత్తుండవే ,, ,,
శంభుదత్తుండవే ,, ,,
అత్రిదత్తుండవే ,, ,,
అత్రివరదుండవే ,, ,,
ఆత్రేయుండవే ,, ,,
అనసూయుండవే ,, ,,
అవధూతుండవే ,, ,,
ధర్ముండవే ,, ,,

ధర్మపరాయణా స్వామి ! మేలుకో ! గురుదేవ ! మేలుకో !
ధర్మపతివే ,, ,,
సిద్ధుండవే ,, ,,
సిద్ధిదుండవే ,, ,,
సిద్ధిపతివే ,, ,,
సిద్ధిసేవితుండవే ,, ,,
గురుండవే ,, ,,
గురుగమ్యుండవే ,, ,,
గురోర్గురుతరుండవే ,, ,,
గరిష్టుండవే ,, ,,
వరిష్ఠుండవే ,, ,,
మహిష్ఠుండవే ,, ,,
మహాత్ముండవే ,, ,,
యోగుండవే ,, ,,
యోగగమ్యుండవే ,, ,,
యోగాదేశకరుండవే ,, ,,
యోగపతివే ,, ,,
యోగీశుండవే ,, ,,
యోగాధీశుండవే ,, ,,
యోగపరాయణుండవే ,, ,,
యోగిధ్యేయాంఘ్రిపంకజుండవే ,, ,,
దిగంబరుండవే ,, ,,
దివ్యాంబరుండవే ,, ,,
పీతాంబరుండవే ,, ,,
శ్వేతాంబరుండవే ,, ,,
చిత్రాంబరుండవే ,, ,,
బాలుండవే ,, ,,
బాలవీర్యుండవే ,, ,,
కుమారుండవే ,, ,,
కిశోరుండవే ,, ,,
కందర్పమోహనుండవే ,, ,,
అర్ధాంగాలింగితాంగుడవే ,, ,,
జరాంగుడవే ,, ,,
విరాంగుడవే ,, ,,

| | | | | |
|---|---|---|---|---|
| వీతరాగుండవే | స్వామి! | మేలుకో! | గురుదేవ! | మేలుకో! |
| అమృతవర్షివే | ,, | | ,, | |
| ఉగ్రుండవే | ,, | | ,, | |
| అనుగ్రరూపుండవే | ,, | | ,, | |
| స్థవీరుండవే | ,, | | ,, | |
| స్థవీయుండవే | ,, | | ,, | |
| శాంతుండవే | ,, | | ,, | |
| అఘోరుండవే | ,, | | ,, | |
| మూఢుండవే | ,, | | ,, | |
| ఊర్ధ్వరేతుండవే | ,, | | ,, | |
| ఏకవక్త్రుండవే | ,, | | ,, | |
| అనేకవక్త్రుండవే | ,, | | ,, | |
| ద్వినేత్రుండవే | ,, | | ,, | |
| త్రినేత్రుండవే | ,, | | ,, | |
| షడ్భుజుండవే | ,, | | ,, | |
| అక్షమాలివే | ,, | | ,, | |
| కమండలుధారివే | ,, | | ,, | |
| శూలివే | ,, | | ,, | |
| డమరుధారివే | ,, | | ,, | |
| శంఖివే | ,, | | ,, | |
| గదివే | ,, | | ,, | |
| మునివే | ,, | | , | |
| మౌళివే | ,, | | ,, | |
| విరూపుండవే | ,, | | ,, | |
| స్వరూపుండవే | ,, | | ,, | |
| సహస్రశిరుండవే | ,, | | ,, | |
| సహస్రాక్షుండవే | ,, | | ,, | |
| సహస్రబాహుండవే | ,, | | ,, | |
| సహస్రాయుధుండవే | ,, | | ,, | |
| సహస్రపద్మార్చితుండవే | ,, | | ,, | |
| పద్మహస్తుండవే | ,, | | ,, | |
| పద్మపాదుండవే | ,, | | ,, | |
| పద్మనాభుండవే | ,, | | ,, | |
| పద్మమాలివే | ,, | | ,, | |

| | | | | |
|---|---|---|---|---|
| పద్మగర్భారుణాక్షుండవే | స్వామి ! | మేలుకో ! | గురుదేవ ! | మేలుకో ! |
| పద్మకింజల్క వర్ణుండవే | ,, | | ,, | |
| జ్ఞానివే | ,, | | ,, | |
| జ్ఞానగమ్యుండవే | ,, | | ,, | |
| జ్ఞానవిజ్ఞానమూర్తివే | ,, | | ,, | |
| ధ్యానివే | ,, | | ,, | |
| ధ్యానన్నిష్ఠుండవే | ,, | | ,, | |
| ధ్యానస్థిమితమూర్తివే | ,, | | ,, | |
| ధూళిధూసరితాంగుండవే | ,, | | ,, | |
| చందనాలిప్తమూర్తివే | ,, | | ,, | |
| భస్మోద్ధూలితదేహుండవే | ,, | | ,, | |
| దివ్యగంధానులేపివే | ,, | | ,, | |
| ప్రసన్నుండవే | ,, | | ,, | |
| ప్రమత్తుండవే | ,, | | ,, | |
| ప్రకృష్టార్థప్రదుండవే | ,, | | ,, | |
| అష్టైశ్వర్యప్రధానుండవే | ,, | | ,, | |
| పరదుండవే | ,, | | ,, | |
| వరీయుండవే | ,, | | ,, | |
| బ్రహ్మవే | ,, | | ,, | |
| బ్రహ్మరూపుండవే | ,, | | ,, | |
| విష్ణుండవే | ,, | | ,, | |
| విశ్వరూపుండవే | ,, | | ,, | |
| శంకరుండవే | ,, | | ,, | |
| ఆత్మవే | ,, | | ,, | |
| అంతరాత్మవే | ,, | | ,, | |
| పరమాత్మవే | ,, | | ,, | |
| శ్రీ దత్తాత్రేయుండవే | ,, | | ,, | |
| శ్రీ శివస్వామివే | ,, | | ,, | |
| శ్రీ శివకుమారస్వామివే | ,, | | ,, | |
| శ్రీ గాయత్రిస్వామివే | ,, | | ,, | |
| సోమస్కందభారతీస్వామివే | ,, | | ,, | |
| చతుర్వేదిస్వామివే | ,, | | ,, | |
| తత్త్వనిదానస్వామివే | ,, | | ,, | |
| మరైకండనంబిస్వామివే | ,, | | ,, | |

| | | | | |
|---|---|---|---|---|
| త్రిమూర్తిస్వరూపుండవే | స్వామి! | మేలుకో! | గురుదేవ! | మేలుకో! |
| కలియుగదేవుండవే | ,, | | ,, | |
| ఓంకారస్వరూపుండవే | ,, | | ,, | |
| నమస్తే! నమస్తే! నమస్తే! | ,, | | ,, | |
| మంగళం బిదే | ,, | | ,, | |
| జయము! జయము! జయంబే! | ,, | | ,, | |

మేలుకో శ్రీదత్త! మేలుకో! మేలుకో! గురుదత్త! మేలుకో!
మేలుకో ప్రభుదత్త! మేలుకో! మేలుకో! అవధూత! మేలుకో!

ఓం తత్సత్

# సద్గురు మంగళ హారతులు - స్తోత్రములు

## మంగళమ్

ఓమ్ - మంగళం - ఓంకార। మంగళం - ఓమ్ నమ।
శివాయ - మంగళం। శివాయ మంగళం॥

న - మంగళం - నకార। మంగళం - నాద - బిందు।
కళాతీత - గురవే - మంగళం - సద్గురవే - మంగళం॥

మ - మంగళం - మకార। మంగళం - మాన్యదైవతా స్వరూప
గురవే - మంగళం - । సద్గురవే - మంగళం॥

శి - మంగళం - శికార। మంగళం - సిద్ధి - బుద్ధి - దాయకాయ
గురవే - మంగళం - సద్గురవే - మంగళం॥

వ - మంగళం - వకార। మంగళం - వాఙ్మనోవిగోచరాయ
గురవే - మంగళం। సద్గురవే మంగళం॥

య - మంగళం - యకార, మంగళం - వస్తురూపభావనాయ
గురవే - మంగళం। నిఖిలరూప భాసితాయ
గురవే - మంగళం। సద్గురవే - మంగళం॥

ఓం తత్సత్

ఆజానతా మయానాథ। జన్మకోటి శతైరపి।
కృతాని సర్వ పాపాని। క్షంతవ్యాని దయామయా॥

## శ్రీ గురు మంగళ హారతి

పల్లవి॥ పంచహారతులివ్వరె । గురువరునకు పంచహారతులివ్వరె ।
సద్గురునకు పంచహారతులివ్వరె ॥ పంచహారతులివ్వరె ॥
అంచితంబుగ గొల్వరె । పంచవింశతితత్త్వరూప
ప్రపంచసాక్షికి చెంచలాంగులు ॥ పంచ ॥
పదుగూరినదలించరె । ఐదుగురిని గుదియించి
బంధించరె । గదిమి నలుగురి నణచరె । పిదపనార్గురి
ద్రుంచరె । సదముదింబుగ గదిసి లోపల వెతకి పరునకు
ముదము మీరగ ॥ పంచ ॥
మండలమ్ములు మించెనె । ఆలోనహృత్పుండరీకము
గాంచెనె । ఖండమతము లడంచెనె ॥ కుండలిని
పెకలించెనె । పండువెన్నెల బయట వెలుగు అఖండ
జ్యోతికి నిండువేడ్కతో ॥ పంచ ॥
తవిలిచెంతకు జేర్చెనె । నారాయణ కవి కోర్కె
లీడేర్చెనె । భవభయంబుల బాపెనె । బంధముల బరి
మార్చెనె - భువిని శ్రీ మైలవర వేంకటశివగురూత్త
మునకు - ధృవంబుగ ॥ పంచహారతులివ్వరె ॥ = ॥ =

### శ్రీ గురుదేవులు - 25 తత్త్వరూప ప్రపంచ సాక్షి

10 తత్త్వములు - అదలించుట (ఇంద్రియములు)
5 తత్త్వములు - గుదియించుట (పంచతన్మాత్రలు)
4 తత్త్వములు - అణచుట (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము)
6 తత్త్వములు - ద్రుంచుట (అరిషడ్వర్గములు)

### 25 తత్త్వములు :

24 తత్త్వములు
25వ తత్త్వము జీవుడు
మాయామర్మములు

26 ఈశ్వరుడు, 27 ఆత్మ, 28 అంతరాత్మ, 29 పరమాత్మ.

బ్రహ్మము :— శాంతము, సమము, దమము, ఉపరతి
సత్పురుషులు :— శ్రద్ధ, సమాధానము
దుష్పురుషులు :— కామ, క్రోధ, లోభ, మోహ, మదమాత్సర్యములు

## శ్రీ సద్గురు మంగళ హారతి

మంగళం మంగళం సద్గురురాయ (అనుపల్లవి)
నాదుబిందాయె । బిందునాదాయె । బిందుబీజము సందు
భేదములాయె । బిందుబీజము సందుభేదము దెలిసితె ।
సందేహము లేదాయె । సర్వము తానాయె ॥మంగళం॥
సత్తుతానాయె । చిత్తుతానాయె । సత్తుచిత్తుల సందు సమరస
మెఱిగితె । వత్తిలేని జ్యోతి వైభవమాయె ॥మంగళం॥
క్షరము తానాయె । అక్షరము తానాయె । క్షరమక్షరముల
సందు । సాక్షితానాయె । క్షరమక్షరముల సందు సాక్షితా
దెలిసితె । అమనస్కరంబాయె । అంతా తానాయె ॥మంగళం॥
చూపుతానాయె । రూపుతానాయె । చూపురూపుల సందు
ప్రాపుతాదెలిసితె । పాపము లేదాయె । పరమ పదమాయె ॥మంగళం॥
నేను నీవాయె । నీవు నేనాయె । నీనామర్మము సందు । నిజబోధ
లాయె । నీనామర్మము సందు నిజబోధ దెలిసితె ।
మానావమానములు మరి నిల్వవాయె ॥మంగళం॥
అంగ లింగామాయె లింగాంగమాయె । అంగ లింగముల సందు
అనుభవమాయె । అంగ లింగముల సందు అనుభవ మెఱిగితె ।
లింగాము లేదాయె । నిరంజనమాయె ॥మంగళం॥
గురువు శిష్యుడాయె । శిష్యుడు గురువాయె । గురుశిష్యుల
సందు గురి వక్కటాయె। గురుడె దత్తాత్రేయ
హరుడని తెలిసితె । యెఱుకలేకపోయె ।
యేమిలేదాయె ॥మంగళం మంగళం సద్గురురాయ॥



పండ్రెండు దళములుగల అనాహత చక్రముగలదు. ఇది శరీరములో హృదయ క్షేత్రముగలదు. దీనిని సంవిత్కమలమనియు, పూర్ణగిరి పీఠమనియు స్తుతింతురు. దీని పండ్రెండు సూర్యులు సంపూర్ణకాంతితో ప్రకాశింపజేయుదురు ఈ చక్రము బాహ్యప్రపంచమున చిదంబరము. దీని పైగ్రంథి విష్ణుగ్రంథి; దీనికి పైన పదునాఱు దళములు గల విశుద్ధ చక్రము మన కంఠస్థానమున నున్నది. ఇది వాయుస్థానము. ఇది కాళహస్తిగా చెప్పబడుచున్నది. దీనిపైన ద్విదళము ఆజ్ఞాచక్రము భ్రూమధ్యమందున్నది. ఇది బాహ్యప్రపంచమున కాశీ క్షేత్రము. దీనిపైన రుద్రగ్రంథియుండును దీనిపైన సహస్రదళములు గలిగి జ్వలించు సహస్రార చక్రము గలదు. దీనికి చంద్రమండలమనియు, ద్వాదశాంతమనియు బ్రహ్మరంధ్రమనియు నామములు గలవు. దీనిని బాహ్య ప్రపంచమున కైలాసమందురు.

శరీరములో మధ్యస్థానమగు హృదయమే చిదాకాశము. చిదంబరము. ఇదియే పరమేశ్వరుని నాట్యస్థానము. దీనివలన చిదంబరము స్థూలరూపము, దహరాకాశము సూక్ష్మరూపము — అని పర్యవసానము.

ఓం తత్సత్





# శ్రీ దత్తాత్రేయ మేలుకొలుపు

పల్లవి : మేలుకో శ్రీదత్త! మేలుకో! మేలుకో గురుదత్త! మేలుకో!
మేలుకో ప్రభుదత్త! మేలుకో! మేలుకో అవధూత! మేలుకో!

దేవదత్తుండవే స్వామి! మేలుకో! మేలుకో గురుదేవ! మేలుకో!
బ్రహ్మదత్తుండవే ,, ,,
విష్ణుదత్తుండవే ,, ,,
శంభుదత్తుండవే ,, ,,
అత్రిదత్తుండవే ,, ,,
అత్రివరదుండవే ,, ,,
ఆత్రేయుండవే ,, ,,
అనసూయుండవే ,, ,,
అవధూతుండవే ,, ,,
ధర్ముండవే ,, ,,

| ధర్మపరాయణా | స్వామి ! | మేలుకో ! | గురుదేవ ! | మేలుకో ! |
|---|---|---|---|---|
| ధర్మపతివే | ,, | | ,, | |
| సిద్ధుండవే | ,, | | ,, | |
| సిద్ధిదుండవే | ,, | | ,, | |
| సిద్ధిపతివే | ,, | | ,, | |
| సిద్ధిసేవితుండవే | ,, | | ,, | |
| గురుండవే | ,, | | ,, | |
| గురుగమ్యుండవే | ,, | | ,, | |
| గురోర్గురుతరుండవే | ,, | | ,, | |
| గరిష్ఠుండవే | ,, | | ,, | |
| వరిష్ఠుండవే | ,, | | ,, | |
| మహిష్ణుండవే | ,, | | ,, | |
| మహాత్ముండవే | ,, | | ,, | |
| యోగుండవే | ,, | | ,, | |
| యోగగమ్యుండవే | ,, | | ,, | |
| యోగాదేశకరుండవే | ,, | | ,, | |
| యోగపతివే | ,, | | ,, | |
| యోగీశుండవే | ,, | | ,, | |
| యోగాధీశుండవే | ,, | | ,, | |
| యోగపరాయణుండవే | ,, | | ,, | |
| యోగిధ్యేయాంఘ్రిపంకజుండవే | ,, | | ,, | |
| దిగంబరుండవే | ,, | | ,, | |
| దివ్యాంబరుండవే | ,, | | ,, | |
| పీతాంబరుండవే | ,, | | ,, | |
| శ్వేతాంబరుండవే | ,, | | ,, | |
| చిత్రాంబరుండవే | ,, | | ,, | |
| బాలుండవే | ,, | | ,, | |
| బాలవీర్యుండవే | ,, | | ,, | |
| కుమారుండవే | ,, | | ,, | |
| కిశోరుండవే | ,, | | ,, | |
| కందర్పమోహనుండవే | ,, | | ,, | |
| అర్ధంగాలింగితాంగుడవే | ,, | | ,, | |
| ఖరాంగుడవే | ,, | | ,, | |
| విరాంగుడవే | ,, | | ,, | |

| | | | | |
|---|---|---|---|---|
| వీతరాగుండవే | స్వామి! | మేలుకో! | గురుదేవ! | మేలుకో! |
| అమృతవర్షివే | ,, | | ,, | |
| ఉగ్రుండవే | ,, | | ,, | |
| అనుగ్రరూపుండవే | ,, | | ,, | |
| స్థవీరుండవే | ,, | | ,, | |
| స్థవీయుండవే | ,, | | ,, | |
| శాంతుండవే | ,, | | ,, | |
| అఘోరుండవే | ,, | | ,, | |
| మూఢుండవే | ,, | | ,, | |
| ఊర్ధ్వరేతుండవే | ,, | | ,, | |
| ఏకవక్త్రుండవే | ,, | | ,, | |
| అనేకవక్త్రుండవే | ,, | | ,, | |
| ద్వినేత్రుండవే | ,, | | ,, | |
| త్రినేత్రుండవే | ,, | | ,, | |
| షడ్భుజుండవే | ,, | | ,, | |
| అక్షమాలివే | ,, | | ,, | |
| కమండలుధారివే | ,, | | ,, | |
| శూలివే | ,, | | ,, | |
| డమరుధారివే | ,, | | ,, | |
| శంఖివే | ,, | | ,, | |
| గదివే | ,, | | ,, | |
| మునివే | ,, | | , | |
| మౌలివే | ,, | | ,, | |
| విరూపుండవే | ,, | | ,, | |
| స్వరూపుండవే | ,, | | ,, | |
| సహస్రశిరుండవే | ,, | | ,, | |
| సహస్రాక్షుండవే | ,, | | ,, | |
| సహస్రబాహుండవే | ,, | | ,, | |
| సహస్రాయుధుండవే | ,, | | ,, | |
| సహస్రపద్మార్చితుండవే | ,, | | ,, | |
| పద్మహస్తుండవే | ,, | | ,, | |
| పద్మపాదుండవే | ,, | | ,, | |
| పద్మనాభుండవే | ,, | | ,, | |
| పద్మమాలివే | ,, | | ,, | |

| | | | | |
|---|---|---|---|---|
| పద్మగర్భారుణాక్షుండవే | స్వామి ! | మేలుకో ! | గురుదేవ ! | మేలుకో ! |
| పద్మకింజల్క వర్చుండవే | ,, | | ,, | |
| జ్ఞానివే | ,, | | ,, | |
| జ్ఞానగమ్యుండవే | ,, | | ,, | |
| జ్ఞానవిజ్ఞానమూర్తివే | ,, | | ,, | |
| ధ్యానివే | ,, | | ,, | |
| ధ్యానని ష్ఠుండవే | ,, | | ,, | |
| ధ్యానస్థిమితమూర్తివే | ,, | | ,, | |
| ధూళిధూసరితాంగుండవే | ,, | | ,, | |
| చందనాలిప్తమూర్తివే | ,, | | ,, | |
| భస్మోద్ధూలితదేహుండవే | ,, | | ,, | |
| దివ్యగంధానులేపివే | ,, | | ,, | |
| ప్రసన్నుండవే | ,, | | ,, | |
| ప్రమత్తుండవే | ,, | | ,, | |
| ప్రకృష్టార్థప్రదుండవే | ,, | | ,, | |
| అష్టైశ్వర్యప్రధానుండవే | ,, | | ,, | |
| వరదుండవే | ,, | | ,, | |
| వరీయుండవే | ,, | | ,, | |
| బ్రహ్మవే | ,, | | ,, | |
| బ్రహ్మరూపుండవే | ,, | | ,, | |
| విష్ణుండవే | ,, | | ,, | |
| విశ్వరూపుండవే | ,, | | ,, | |
| శంకరుండవే | ,, | | ,, | |
| ఆత్మవే | ,, | | ,, | |
| అంతరాత్మవే | ,, | | ,, | |
| పరమాత్మవే | ,, | | ,, | |
| శ్రీ దత్తాత్రేయుండవే | ,, | | ,, | |
| శ్రీ శివస్వామివే | ,, | | ,, | |
| శ్రీ శివకుమారస్వామివే | ,, | | ,, | |
| శ్రీ గాయత్రిస్వామివే | ,, | | ,, | |
| సోమస్కందభారతీస్వామివే | ,, | | ,, | |
| చతుర్వేదిస్వామివే | ,, | | ,, | |
| తత్త్వనిదానస్వామివే | ,, | | ,, | |
| మరైకండనంబిస్వామివే | ,, | | ,, | |

| | | | | |
|---|---|---|---|---|
| పద్మగర్భారుణాక్షుండవే | స్వామి! | మేలుకో! | గురుదేవ! | మేలుకో! |
| పద్మకింజల్కవర్చుండవే | ,, | | ,, | |
| జ్ఞానివే | ,, | | ,, | |
| జ్ఞానగమ్యుండవే | ,, | | ,, | |
| జ్ఞానవిజ్ఞానమూర్తివే | ,, | | ,, | |
| ధ్యానివే | ,, | | ,, | |
| ధ్యాననిష్ఠుండవే | ,, | | ,, | |
| ధ్యానస్తిమితమూర్తివే | ,, | | ,, | |
| ధూళిధూసరితాంగుండవే | ,, | | ,, | |
| చందనాలిప్తమూర్తివే | ,, | | ,, | |
| భస్మోద్ధూళితదేహుండవే | ,, | | ,, | |
| దివ్యగంధానులేపివే | ,, | | ,, | |
| ప్రసన్నుండవే | ,, | | ,, | |
| ప్రమత్తుండవే | ,, | | ,, | |
| ప్రకృష్టార్థప్రదుండవే | ,, | | ,, | |
| అష్టైశ్వర్యప్రధానుండవే | ,, | | ,, | |
| వరదుండవే | ,, | | ,, | |
| వరీయుండవే | ,, | | ,, | |
| బ్రహ్మవే | ,, | | ,, | |
| బ్రహ్మరూపుండవే | ,, | | ,, | |
| విష్ణుండవే | ,, | | ,, | |
| విశ్వరూపుండవే | ,, | | ,, | |
| శంకరుండవే | ,, | | ,, | |
| ఆత్మవే | ,, | | ,, | |
| అంతరాత్మవే | ,, | | ,, | |
| పరమాత్మవే | ,, | | ,, | |
| శ్రీ దత్తాత్రేయుండవే | ,, | | ,, | |
| శ్రీ శివస్వామివే | ,, | | ,, | |
| శ్రీ శివకుమారస్వామివే | ,, | | ,, | |
| శ్రీ గాయత్రిస్వామివే | ,, | | ,, | |
| సోమస్కందభారతీస్వామివే | ,, | | ,, | |
| చతుర్వేదిస్వామివే | ,, | | ,, | |
| తత్త్వనిదానస్వామివే | ,, | | ,, | |
| మరైకందనంబిస్వామివే | ,, | | ,, | |

## శ్రీ గురు మంగళ హారతి

పల్లవి॥ పంచహారతులివ్వరె । గురువరునకు పంచహారతులివ్వరె ।
సద్గురునకు పంచహారతులివ్వరె ॥ పంచహారతులివ్వరె ॥
అంచితంబుగ గొల్వరె । పంచవింశతితత్త్వరూప
ప్రపంచసాక్షికి చెంచలాంగులు ॥ పంచ ॥
పదుగూరినదలించరె । ఐదుగురిని గుదియించి
బంధించరె । గదిమి నలుగురి నణచరె । పిదపనార్గురి
ద్రుంచరె । సదముదంబుగ గదిసి లోపలవెతకి పరునకు
ముదము మీరగ ॥ పంచ ॥
మండలమ్ములు మించెనె । ఆలోనహృత్పుండరీకము
గాంచెనె । ఖండమతము లడంచెనె ॥ కుండలిని
పెకలించెనె । పండువెన్నెల బయట వెలుగు అఖండ
జ్యోతికి నిండువేడ్కతో ॥ పంచ ॥
తవిలిచెంతకు జేర్చెనె । నారాయణ కవి కోర్కె
లీడేర్చెనె । భవభయంబుల బాపెనె । బంధముల బరి
మార్చెనె – భువిని శ్రీ మైలవర వేంకటశివగురూత్త
మునకు – ధృవంబుగ ॥ పంచహారతులివ్వరె ॥ = ॥ =

### శ్రీ గురుదేవులు - 25 తత్త్వరూప ప్రపంచ సాక్షి

10 తత్త్వములు – అదలించుట (ఇంద్రియములు)
5 తత్త్వములు – గుదియించుట (పంచతన్మాత్రలు)
4 తత్త్వములు – అణచుట (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము)
6 తత్త్వములు – ద్రుంచుట (అరిషడ్వర్గములు)

**25 తత్త్వములు :**

24 తత్త్వములు
25వ తత్త్వము జీవుడు
మాయామర్మములు

26 ఈశ్వరుడు, 27 ఆత్మ, 28 అంతరాత్మ, 29 పరమాత్మ.

బ్రహ్మము :— శాంతము, సమము, దమము, ఉపరతి
సత్పురుషులు :— శ్రద్ధ, సమాధానము
దుష్పురుషులు :— కామ, క్రోధ, లోభ, మోహ, మదమాత్సర్యములు

## శ్రీ సద్గురు మంగళ హారతి

మంగళం మంగళం సద్గురురాయ (అనుపల్లవి)
నాదుబిందాయె । బిందునాదాయె । బిందుబీజము సందు
భేదములాయె । బిందుబీజము సందుభేదము దెలిసితె ।
సందేహము లేదాయె । సర్వము తానాయె ॥మంగళం॥
సత్తుతానాయె । చిత్తుతానాయె । సత్తుచిత్తుల సందు సమరస
మెఱిగితె । వత్తిలేని జ్యోతి వైభవమాయె ॥మంగళం॥
క్షరము తానాయె । అక్షరము తానాయె । క్షరమక్షరముల
సందు । సాక్షితానాయె । క్షరమక్షరముల సందు సాక్షితా
దెలిసితె । అమనస్కారంబాయె । అంతా తానాయె ॥మంగళం॥
చూపుతానాయె । రూపుతానాయె । చూపురూపుల సందు
ప్రాపుతాదెలిసితె । పాపము లేదాయె । పరమ పదమాయె ॥మంగళం॥
నేను నీవాయె । నీవు నేనాయె । నీనామర్మము సందు । నిజబోధ
లాయె । నీనామర్మము సందు నిజబోధ దెలిసితె ।
మానావమానములు మరి నిల్వవాయె ॥మంగళం॥
అంగ లింగామాయె లింగాంగమాయె । అంగ లింగముల సందు
అనుభవమాయె । అంగ లింగముల సందు అనుభవ మెఱిగితె ।
లింగాము లేదాయె । నిరంజనమాయె ॥మంగళం॥
గురువు శిష్యుడాయె । శిష్యుడు గురువాయె । గురుశిష్యుల
సందు గురి వక్కటాయె। గురుడె దత్తాత్రేయ
హరుడని తెలిసితె । యెఱుక లేకపోయె ।
యేమిలేదాయె ॥మంగళం మంగళం సద్గురురాయ॥



# సంసార దీపము




మనస్సను ప్రమిదయందు
కర్మయను చమురుపోసి
దేహమను ప్రత్తినుంచి
దేహాత్మాభిమానమను అగ్నిని సంయోగపరచిన (అగ్నిచే వెలిగించిన) సంసారదీప మగును.

## ఫలశృతి

దీనిని భక్తి పఠించిన
మానవ సంతతికి, సర్వమంగళ లీలా
శ్రీ నెలవుకొనును, సౌఖ్య వి
తానము నిడు శివుడు కరుణ తళుకొత్తంగన్.

ఓం. సహనావవతు, సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై తేజస్వినా
వధీతమస్తు, మావిద్విషావహై.

ఓం తత్సత్.